# చతుర

ఆగస్టు 2016
రూ. 15/-

* బంకించంద్ర బెంగాలీ నవల
చంద్రశేఖర్ .... 06

* ప్రతిభారాయ్ కథ
సోదరికి వాటా .... 101

* నవలావలోకనం
వసంతరావు దేశపాండే
అడవి .... 115





# పుష్ప సృష్టి..!



సృష్టికి ప్రతిసృష్టి
విశ్వామిత్రుడు చేశాడనడం
ఏమో గానీ
ఈ పూలు మాత్రం
ప్రకృతి సృష్టే అని బల్లగుద్ది మరీ చెప్పొచ్చు!



వారెవ్వా!





# మనసున ఉన్నదీ...

★ జులై సంచికలో బి.గీతిక నవల 'అద్వైతం' చాలా బాగుంది. స్త్రీ గొప్పా? పురుషుడు గొప్పా? అనే వాదన ఈ సమాజంలో ఎప్పుడూ ఉండేదే.. అయితే ఇద్దరూ కలిసి ముందుకు సాగితేనే మానవజాతికి మనుగడ అని చక్కగా చెప్పారు. 'నవలావలోకనం'లోని కె.ఎన్.వై. పతంజలి 'ఖాకీవనం'పై విశ్లేషణ బాగుంది. 'చతుర'లో 1980లో ప్రచురితమైన ఈ నవల నాటికీ, నేటికీ ఒక సంచలనంగా మిగిలిపోయింది.

**– మార్టూరు అజయ్‌కుమార్,**
*రామచంద్రాపురం, గుంటూరు జిల్లా*

★ ముచ్చటగొలిపే ముఖచిత్రంతో వెలువడిన 'చతుర' చక్కని నవలను అందించింది. రకరకాల మనస్తత్వాల పాత్రలను, వాటిలోని మార్పులను చక్కగా చూపించారు. రచయిత్రికి అభినందనలు. 'నవలావలోకనం'లో.. ప్రజలను రక్షించాల్సిన రక్షకభటులే ఎలా భక్షిస్తారో కళ్లకు కట్టినట్లు వివరించిన పతంజలి నవల 'ఖాకీవనం'పై సమీక్ష బాగుంది.

**– *కరణం శివానందరావు*, కర్నూలు**

★ జులై సంచిక ముఖచిత్రం చాలా బాగుంది. 'అద్వైతం' నవల ముందు ముందు ఏం జరుగుతుందా? అన్న ఉత్సుకతతో ఆసాంతం చదివించింది. అన్ని పాత్రలనూ సహజంగా చిత్రీకరించారు. ధర్మసందేహాలకు సమాధానాలు ఇవ్వడం బాగుంది. 'చిటికెలో రుచిగా..!' భలే పసందుగా ఉంది. 'దొంగ దెబ్బలు' ఇంచుమించు ప్రతికాలనీలోనూ నిత్యం జరుగుతూనే ఉంది.

**– *యం.వి. సుందరి*, హైదరాబాద్**

★ తెలుగు సాహితీవనంలో 'చతుర'కు విరబూసిన నవలా కుసుమాలు ఎన్నో! 'అద్వైతం' ఆ కోవలోనిదే! ఈ నవల మంచిచెడులను ఏకకాలంలో విశ్లేషించగలిగింది. ఈ పురుషాధిక్య ప్రపంచంలో ఆడవాళ్లు ఉద్యోగం చెయ్యాలి, కానీ తమకన్నా పైస్థాయిలో ఉండకూడదు. కానీ ఈ లక్ష్మణరేఖను నందుడనే పురుషుడు అతిక్రమించడం పురుషభావజాలంలో వస్తున్న మార్పుకు సంకేతం. నందన్, గౌరి ప్రాతలు చెడుకు ప్రతీక. అగ్నిసాక్షిగా జరిగే వివాహానికి కొత్త అర్థాన్ని చెప్పారు. 'ఖాకీవనం' పాతదే కావచ్చు కానీ అందులోని యథార్థాల వల్ల కలకాలం గుర్తుంటుంది. 'కొత్తగాలి' కొత్త పుంతలు తొక్కుతోంది.

**– *కె. లహరి*, చెల్పూరు, వరంగల్ జిల్లా**

★ జులై 'చతుర'లో చమత్'కారం' అక్షరాలా పదాలగారడీ! ఈ శీర్షిక చాలా నచ్చింది. ఎన్నో టెన్షన్లతో ఇంటికెళ్లే సరికి ఇది చక్కని రీఛార్జ్‌లా ఉంటోంది. విసిగి వేసారిన ప్రాణాలను ఉత్తేజపరుస్తుందనడంలో సందేహం లేదు!

**– మహమ్మద్ జఫరుల్లాఖాన్,**
*మహబూబ్ నగర్*

★ 'అద్వైతం' ఆసాంతం చదివించింది. నవలలోని పాత్రలు వ్యవహరించిన తీరు విభిన్నంగా ఉంది. 'ఖాకీవనం' సమీక్ష గతస్మృతుల్లోకి తీసుకెళ్లింది. పోలీసు శాఖలో ప్రక్షాళనకు ఈ నవల నాంది అయింది.

**– గానుగపెంట నరసింహులు,**
*బద్వేలు, కడప జిల్లా*

★ 'అద్వైతం' నవల ఆసాంతం ఆసక్తిగా చదివించింది. వర్ణ పాత్రను ఆధునిక యువతికి ప్రతీకలా చూపిస్తూనే కుటుంబ విలువలకు ప్రాధాన్యమిచ్చే ప్రత్యేక వ్యక్తిత్వంతో ఆకర్షణీయంగా మలిచారు. 'ఖాకీవనం' పోలీసు వ్యవస్థలోని వాస్తవ అంశాలను కళ్లకు కట్టింది. చమత్'కారం' 'చతుర'కో కీర్తికిరీటం. 'చిట్కాలక్ష్మి' చిట్కాలు ఎంతో ఉపయుక్తంగా ఉంటున్నాయి.

**– పి. శైలజ, నవులూరు**

★ మూడు తరాల జంటలతో ముప్పేట గొలుసులా చక్కని ఇతివృత్తంతో బి. గీతిక 'అద్వైతం' నవలను తీర్చిదిద్దారు. 'కొత్తగాలి' కవితలు సమయానుగుణంగా బాగుంటున్నాయి. 'నవలావలోకనం'లోని 'ఖాకీవనం'పై సమీక్ష, చతురకత 'దొంగ దెబ్బలు' బాగున్నాయి.

**– కామేశ్వరీతాయ్**

సంపుటి -39,
సంచిక - 7
463వ సంచిక,
పేజీలు : 132, ఆగస్టు 2016

# చతుర

ఆమె అందమే ఆమెకు శాపమైంది!
వలచినవాడు వల్లకాదన్నాడు.. అతని సమస్యలు అతనివి!
ఆ దశలో ఆమె జీవితంలోకి వచ్చాడో పండితుడు..
ఆయన దృష్టంతా వేదాలు ఉపనిషత్తులు.. కావ్య మీమాంసలపైనే!
అలాంటి స్థితిలో భర్త ఇంటలేనివేళ బలవంతంగా అపహరించుకుపోయాడో
ఆంగ్లేయుడు! అంతకుముందెప్పుడో ఆమె కొలనులో
స్నానమాడే వేళ పొంచి చూశాడా తెల్లదొర!
చివరికామె పరిస్థితి ఏ దశకు చేరింది?
అలనాటి దేశకాలమాన పరిస్థితులకు అద్దం పడుతూనే భారతీయ సంస్కృతికి పెద్దపీట వేసిన **బంకించంద్ర ఛటోపాధ్యాయ** బెంగాలీ నవలకు **ధప్పూరి శ్రీధరాచార్యులు** తేటతెనుగు అనువాదం **చంద్రశేఖర్**



పేజీ నెం. 6



★ ముఖచిత్ర
ఛాయాగ్రాహకుడు: దిలీప్ బెనర్జీ
★ రెండో కవరు : వారెవ్వా!
★ చివరి కవరు : నటి సురభి
★ పుస్తకాలంకరణ : రాజు యాట

e-mail: vipula.chatura@eenadu.net /
vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

✸ శ్రీకాంత్, సుమతి అన్నాచెల్లెళ్లు. ఒకరంటే ఒకరికి ప్రాణం. ఇద్దరి పెళ్లిళ్లు జరిగాయి. కానీ ఒక రాక్షసి వారి మధ్య చిచ్చు పెట్టింది. అపురూప అనుబంధాన్ని తుంచేసింది. ఒకరి ముఖం ఒకరు చూసుకోవడానికి కూడా ఇష్టపడని పరిస్థితికి తెచ్చింది. ఇంతకీ ఆ అన్నాచెల్లెళ్ల మధ్య అగాధాన్ని సృష్టించిన ఆ రాక్షసి ఎవరు? జ్ఞానపీఠ గ్రహీత **ప్రతిభా రాయ్** పెద్దకథ **సోదరికి వాటా..**

పేజీ నెం. 101

✸ నవలావలోకనంలో.. 'చతుర' నవలల పోటీలో బహుమతి పొందిన ప్రసిద్ధ రచయిత **వసంతరావు దేశపాండే అడవి**పై అపురూప విశ్లేషణ. చరిత్రను, సంస్కృతిని జమిలిగా అక్షరీకరించిన అద్భుతమైన అరణ్యకావ్యం **అడవి!**

పేజీ నెం. 115

బంకించంద్ర ఛటోపాధ్యాయ

# చంద్రశేఖర్

'నన్నిక్కడికెందుకు తీసుకొచ్చారు?' శరీరం కంపిస్తుండగా అడిగింది శైవలిని.

'నీవంటి పాపాత్మురాలి ముఖం చూడ్డానికి తీసుకురాలేదు. మ్లేచ్ఛుని చెర నుండి విడిపించాను' చెప్పాడు ప్రతాప్.

'దౌర్భాగ్యురాలినని అనుకుంటే కాల్చి పారేయాల్సింది' అంది శైవలిని.

'ఆ పని చేసేవాడినే. నువ్వు చావటమే మంచిది' కోపంతో ఊగిపోయాడు ప్రతాప్.

'నాకీ దుర్దశ ఎవరివల్ల కలిగింది? కారణం నువ్వు కాదా?' నిలదీసింది శైవలిని.

చంపేంత పాపం శైవలిని ఏం చేసింది? ఆ పరిస్థితికి ప్రతాప్ ఎలా కారణమయ్యాడు? ఆద్యంతం ఉత్కంఠగా సాగే బంకించంద్ర ఛటోపాధ్యాయ బెంగాలీ నవలకు ధపూ్వరి శ్రీధరాచార్యులు తేటతెనుగు అనువాదం

**చంద్రశేఖర్**

చతుర ఆగస్టు కానుక!



గంగానదీతీరంలోని ఓ మామిడితోట! సాయంసంధ్యా వేళ ఆ తోటలో కూర్చుని ఓ బాలుడు నదీ ప్రవాహం గల గలల్ని వింటున్నాడు.

పచ్చగా పెరిగిన గడ్డిలో ఓ బాలిక అతని పాదాల వద్ద బోర్లాపడుకుని ముఖంలోకి మౌనంగా చూస్తోంది. ఓ మారు ఆకాశం వైపు, నదివైపు, చెట్లవైపు చూస్తూ తిరిగి అతని ముఖాన్నే పరికిస్తోందామె.

ఆ బాలుడి పేరు ప్రతాప్. బాలిక పేరు శైవలిని. ఆమె వయస్సు ఏడెనిమిదేళ్లే కానీ అతడు కిశోరప్రాయుడు.

తలపై నుండి చాతక పక్షి అరుస్తూ ఎగిరిపోయింది. శైవలిని ఆ పక్షి అరుపును అనుకరిస్తూ ఆ తోట ప్రతిధ్వనించేలా అరిచింది. నదీజలాల గలగలల్లో ఆ శబ్దం కూడా కలిసిపోయింది.

బాలిక ఆ వనంలోని పూలను ఏరి ఓ దండ గుచ్చింది. మొదట అతని మెడలో వేసింది. మళ్లీ తీసి తన కొప్పులో అలంకరించుకుంది. అదీ నచ్చనట్లు తీసి మళ్లీ అతని మెడలో వేసింది. చివరకు మాలనెవరు ధరించాలో నిర్ణయించలేక అక్కడే గడ్డిమేస్తున్న ఆవు కొమ్ములకు చుట్టేసింది.

ప్రతాప్ ఎప్పుడూ ఆకతాయే! గూళ్ళలోని పక్షిపిల్లల్ని కింద పడేయడమో, మామిడి పిందెల్ని రాల్చడమో చేస్తుంటాడు.

"శై...! అటుచూడు పడవలు చాలా వస్తున్నాయి. చెప్పు పదహారా? పద్ధెనిమిదా? నీ సత్తాచూపించు!" అన్నాడు బాలికతో ప్రతాప్.

శైవలినికి లెక్కింపు రాదు. ఓసారి లెక్కిస్తే తొమ్మిది. రెండోసారి ఇరవై ఒక్కటి వచ్చాయి. అలాక్కాదని మళ్ళీ లెక్కింపు మొదలెట్టింది.

ఆ పడవల్లో ప్రత్యేకంగా ఉన్న పడవపై ఇద్దరి దృష్టీ ఒకేసారి పడింది. ఆ నావలో ఎవరున్నారు? అదెక్కడ్నుంచి వస్తోంది? నావ పైనున్నవారు తెడ్లు వేస్తుంటే పైకి లేస్తున్న నీళ్లు సూర్యుని సాయంవెలుగుల్లో బంగారు రంగులో మెరుస్తున్నాయి.

★ ★ ★

ప్రతాప్, శైవలినిల మధ్య క్రమంగా ప్రేమ జనించింది. అది ప్రేమ కావచ్చు. కాకపోవచ్చు. కారణం అతడు పదహారేళ్ళ నాయకుడు, ఆమె ఎనిమిదేళ్ళ నాయిక. పిల్లల్లా ఎవరు ప్రేమించుకుంటారు?

బాల్యపు ప్రేమలో చాలా గాఢత ఉంటుంది. బాల్యంలో ప్రేమించుకున్న వాళ్ళలో ఎందరు యవ్వనంలో కలసిఉంటారు? ఎందరు ప్రేమకు యోగ్యులౌతారు? ఆ ప్రేమలు కేవలం వృద్ధాప్యంలో జ్ఞాపకాల్లా మిగులుతుంటాయి. కానీ బాల్యంలోని ఆ ప్రేమ తియ్యదనాన్ని జీవితంలో ఎవరూ మరిచిపోలేరు.

ప్రతి పిల్లవాడు ఎప్పుడో ఒకప్పుడు ఆ అనుభవాన్ని పొందుతాడు. తను చూసిన ఆ బాలిక ముఖమేం అందంగా ఉంది.. ఆమె కళ్ళలో ఎంత ఆకర్షణ ఉంది.. అనుకుంటాడు. కానీ అది అర్థం కాదు. తామాడే ఆటలు విడిచిపెట్టి ఆమె ముఖమే చూస్తుంటాడు. తర్వాత్తర్వాత అదే అందమైన ముఖం, అదే చూపు.. కాలం గడిచిపోతోంది. ఆమె కోసం ప్రపంచంలో వెదికి చూస్తే దొరకదు. జ్ఞాపకంలో మాత్రమే ఆమె మిగిలి ఉంటుంది. బాల్యంనాటి ప్రేమలో దగ్గరితనం ఉంటుంది. అందులో తెలియని ప్రేమ బంధం ఉంటుంది.

ప్రతాప్ తనను పెళ్లాడతాడని శైవలిని మనసులో అనుకుంటుంది. ప్రతాప్‌కు తెలుసు అది సాధ్యం కాదని.

వాళ్లిద్దరిదీ ఒకే కులం! రెండు కుటుంబాలకూ దూరపు బంధుత్వం కూడా!

శైవలిని పేదపిల్ల. తల్లి తప్ప మరెవరూ లేరు. సంపద అసలే లేదు. కేవలం ఓ గుడిసె, శైవలినిలోని అందచందాలు.. ఇవే ఆమె ధనం.

ప్రతాప్ కూడా బీదవాడే.

శైవలిని దినదిన ప్రవర్ధమానమవుతూ అందచందాల్లో షోడశకళల్ని సంతరించు కుంటోంది. కానీ ఇంకా పెళ్ళి కాలేదు.

పెళ్లికి పెద్దల అంగీకారం లేదు పైగా డబ్బు కావాలి. ఆమె కోసం ఖర్చు చేసేవారెవరున్నారు? అడవిలో వికసించే అందాన్ని ఎవరు వెదికి తీసుకుపోతారు? కాలం గడుస్తూన్నకొద్దీ ఆమెలో జ్ఞానం వృద్ధి పొందసాగింది.

ఇద్దరూ కలిసి ఆలోచించారు. అలా ఆలోచిస్తూనే ఒక నిర్ణయానికి వచ్చారు. ఇద్దరూ గంగానది చేరుకున్నారు. చాలా మంది గంగలో ఈదులాడుతున్నారు.

"శై.. రా! మనం ఈతకొడదాం రా!" అంటూ ప్రతాప్ పిలిచాడు.

ఇద్దరూ గంగానదిలో దిగి ఈదడం ప్రారంభించారు.

ఇద్దరూ ఈతలో నేర్పరులే! వాళ్లలా ఈదేవాళ్లు ఆ గ్రామంలో మరెవరూ లేరు. వర్షాకాలం కాబట్టి గంగ నిండుగా, వేగంగా ఉంది. ఇరు తటులను తాకుతూ ప్రవహి స్తోంది. ఇద్దరూ వేగంగా నదీజలాల్ని చీలుస్తూ ముందుకు దూసుకుపోతు న్నారు. గంగా ఫేనలిలో ఇద్దరూ వెండి ఉంగరంలోని మణుల్లా మెరిసిపోతు న్నారు. ఈదుతూ చాలాదూరం వెళ్లారు.

ఒడ్డుమీద ఉన్నవాళ్లు వెనక్కి రమ్మని అరుస్తున్నారు.

వాళ్లు వినకుండా ముందుకే సాగిపోతు న్నారు. ఒడ్డుమీదివాళ్లు అరిచి, తిట్టి, రమ్మని మరీమరీ పిలుస్తున్నారు.

చాలా ముందుకు వెళ్లిం తర్వాత ప్రతాప్ "శైవలినీ! ఇక్కడే మన ఇద్దరి పెళ్లి" అన్నాడు.

"ఇక్కడా? !" అంది శైవలిని.

వాళ్లిద్దరు తీసుకున్న నిర్ణయం ప్రకారమే "ఆc! ఇక్కడే.. నేను మునుగుతున్నాను. నువ్వూ మునుగు" అంటూ ప్రతాప్ నీటిలో మునిగిపోయాడు.

కానీ శైవలిని మునగలేదు. ఆమె భయ పడింది. మనసులో అనుకుంది.. 'చావడ మెందుకు? ప్రతాప్ నాకేమవుతాడు? నాకు భయమేస్తోంది. నేను చావలేను'

శైవలిని మునగకుండా వెనక్కి మళ్లింది. ఈదుతూ ఒడ్డుకు చేరుకుంది.

★ ★ ★

నదిలో ఎక్కడైతే ప్రతాప్ మునిగాడో, అక్కడికి కొద్ది దూరంలో ఒక నావ వెడు తోంది. నావపైని వ్యక్తి ప్రతాప్ మునిగిపో వడం చూసి వెంటనే నీటిలోకి దూకాడు. ఆ వ్యక్తి చంద్రశేఖర శర్మ. అదేసమయం లో అతనూ ఓ ఆపదలో ఉన్నాడు. అతని వయస్సు ముప్ఫయి రెండేళ్లు. గృహస్థుడు.

ప్రతాప్‌ను నీటి నుండి రక్షించి అతని ఇంటికి తీసుకెళ్ళాడు. తల్లికి అప్పగిం చాడు. అతని తల్లి చంద్రశేఖర్ పాదాల పైన పడింది తన కొడుకు ప్రాణాలు కాపా డినందుకు. ఆ రోజు చంద్రశేఖర్ ఆ ఇంట అతిథిగా నిలిచాడు ఆమె ప్రార్థన వల్ల.

శైవలిని మళ్లీ ప్రతాప్ ముఖం చూడ లేదు. కానీ చంద్రశేఖర్ శైవలినిని చూశాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడ య్యాడు. చంద్రశేఖర్ గృహస్థుడే కానీ బ్రహ్మచారి. చదువుకు పెళ్ళి ఆటంకమని భావించాడు.

ఏడాది క్రితం అతని తల్లి స్వర్గస్థురా లైంది. పెళ్ళి చేసుకోకపోవటమే ఇప్పుడు అతని చదువుకు ఆటంకమైంది. వంట చేసుకోవడానికే చాలా సమయం వృథా అవుతోంది. దాంతో చదవడం, చదువు చె ప్పటంలో ఇబ్బంది. రెండోది ఇంట్లో సాల గ్రామం ఉంది. దానికి నిత్యపూజ ఉండా లి. అదీ సక్రమంగా జరగడం లేదు. ఇంటి పనుల్లోను కష్టమే. గ్రంథాలు ఎక్క డెక్కడో పడుంటాయి. అవసరానికి అవి దొరకవు. డబ్బు ఎక్కడ దాచాడో? ఎవరి కిచ్చాడో? గుర్తుండదు. ఖర్చు తక్కువ కాబట్టి డబ్బుకు లోటులేదు. వీటన్నింటికి

## కొత్తగాలి...

**గోరంత**
**చదువుకి**
**కొండంత**
**ఫీజు!**

– కృష్ణ మాధవరపు,
కాకినాడ

పరిష్కారం వెళ్లనే నిర్ణయానికి వచ్చాడిప్పుడు చంద్రశేఖర్.

గతంలో అందమైన స్త్రీని వివాహమాడ కూడదనుకున్నాడు. సౌందర్య మోహంలో మునిగితే, కుటుంబ నిర్వహణ అసాధ్యమవుతుందని భావించాడు. అలాంటి స్థితిలోనే చంద్రశేఖర్ శైవలినిని చూశాడు. ఆమె సౌందర్యం అతని నిర్ణయాలన్నింటిని తుత్తునియలు చేసింది.

శైవలినితో చంద్రశేఖర్ వివాహం జరిగింది. అందానికి దాసులుకాని వారెవరు?

★ ★ ★

అతని వివాహం జరిగిన ఎనిమిదేళ్లకు ఈ కథ ప్రారంభమవుతుంది.

బెంగాల్, బిహార్, ఒడిశా మూడు ప్రాంతాల్ని అలీజహా ఖాసింఖాన్ ముంగేరి కోట కేంద్రంగా పాలిస్తున్నాడు. కోటలోని అంతఃపురంలో రాణివాసం 'రంగమహల్' సుందరమైన భవనం.

రాత్రి మొదటి యామం పూర్తి కాలేదు. ముఖద్వారం వద్ద రంగురాళ్లపైన మెత్తని తివాచీ పరచి ఉంది. వెండి సెమ్మెల్లో సుగంధ తైలంతో వెలిగించిన దీపాలు వెలుగుతున్నాయి. హాలంతా కమ్మని పూల పరిమళాలతో నిండి ఉంది. బూరుగు దూది మెత్తపై తల నుంచి అంత పొడగరిగాని యువతి పడుకొని పాట పాడుకుంటోంది.

కొంత పాడి 'ఛీ..! బాగా లేదు. ఎంత కాలం ఎదురుచూడాలి? నేను ఆయన్ని గురించే ఆలోచిస్తుంటాను. కానీ తనకి నేనెట్లా జ్ఞాపకముంటాను? ఆయనకున్న వేలమంది చరణదాసీల్లో నేనొక్కర్తిని' అనుకుని మళ్ళీ పాట ప్రారంభించింది. రుచించలే..! పాటల పుస్తకం పక్కన పడేసింది. 'భగవంతుడిలా ఎందుకు చేస్తాడు? ఒక వ్యక్తి మరొక వ్యక్తి కోసం ఎదురుచూడటమెందుకు? ఎవరైతే లభించరో వారిని గురించే ప్రతీక్ష ఎందుకు? నేను తీగలా రసాల వృక్షాన్నెందుకు చుట్టుకోబోతున్నాను' అనుకుని పడక దిగింది.

అందమైంది ఆమె తలకట్టు. సర్పంలా పొడవైన కురులు తల నుండి కిందకు జారాయి. సుగంధభరితమైన ఆమె కొంగు కదిలింది. ఆమె కదలికల్లో ప్రత్యంగం యవ్వనంతో తొణికిసలాడుతోంది.

చిన్నవీణను తీసుకుని తంత్రిని మీటింది. మెల్లమెల్లగా పాడటం ప్రారంభించింది. వినేవాళ్లు ఆమె భయపడుతూ పాడుతోందనుకుంటున్నారు.

అదే సమయంలో కాపలా సైనికుల అభివాదం స్వీకరిస్తూ వస్తున్న సవారి బండి సవ్వడి ఆమె వీనులను సోకింది. ఆ యువతి గాభరాతో ద్వారం వద్దకు పరుగుతీసింది. నవాబ్ మీర్‌ఖాసిం అలీఖాన్ గారు అప్పుడే సవారి బండి దిగి రంగమహల్‌లో ప్రవేశించారు.

ఆసనంపై సుఖాసీనులయ్యాక ఆయన "దలినీ బేగం! ఏం పాట పాడుతున్నావు?" అడిగారామెను.

ఆ యువతి పేరు దౌలతున్నీసా. కానీ నవాబు ప్రేమతో 'దలినీ' అని పిలుస్తారు.

దలిని సిగ్గుతో తలవంచుకుని నిలబడింది. ఆమె దౌర్భాగ్యం ఏమోకానీ నవాబు "నువ్వే గీతం పాడుతున్నావో అదే ఆలపించు మేం వింటాం" అన్నారు.

గందరగోళమైంది. తంత్రులు సరిగా

పలకటం లేదు. మరో వాద్యం అందు కుంది అదీ స్వరహీనంగా పలికింది.

నవాబు పాట కానివ్వమన్నారు.

'నాకు అసలు స్వరజ్ఞానమే లేదని నవా బుగారు అనుకున్నారేమో?' అని దలిని అనుకుంది. ఆ ఆలోచనతో ఆమె గొంతు మూగబోయింది. ఎంత ప్రయత్నించినా గొంతు పలకటంలేదు.

దలిని అకస్మాత్తుగా వీణను పక్కన వుంచి "నేను పాడను.. పాడలేను" అంది.

నవాబు ఆశ్చర్యంతో "ఎందుకు? ఇష్టం లేదా పాడడం?" అడిగారు.

"కలకత్తాలో ఇంగ్లీషువాళ్లు ఏ వాద్యంతో పాడతారో అలాంటి వాద్యం తెప్పించండి. అప్పుడు మీ ముందు పాడతాను లేకుంటే పాడనే పాడను" మూతి బిగించింది.

"ఆ దారిలో ముళ్ళులేకుంటే తప్పకుండా తెచ్చిస్తాను" మీర్‌ఖాసీం నవ్వారు.

"ముళ్లెందుకుంటాయి?"

"వారితో శత్రుత్వం ఏర్పడింది. ఆ సం గతి నువ్వు వినలేదా?" అడిగారాయన.

"విన్నాను" అని మౌనం వహించింది.

"దలినీ బీవీ! మౌనంగా ఏమాలోచిస్తు న్నావు?" అడిగారు నవాబు.

"ఓరోజు మీరే అన్నారు ఆంగ్లేయులతో యుద్ధం చేసి ఎవరూ గెలవలేరని! మరి వాళ్లతో శత్రుత్వం ఎందుకు తెచ్చుకు న్నారు? మీ దాసిని.. ఇలా అడగటం సరైంది కాకున్నా అడగాల్సిన ధర్మం నా కుంది. కారణం మీరు నన్నెంతో ప్రేమగా చూసుకుంటున్నారు" అందామె.

"దలినీ బేగం! నిజమే! నిన్ను ప్రేమిస్తు న్నాను. నిన్ను ప్రేమించినంత మరే స్త్రీని ప్రేమించటంలేదు. ప్రేమించను కూడా" అన్నారు నవాబు ఉద్వేగంగా.

ఆ మాటలతో ఆమె శరీరం రోమాంచి తమైంది. నేత్రాలు బాష్పపూరితాల య్యాయి. కళ్ళు తుడుచుకొని అంది.

"మీకు తెలుసు ఇంగ్లీషు వారికి శత్రువు లైనవారు ఓడిపోతారని. అయినా ఎం దుకు వారితో శత్రుత్వం వహిస్తున్నారు?"

మీర్‌ఖాసిం మృదుస్వరంతో అన్నాడు. "మరో మార్గం తోచలేదు. నువ్వు నా దా నివి కనుక చెబుతున్నా. ఈ పరిణామాల వల్ల రాజ్యం పోతుందని తెలుసు. ప్రాణాలు పోయినా ఆశ్చర్యం లేదు. ఆంగ్లే యుల చేతలు వికృతంగా వుంటాయి. వాళ్లే రాజులు మనమేమీ కాము. ఈ రాజ్యంపై మన అధికారం లేనప్పుడు మన మెందుకు? 'మీరు మా వైపున వుండి ప్రజల్ని బాధ పెట్టండి' అంటారు. ఆ పని మనమెందుకు చేయాలి? ప్రజలకు మేలు చేయని పాలకులుగా వుండటం కంటే పద వీభ్రష్టత్వం మేలు. పాపాన్ని, చెడ్డపేరును ఎందుకు మూటగట్టుకోవాలి? నేను సిరాజు ద్దౌలా లాంటివాడినే తప్ప మీర్ జాఫర్‌ను కానేకాను. నేను మీర్‌ఖాసీం అలిజహాను"

మనసులో దలిని బెంగాల్ పాలకుడ్ని ప్రశంసించింది. మళ్లీ "మీరు నా దేవుడు.. మీరింత చెప్పాక నేనేం చెప్పగలను? కానీ నాదొక మనవి! మీరు స్వయంగా యు ద్ధంలో పాల్గొనకండి" అంది.

"ఈ విషయంలో బెంగాల్ పాలకుని ధర్మం కేవలం స్త్రీల సలహా వినడమేనా? లేక ఒక స్త్రీ సమస్యపై అభిప్రాయం చెప్ప డమా?" అడిగారు మీర్‌ఖాసిం.

దలిని నిర్విణ్ణురాలైంది. "ప్రభు! నేను అర్థం చేసుకోకుండా మాట్లాడాను. నా త ప్పు మన్నించండి. స్త్రీలు విషయాన్ని సుల భంగా అర్థం చేసుకోలేరు. నోరు జారాను. అయితే నాకో మాట యివ్వండి" ప్రార్థనా పూర్వకంగా అంది.

"ఏమది?"

"మీరు నన్ను కూడా మీతో యుద్ధానికి రానివ్వండి"

"నువ్వు యుద్ధం చేస్తావా? అయితే గురుగన్‌ఖాన్‌ను తొలగించి నిన్ను సర్వసై న్యాధిపతిని చేస్తాను"

దలిని మళ్లీ మౌనం వహించింది.

నవాబ్ ప్రేమతో "యుద్ధానికి నువ్వెం దుకు రావాలనుకుంటున్నావు? " అడిగారు.

"ఎల్లప్పుడు మీ వెంటే ఉండొచ్చు"

మీర్‌ఖాసిం దానికి అంగీకరించలేదు.

అప్పుడు దలిని నవ్వి "ప్రభూ! మీకు జ్యోతిష్యం తెలుసా? తెలిస్తే మీరు యుద్ధం చేసే సమయంలో నేనెక్కడ వుంటానో చెప్పండి" అంది.

"సరే కాగితం కలం తీసుకో!"

దలినీ ఆజ్ఞతో దాసి బంగారు కలం, కాగితం తెచ్చింది. మీర్‌ఖాసిం హిందువుల నుంచి జ్యోతిష్యం నేర్చుకున్నారు. అతడు తన సాధారణ జ్ఞానంతో లెక్కలు వేశారు. కాగితాన్ని చూచి దూరం విసిరి.. ఆలోచ నలో మునిగారు.

దలినీ "ఏం చూశారు? " అడిగింది.

"ఏం చూశానో అది చాలా ఆశ్చర్యంగా వుంది. నువ్వు వినలేవు" అన్నారు మీర్‌ఖాసిం.

నవాబు వెంటనే బయటకు వెళ్ళి మీర్ మున్షీని పిలిచి "ముర్షీదాబాద్ దగ్గరలోని వేదగ్రామంలో చంద్రశేఖర్ అనే పండితు డున్నాడు. ఆయన నాకు జ్యోతిష్యం నేర్పిన గురువు. నువ్వు వెళ్లి అక్కడి హిందూ ఉద్యోగితో ఆయన్ని పిలిపించు" అని ఆదేశించారు.

ఆంగ్లేయులతో ఒకవేళ యుద్ధం జరిగితే ఆ సమయంలో దలినీ బేగం ఎక్కడ వుం టుంది? తెలుసుకోదలచారు మీర్‌ఖాసిం.

మీర్‌మున్షీ చంద్రశేఖర్‌ను తీసుకురావడా నికి మనిషిని పంపించాడు.

★ ★ ★

ఆ ప్రాంతంలో భీమాపేరుగల చెరువు వుంది. దాని చుట్టూ దట్టమైన తాటివనం. అస్తమించే సూర్యుని బంగారు కిరణాలు నల్లని చెరువు నీళ్ళపై పడుతున్నాయి. వా టితో బాటు నీళ్ళపై తాటిచెట్ల నల్లని నీడలు పరుచుకుంటున్నాయి.

ఒక స్నానఘట్టం వద్ద చిన్నచిన్న చె ట్లు.. వాటికి చుట్టుకున్న లతలతో స్త్రీలు స్నానం చేసేలా మరుగు ఏర్పాటు ఉంది. అక్కడ నీటి మడుగులో శైవలిని, ఆమె స్నేహితురాలు సుందరి కడవలు తీసుకుని నీళ్లతో ఆడుతూ స్నానం చేస్తున్నారు.

యువతులు జలక్రీడలు ఎలా? అది మనకు తెలియదు. ఎందుకంటే మనం జ లం కాము. ఎవరైతే ఆకారము పొంది కరిగి నీళ్ళయ్యారో వాళ్ళే చెప్పగలుగు తారు. కడవల దెబ్బలతో నీళ్ళు అలలై చేతులకు తగిలి అలంకారాలై నాట్యం చేస్తాయి. వారిని చుట్టుముట్టి చేతులు, కంఠం, భుజాలు, వక్షాలతో దోబూచులా డుతూ స్పృశిస్తుంటాయి. అలలై లయాను గుణంగా నర్తిస్తాయి. యువతి కుండను నీటితో ముంచుతూ చల్లని స్పర్శను అను భవిస్తోంది. చుబుకం వరకు నీటి లో మునిగి ప్రతిబింబించే ఎర్రని పెదవులతో నీటిని స్పృశిస్తోంది. నోటిలోకి నీటి ని పీ ల్చి సూర్యుని వైపు చిమ్ముతోంది.

నీళ్ళు కూడా ఎండకాసే సమయంలో వందలాది సూర్యుల్లా ప్రకాశిస్తూ యువ తికి బహుమతులందిస్తోంది. యువతి కాళ్ళు చేతులాడిస్తే నీళ్ళు విరజిమ్మి నాట్యం చేస్తున్నాయి. ఇరువురూ సమా నమే! నీళ్ళు చంచలమే! మూడులోకాల్ని చంచలంగా మార్చే యువతుల హృదయా లూ చంచలమే! నీళ్లలో గీతలు నిలవవు! యువతుల హృదయాల్లో నిలుస్తాయా?

చెరువు నీళ్ళలో బంగారు కాంతుల మెరుపులు మాయమై చూస్తుండగానే నల్ల బడినాయి. కేవలం తాటి చెట్ల శిఖరాలు బంగారు పతాకాల్లా మెరుస్తున్నాయి.

**సుందరి:** *అక్కా! చీకటి పడుతోంది. ఇక యిక్కడ వుండటం కుదరదు పద!*

**శైవలిని:** *ఎవరూ లేరు మెల్లిగా ఓ పాట పాడరాదూ!*

**సుందరి:** *పాపిష్టిదానా! ఇంటికి పద!*

**శైవలిని:** తాళలేను ఓ చెలీ! ఓహో! మదనమోహనా!

అహో.. వెళ్లలేను .. ఏమన్నావు?

పాట పాడుతోంది.

**సుందరి:** చావు! ఇంకేముంది? మదనమోహనుడింట్లో వున్నాడు. అక్కడికి పద

శైవలిని: వెళ్లి అతనికి చెప్పు పో! నీ మదనమోహిని భీమా చెరువులో చల్లని నీటిలో మునిగి చనిపోయిందని..

**సుందరి:** నువ్వు ఇప్పుడు నవ్వడం ఆపెయ్యి! రాత్రవుతోంది! ఈ రోజు క్షేమి తల్లి చెప్పింది. ఈ చెరువు పరిసరాల్లో ఓ తెల్లదొర తిరుగుతున్నాడని.

**శైవలిని:** తిరగనీ! మనకేం భయం?

సుందరి: నువ్వేమంటున్నావు? పద.. నేను వెళుతున్నాను.

**శైవలిని:** నేను లేవను. నువ్వు వెళ్ళు.

సుందరి కోపంతో బిందె నింపుకుని ఒడ్డుకు చేరింది. శైవలిని వైపు తిరిగి "అయితే నువ్వు ఒంటరిగా చీకట్లో ఈ చెరువు దగ్గరే వుంటావా?"

శైవలిని జవాబివ్వలేదు. వేలు చూపింది. ఆమె వేలు చూపిన వైపు చూసిన సుందరి ఉలిక్కిపడింది. మరేమనకుండా బిందె భూమ్మీదకి విసిరి దీర్ఘంగా శ్వాసించి అక్కడి నుండి పరుగుతీసింది. ఇత్తడి బిందె దొర్లుతూ నీళ్ళు కారుతూ చెరువు నీళ్ళలోకి జారింది.

సుందరికి తాడి చెట్టు కింద కనిపించాడు ఓ తెల్లదొర! అతన్ని చూసి కూడ శైవలిని కదలలేదు. నీటి నుండి బయటకు రాలేదు. ఛాతీ వరకు నీళ్ళలో వుండి, కొంగుతో ముఖం పూర్తిగా కప్పుకుంది. వికసించిన పద్మంలా నీటిలో అలాగే నిలబడివుంది. మబ్బుల్లో మెరుపులా భీమా చెరువు నల్లని నీళ్లల్లో బంగారు కమలం వికసించినట్లుంది ఆ దృశ్యం.

సుందరి పారిపోయింది. ఆ తెల్లదొర మెల్లగా చెట్లకింద నుండి నడుస్తూ మడుగు చేరుకున్నాడు. చూడటానికి అతనిది చిన్న వయస్సే. గడ్డం మీసాలు లేవు. మెడలో గొలుసు, ఉంగరాలు కూడా వున్నాయి. అతడు నీటి సమీపానికి వచ్చి. ఆంగ్లంలో "ఓ మహిళా! నేను మళ్ళీ వచ్చాను" అన్నాడు.

"నీ భాష నాకర్థం కాదు" శైవలిని.

"ఓ.. మే డట్.. నాస్టీ.. గిబ్బరిష్... ఐ మస్ట్ స్పీక్ యిట్.. ఐ.. సపోజ్ మేము ఎగెయిన్ వచ్చినాము"

"యమలోకానికి దారిదేనా?" శైవలిని.

అతనికేం అర్థం కాలేదు.

"ఏమంటున్నావు?" అన్నాడు.

"యముడు నిన్ను మరిచాడంటున్నా"

"జమ్.. జాన్.. యూ.. మీన్..? అయామ్ లారెన్స్ పాస్టర్" అన్నాడతడు.

"సరే! నేనో కొత్త ఆంగ్లపదం నేర్చుకున్నాను. లారెన్స్ అంటే 'మారుతి' అని"

ఆ సంధ్యాసమయంలో లారెన్స్ పాస్టర్ శైవలినితో అనేక దేశీయ తిట్లు తిని తన గూటికి బయలుదేరాడు. అతను చెరువు కట్ట దిగి, మామిడి చెట్టు కిందున్న తన గుర్రాన్నధిరోహించి టిబియట్ నదీ తీరంలో గతంలో విన్న తెలియని పాటను తప్పులతో పాడుతూ సాగిపోయాడు.

అతడి మెదడు పలువిధాలుగా ఆలోచిస్తోంది. శీతల దేశంలోని మంచులా బాల్యంలో ప్రేమించిన 'మేరీ' జ్ఞాపకాలు!

## కొత్తగాలి...

**మొక్క ఎదిగితే**
**చెట్టు!**
**అదే మన మనుగడకు**
**మెట్టు!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

ప్రస్తుతం అవన్నీ గతస్మృతులు. భిన్న దేశంలో రుచి కూడా భిన్నంగానే వుంటుందా? శీతలదేశపు మేరీని ఈ వేడి దేశపు సుందరితో పోల్చవచ్చా? ఏమో?

పాస్టర్ వెళ్ళిపోయాడు.

శైవలిని బిందె నింపి నడుంపై ఉంచుకొని, వసంత ఋతువులో మేఘంలా మెల్ల మెల్లగా అడుగులు వేస్తూ యింటి వైపు నడిచింది. బిందెను దాని స్థానంలో వుంచి పడకగదిలోకి వెళ్ళింది.

అక్కడ ఆమె భర్త చంద్రశేఖర్ కంబళిపై కూర్చొని, ప్రమిద వెలుగులో ఓ గ్రంథాన్ని పఠిస్తున్నాడు. చంద్రశేఖర్ వయస్సు నాలుగుపదుల దగ్గర వుంటుంది. ముఖం విశాలం.. నుదురూ విశాలమే! నుదుటిపైన ఉదయం తీర్చిన గంధం రేఖలు మెరుస్తున్నాయి.

శైవలిని యింట్లోకొస్తూ దగ్గింది. 'ఇంత రాత్రి ఎందుకయిందని అడిగితే ఏం చెప్పాలి?' అనుకుంది. కానీ చంద్రశేఖర్ ఆమెనసలు ఏమైనా ప్రశ్నిస్తే కదా!

ఆయనపుడు బ్రహ్మసూత్రాల్లో ఓ సూత్రార్థాన్ని తెలుసుకునే ప్రయత్నంలో నిమగ్నమై వున్నాడు.

ఎదురుగా ఆమెను చూసి అప్పుడు చంద్రశేఖర్ "ఈ రోజు సమయంగాని సమయంలో మెరుపులు మెరుస్తున్నాయేమిటి?" అన్నాడు.

"మీరేమంటారోనని భయపడుతున్నా"

"ఏం ఎందుకు భయం?"

"చెరువు నుండి రావడం ఆలస్యమైంది"

"నిజమే కదా! ఎందుకాలస్యమైంది?"

"ఓ తెల్లదొర వచ్చాడు. ఆ సమయంలో ఒడ్డున వున్న సుందరి నన్ను అక్కడే విడిచి పారిపోయి వచ్చింది. నీళ్ళలో వున్న నేను భయంతో వెలికి రాలేకపోయాను. కంఠం వరకు నీళ్ళలో నిలిచి అతను వెళ్ళిన తర్వాత యింటికొచ్చాను"

"ఇక వెళ్ళకు!" అంటూనే అతను శంకర భాష్యంపై మనస్సు లగ్నం చేశాడు.

రాత్రి బాగా చీకటిపడింది. అప్పుడు కూడా చంద్రశేఖర్ ప్రేమ, మాయ, అపౌరుషేయం మొదలైన వాటి తర్కంలో మునిగిపోయాడు.

శైవలిని ప్రతిరోజులాగే భర్తకు భోజనం ఆయన పక్కన వుంచింది. తాను భోజనం ముగించి, పక్కపై వాలి గాఢనిద్రలోకి జారిపోయింది. ఈ విషయంలో చంద్రశేఖర్ అనుమతి వుంది. ఆయన చాలా రాత్రి వరకు చదువుకుంటాడు. రాత్రి పొద్దుపోయి భోజనం చేస్తుంటాడు.

అనుకోకుండా యింటిపైన గుడ్లగూబ భయంకరంగా అరిచింది. దాంతో చాలా రాత్రయిందని చంద్రశేఖర్ గ్రంథం కట్టిపెట్టి దాని స్థానంలో వుంచాడు. లేచి నిలబడి కిటికీలో నుండి బయటకు చూశాడు. వెలుగుతున్న చంద్రునిపై, ఆహ్లాదకరమైన ప్రకృతిపై అతని చూపు నిలిచింది.

కిటికీ నుండి చంద్రుని కాంతి నిద్రిస్తున్న శైవలిని ముఖబింబంపై పడుతోంది. అతడు ప్రసన్నచిత్తుడై వీక్షించాడు. తన యింట్లోనే చంద్రుని కాంతిలో సరోవరంలో కలువ వికసించినట్లు తోచింది.

ఇరవై వసంతాల యువతి.. ముఖం సౌందర్య శోభతో నిండి మెరుస్తోంది. అతని కన్నులు బాష్పాకలితమయ్యాయి.

నిద్రించే ఆమె ముఖబింబం అతని కన్నుల్లో నీటిని నింపింది. తానెందుకీమెను పెళ్ళాడినట్లు? శాస్త్రాధ్యయనంలో మునిగిన తాను శిథిలమవుతున్న ఈ కుటీరంలోకి ఆమెనెందుకు తెచ్చినట్లు? ఈ కుసుమం ఏ రాజు మస్తకం పైనో వుండాల్సింది. తెచ్చి తాను సుఖించాడు. కానీ ఆమేం సుఖపడింది?

తన ప్రేమలో ఆమె ప్రేమాభిలాష పరిపూర్ణం కాదు. సాధారణంగా తన సమయమంతా పఠనంలో గడిచిపోతోంది. ఆమెను గురించి తనెప్పుడాలోచించాడు? తన

రూ. 116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# దిశానిర్దేశం 'అద్వైతం'!




నవజీవనానికి ఆధారమైన ఆకుపచ్చ రంగు ముఖచిత్రంతో 'చతుర' జులై సంచిక ఉల్లాసాన్ని కలిగించింది. గీతిక నవల 'అద్వైతం' వహ్వా! అనిపించింది. నవతరానికి మనోధైర్యాన్ని ఇచ్చేదిగా ఉంది. రచయిత్రి రచనాపటిమకు, ఆధునిక దార్శనికతకు నిదర్శనంగా నిలిచింది. అతి తక్కువ పాత్రలతో నేటి యువత ఎదుర్కొంటున్న సమస్యలను సరళమైన శైలిలో అందించారు. వర్ణ, నంద కిశోర్ పాత్రల మధ్య జరిగిన సన్నివేశాలు ఆసక్తికరంగా, ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. పాఠకులు కూడా కథలో లీనమై తమనూ ఒక పాత్రగా ఊహించుకొని మైమరచిపోయారంటే అతిశయోక్తి కాదు. నాయికా నాయకుల నేపథ్యాలు వేరయినా వాళ్ల మనసులు కలిసిపోయిన తీరును బలంగా తీర్చిదిద్దారు. ప్రతి సమస్యకూ సమాధానం ఉంటుందని, దాన్ని వెతుక్కుంటూ పరిష్కరించుకోవాలన్న అంశం యువతకు మంచి సందేశంగా అందింది. తమ పిల్లలకు సన్మార్గం చూపించాల్సిన బాధ్యత ఆలోచనాపరులైన తల్లిదండ్రుల మీద కూడా ఉందని సున్నితంగా తెలియజెప్పారు. ఎంత కంప్యూటరు యుగమనుకున్నా మనిషి, మనసు సున్నితత్వాన్ని మరచిపోకూడదు. ఎదుటివారి మనసులో స్థానం సంపాదించడానికి, సంపాదించిన స్థానం నిలుపుకోడానికి యువత సాగించిన అంతః పోరాటాన్ని అక్షరబద్ధం చేసిన తీరు శ్లాఘనీయం. తల్లిదండ్రులు కూడా తమ హృదయవైశాల్యాన్ని పెంచుకొని, కాలానుగుణంగా వ్యవహరించడమే విధ్యుక్తధర్మమని అవగతమైంది. అటు యువతకు, ఇటు పెద్దలకు చక్కటి దిశానిర్దేశం చేసే నవలను అందించిన రచయిత్రి గీతికకు, 'చతుర' సంపాదకవర్గానికి ధన్యవాదాలు.

వర్ణచిత్రాలు ఆయా పాత్రలకు జీవం పోశాయి.

పాశ్చాత్య రచయిత్రి సుప్రసిద్ధ టోనీ మారిసన్ జీవనయానంలో తగిలిన ఎదురుదెబ్బలే ఆమె రచనకు ప్రేరణ కలిగించడం ఆశ్చర్యకరం. 'కాలాతీతం'లో టోనీ మారిసన్‌ను పరిచయం చేయడంతో 'చతుర' కు తావి అబ్బినట్లయింది. ఆధ్యాత్మిక సందేహాలకు చతుర ప్ర.జ. ద్వారా రామానుజాచార్యులుగారిచ్చే సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. 'భామనే సత్యభామనే' శీర్షికలో వ్యక్తిత్వం, మహిళాశక్తి వివేకాన్ని పెంచుతున్నాయి. పజిల్స్, చతురంగం మెదడుకు పదును పెడుతున్నాయి.

చతుర'సమ్'గతులు, ఉక్కుమనిషి చతురత అలరించాయి. 'కొత్తగాలి' కవితలు వర్తమాన సమాజానికి అద్దంపడుతూ, సందేశాత్మకంగా ఉంటున్నాయి. మహనీయుల మహితోక్తులు 'అక్షరం' ఆచరణీయమనడంలో సందేహం లేదు.

– ఎన్.వి. రమణి,
బంజారాహిల్స్, హైదరాబాద్

గ్రంథాలు సర్ది పెట్టడంలో ఆమెకేం సంతోషం? తన సుఖాన్ని గురించే ఆలోచించి తాను ఆమెను పెళ్లాడాడు.

భగవంతుడా! ఇప్పుడేం దారి? సంపాదించిన గ్రంథాలన్నింటిని కట్టగట్టి ఏటిలో విసిరి, ఈమె ముఖోపాసకుడు కాగలడా? ఛీ..! అదెంత మాత్రం సాధ్యం కాదు. మరి తన పాపాలకు శైవలిని ప్రాయశ్చిత్తం చేస్తుందా? ఈ కోమల పుష్పాన్ని యవ్వన జ్వాలలో మండించడానికే తాను చెట్టు నుండి తెంపాడా?

ఈ విధంగా ఆలోచిస్తూ.. భోజనం మరిచాడు. మరుసటి రోజు ఆయనకు మీర్‌మున్షీ సందేశం అందింది, నవాబును కలవడానికి ముర్షీదాబాద్ రమ్మని.




**వే**ద గ్రామానికి సమీపంలోనే పురందరపురం గ్రామం వుంది. అక్కడ ఈస్టిండియా కంపెనీకి చెందిన ఓ గిడ్డంగి వుంది. లారెన్స్ పాస్టర్ దానికధికారి.

లారెన్స్ చిన్న వయసులోనే మేరీని ప్రేమించాడు. కానీ ప్రేమలో విఫలమయ్యాడు. అంతలోనే ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగం రావడంతో బెంగాల్‌కు వచ్చాడు. ఆనాడు ఇండియాకు వచ్చిన ఆంగ్లేయులు ప్రాంతీయమైన అనేక రుగ్మతలకు గురయ్యేవారు. బెంగాల్ గాలి అధికారుల్ని పరాయి సంపత్తిని ఆశించే మరో రోగానికి కూడా గురిచేసింది.

పాస్టర్‌కు ఇండియా వచ్చిన కొద్ది రోజుల్లోనే ఆ రోగం పట్టుకుంది. ప్రేయసి మేరీ రూపం అతని మనోఫలకం నుండి చెరిగిపోయింది. ఒకసారి ఏదో పనిమీద వేద గ్రామం వచ్చాడు. భీమా చెరువులో వికసించిన కమలం వంటి శైవలినిని చూశాడు. శైవలిని అతన్ని చూసి పారిపోయింది. కానీ పాస్టరు ఆమెను గురించే ఆలోచిస్తూ ఇల్లు చేరాడు.

చాలా ఆలోచించి పాస్టర్ పిల్లి కళ్ళకంటే నల్లని కళ్ళు బాగుంటాయని, ఎర్ర వెంట్రుకలకంటే నల్లవెంట్రుకలు అందంగా వుంటాయని తెలుసుకున్నాడు. హఠాత్తుగా మరో ఆలోచన వచ్చింది.. సంసారసంద్రంలో స్త్రీలు నావ వంటివారు. వారి సహాయం పొందడం పురుషులందరి విధి అని.

ఆంగ్లేయులు భారతదేశం వచ్చి ఫాదరీలను మోసపుచ్చి బెంగాలీ అందకత్తెల్ని సొంతం చేసుకున్నారు. వాళ్ళేం తప్పుచేయలేదు. చాలామంది బెంగాలీ యువతులు ధన వ్యామోహంలో ఆంగ్లేయుల్ని పొందారు. అలాంటప్పుడు పాస్టర్ కూడ శైవలినిని అలాగే అన్వయించుకున్నాడు.

పాస్టర్ తన నౌకరును వెంటబెట్టుకు మళ్ళీ వేదగ్రామం వచ్చాడు. తాటివనంలో దాక్కున్నాడు. అతనితో వచ్చిన నౌకరు శైవలినిని చూశాడు. ఆమె ఇల్లును కూడా కనుక్కున్నాడు.

బెంగాలీ పిల్లలు కొట్టుకోవడం, తిట్టుకోవడం అంటే భయపడతారు. కొందరు మాత్రమే వాటిని చూడటానికి ఇష్టపడతారు. శైవలిని పరిస్థితీ అదే! ఆమె మొదటిసారి పాస్టర్‌ను చూసింది. నిట్టూర్పు విడిచి పారిపోయింది. తర్వాత ఎవరో ఆమెకు చెప్పారు. 'ఆంగ్లేయులు ఎవరినీ చూడగానే మింగరు. వాళ్ళంతా విచిత్ర జంతువులు. కావాలంటే ఓరోజు జాగ్రత్తగా గమనించు' అని.

ఆ మాట ననుసరించి శైవలిని అతన్ని

నిశితంగా చూసింది. అతడు ఆమెను మింగలేదు. అప్పట్నుంచి పాస్టర్‌ని చూసి పారిపోవడం మానుకుంది. మెల్లమెల్లగా అతనితో మాటలు మొదలయ్యాయి.

నిజానికి శైవలిని దురదృష్ట ఘడియల్లో భూమిపై పడింది. అశుభ సమయంలోనే చంద్రశేఖర్ పాణిగ్రహణం చేసింది. కానీ ఆమెపై పాస్టర్ పాచిక పారలేదు.

అకస్మాత్తుగా కలకత్తానుండి పాస్టర్‌కు ఉత్తర్వు వచ్చింది. 'త్వరగా నువ్వు కలకత్తా చేరుకో! నిన్ను ప్రత్యేకమైన పనిలో నియమిస్తాం' అని. అంతే! పురందపురం గిడ్డంగి మరొకరికి అప్పగించేశాడు. ఆ కొత్తవ్యక్తి వచ్చి ఆర్డరు తీసుకుని డ్యూటీలో చేరిపోయాడు కూడా.

పాస్టర్ కలకత్తా వెళ్లిపోవాలిక.

శైవలిని సౌందర్యం పాస్టర్ మనసుపై గాఢమైన ముద్ర వేసింది. కానీ ఆమెను వదిలి కలకత్తా వెళ్ళాల్సిందే.

ఆ కాలంలో కంపెనీ ఉద్యోగులందరు రెండు విషయాల్లో అసమర్థులు. లోభాన్ని వదిలిపెట్టలేరు, ఓటమిని సహించలేరు. వాళ్ళెపుడూ పనిచేయడంలో అసమర్థులుగా ఉండరు. అది అధర్మకార్యమని అంగీకరించరు. మొదట భారతదేశంలో ఆంగ్లేయుల పాలన ఎవరు స్థాపించారో వాళ్ళలాంటి శక్తిమంతులు, స్వేచ్ఛాచారులు భూమిపై ఎక్కడా కనిపించరు.

లారెన్స్ కూడా ఆ కోవకు చెందిన వ్యక్తే! అతడు లోభాన్ని విడిచిపెట్టలేదు. ఆనాడు బెంగాల్లో వున్న ఆంగ్లేయుల్లో 'ధర్మ' శబ్దం లోపించింది. అతడు పనిలోని సంభవ, అసంభవాల్ని ఆలోచించలేదు. మనస్సులోనే నిశ్చయించుకున్నాడు.. 'ఇప్పుడు కాకపోతే మరెప్పుడూ కాదు' అనుకున్నాడు.

అలా ఆలోచించిన పాస్టర్ కలకత్తా వెళ్ళటానికి ముందురోజు రాత్రి చీకటి పడగానే బోయిలతోబాటు పల్లకీ సిద్ధం చేయించాడు. ఆ బంగ్లాలో వుండే సైనికుల్ని ఆయుధాలతో సిద్ధం చేశాడు. కాగడాల వెలుగులో వేద గ్రామం వైపు సాగాడు.

ఆ రోజు రాత్రి వేద గ్రామస్థులు చంద్రశేఖర్ ఇంటిపై దోపిడీ జరుగుతోందనుకున్నారు. చంద్రశేఖర్ ఇంట్లో లేడు. రాజ కర్మచారి వెంట నవాబు దర్శనానికి వెళ్ళాడు. తిరిగి రాలేదని అందరికీ తెలుసు.

గ్రామ ప్రజలు రకరకాల ఛీత్కారాలు, కోలాహలం, తుపాకీ కాల్పులు, ఏడ్పులు అన్నీ విన్నారు. తమ తమ శయ్యలు విడిచి యిళ్ళ బయటకు వచ్చారు. చంద్రశేఖర్ యింటిపై దాడి.. ఇంటి ముందు చాలా కాగడాలు వెలుగుతున్నాయి.

ఎవరూ ముందుకు పోలేదు. దూరం నుండే గమనించారు. ఇల్లు కొల్లగొట్టి ఒక్కొక్కరూ బయటకు వస్తున్నారు. చాలామంది ఒక పల్లకిని మోసుకుపోవడం ఆశ్చర్యంగా చూశారు. పల్లకీ ద్వారం తెరతో మూసి వుంది. పురందరపురం గిడ్డంగి అధికారి వెంట వున్నాడు..

ప్రజలంతా దూరం దూరం జరిగారు. దోపిడీదారులు వెళ్లాక ఇరుగుపొరుగులు చంద్రశేఖర్ యింట్లోకి వెళ్ళారు.

చాలా వస్తువులు యథాతథంగా వున్నా శైవలిని కన్పించలేదు.

"ఆమె దాక్కుంది. ఇప్పుడే వస్తుంది" అని ఎవరో అన్నారు.

ఓ వృద్ధుడు మాత్రం "ఆమె యికరాదు. వచ్చినా చంద్రశేఖర్ ఆమెను రానివ్వడు. పల్లకిని చూశారు గదా? అందులో ఆమె వెళ్ళిపోయింది" అన్నాడు.

ఆశతో వున్నవాళ్ళు ఆమె కోసం ఎదురు చూశారు. నిలబడి నిలబడి అలసిపోయి కూర్చున్నారు. కూర్చుని కూర్చుని.. అలసి కునకటం ప్రారంభించారు. కూరుకులు రావడంతో నిద్రనాపుకోలేక నిరాశతో యిళ్ళకు వెళ్ళిపోయారు.

శైవలిని మాత్రం రాలేదు.

అందరికంటే చివరగా వెళ్లిపోయిన వ్యక్తి

# 'బంకించంద్ర'కే అంకితం



## ధప్పూరి శ్రీధరాచార్యులు

ఆదిలాబాద్ జిల్లా జనద్ స్వగ్రామం. తెలుగు, హిందీ భాషల్లో ఎం.ఏ., వృత్తి పరంగా ఎం.ఇడి. చేసి 34 సంవత్సరాలు హిందీ ఉపాధ్యాయులుగా, నాలుగు సంవత్స రాలు తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసి 2002లో పదవీ విరమణ పొందాను.

ఎనిమిదో ఏట 'చందమామ'తో చదవడం అలవాటై పన్నెండేళ్లకే శరత్ సాహిత్యం అంతా చదివాను. వెయ్యిపుస్తకాలతో సొంత గ్రంథాలయం ఉంది.

1969లో మొదటి కథ 'యువ' మాస పత్రికలో ప్రచురితమైంది. వందకు పైగా కథలు, కవితలు ప్రచురణ అయ్యాయి. 'హిందీ కవులు- సాహితీవేత్తలు' పేరున వంద వ్యాసాలు ఓ దినపత్రికలో వారం వారం వచ్చాయి.

తొలినుండి 'చతుర, విపుల' పాఠకుడ్ని. రచయిత పేరు కంటే రచనకు విలువిచ్చి సాహిత్యాన్ని ప్రోత్సహించే 'చతుర' సంపాద కులకు, యాజమాన్యానికి కృతజ్ఞతలు.

ఈ అనువాద నవలను చంద్రునికో నూలుపోగులా బంకించంద్రునికే అంకితంగా సమర్పిస్తున్నాను.


**చిరునామా:**
**ధప్పూరి శ్రీధరాచార్యులు**
కేరాఫ్ ఎస్.సి. లక్ష్మణాచార్య
ఇంటి.నెం. 12-1-387
దత్తాత్రేయ దేవాలయ వీధి
సీతారాంబాగ్, హైదరాబాద్-06


సుందరి. సుందరిది చంద్రశేఖర్ పక్క యిల్లు. వరుసకు ఆమె చంద్రశేఖర్ చెల్లె లు! శైవలినికి స్నేహితురాలు కూడా! నిద్ర పోకుండా మెలకువతో రాత్రంతా గడిపిం ది. ఉదయం ఆమె తన యింటికి వెళ్ళి ఏడవడం ప్రారంభించింది.

★ ★ ★

పాస్టర్ మరో నావలో కలకత్తా వెళ్ళిపో యాడు. శైవలిని కోసం ప్రత్యేకంగా ఓ పెద్దనావ సిద్ధంచేశారు. జలమార్గాన ఆమెను ముంగేరి చేర్చమని ఆదేశించాత ను. నావలో శైవలినిని చూసుకోవడానికి సేవకులను నియమించాడు.

తను వెంట లేకున్నా, నావపైన దాడిచే సేవారు ఎవరూ వుండరని అతని నమ్మ కం. ఆంగ్లేయుల నావగా దాన్నెవరు సమీ పించరు. సమీపించలేరు. అందుకే నావను ముంగేరి చేర్చమని ఆదేశించాడు.

ఉదయకాలపు చిన్నచిన్న అలలపై శైవ లిని వున్న నావ ఉత్తరదిశగా సాగిపో తోంది. నీటి అలలు నావకు తగిలి చిరు శబ్దాలు చేస్తున్నాయి.

ప్రభాత సమయంలో వచ్చే గాలులు ఆహ్లాదకరంగా వుంటాయి. దొంగల వలె దాగి దాగి వీస్తుంటాయి. ఓచోట కమలా లపై, మరోచోట మరోపూలపై వీస్తూ కొమ్మలతో ఆడుకుంటాయి. ఒకరికి సుగం ధాన్నందిస్తే, మరొకరికి రాత్రి పడిన శారీర క శ్రమను దూరం చేస్తాయి. ఆలోచన లతో వేడెక్కిన వారి బుర్రలను చల్లబరు స్తాయి. యువతుల కేశరాశిని సున్నితం గా కదిలించి పారిపోతాయి.

ఆకాశంలోనున్న ఒకటి, రెండు మబ్బు తునకల్ని పక్కకు జరిపి నిర్మలంగా మా ర్చాయి. తీరంపై నున్న చెట్ల శాఖల్ని కది లిస్తున్నాయి. స్నానించే కామినులను సేద తీరుస్తూ ఆహ్లాదపరుస్తున్నాయి. నావ కిం ద చేరి సంగీతాన్ని వీనుల విందుగా ఆలా పిస్తున్నాయి.

కాలం గడుస్తోంది. వాయు తీవ్రత పెరి

# స్త్రీపాత్ర చిత్రణలో అత్యాధునికుడు

స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా బంకిం చంద్ర రాసిన వందేమాతర గీతం దేశభక్తిగీ తమై ఇవాళ్టికీ ప్రతినిత్యం ప్రజల నోళ్ళలో నానుతోంది. ఆయన రచించిన 'ఆనంద్‌మఠ్' నవలలోంచి తీసుకున్న ఈ గీతం స్వాతంత్ర్య సంగ్రామంలో శంఖారావమైంది. ఇలా ఒక భాషలో రాసిన గీతం దేశప్రజలందర్నీ ఉత్తేజపరిచి, ఉద్యమింపచేసిన ఘనత ప్రపంచంలో మరే గేయానికీ లేదు.



బంకించంద్ర

1838లో జన్మించిన బంకిం చంద్ర, రవీంద్రనాథ్ టాగోర్, శరత్‌చంద్ర ఛటర్జీల కంటే పెద్ద వారు. రవీంద్రుడు కాల్పనిక సౌందర్య తాత్త్వికతను, శరత్‌చంద్ర జీవన వాస్తవికతను ప్రతిబింబించగా బంకించంద్ర రచనల్లో ఉదాత్త ఆదర్శాలు ప్రతిఫలిస్తాయి. మనుషుల్లో వుండాల్సిన ఔన్నత్యం, ఔదార్యం, ధీరోదాత్తత, ధైర్యం, స్థైర్యం, త్యాగం, గాంభీర్యం లాంటి భావాలన్నీ ఆయన రచనల్లో కనిపిస్తాయి. ఆ కాలంలోనే స్త్రీపాత్రల చిత్రణలో విప్లవం తీసుకొచ్చారు. సంప్రదాయ జీవన శృంఖలాల్లో నలిగిపోకుండా నిర్భయంగా వ్యవహరిస్తూ ప్రణయోద్వేగాన్ని, మానసిక అనుభూతుల్ని చక్కగా వ్యక్తీకరించారు. ఆధునిక సాహితీ చరిత్ర రూపురేఖలు మార్చిన వారిలో బంకించంద్ర అగ్రగణ్యులు.

బంకిందంద్ర లాంటి ప్రతిభావంతమైన రచయిత మరొకరు లేరని, వందేళ్ళ తర్వాత కూడా ఆయన రచనలు ప్రభావితం చేస్తూనే వున్నాయని సాహితీ విమర్శకులు ముక్తకంఠంతో ప్రశంసిస్తుంటారు. బంకించంద్ర పాత్రలన్నీ సజీవంగా, చిరస్థాయిగా నిల్చిపోతాయి. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు ఆయన రచనల్లో ప్రతిఫలిస్తాయి. భారతీయ తత్త్వచింతనను అర్థం చేసుకోనివారిపట్ల ఆయన నిరసన వ్యక్తంచేసిన సందర్భాలున్నాయి.

'దుర్గేశ్ నందిని', 'కపాల కుండల', 'మృణాళిని', 'ఇందిర', 'రాధారాణి', 'చంద్రశేఖర్', 'కమలకంటేర్‌దఫ్తార్', 'రజని', 'కృష్ణకంటేర్ ఉయిల్', 'రాజసింహ', 'ఆనందమఠ్', 'దేవి చౌధురాణి', 'కమల కంఠ', 'సీతారాం', 'ముచీరం గురేర్ జీవంచరిత', 'కృష్ణచరిత', 'ధర్మతత్త్వ', 'శ్రీమద్‌భగవత్‌గీత', 'లోకరహస్య', 'బింజన్‌రహస్య', 'సౌమ్య' లాంటి విశిష్ట రచనలెన్నో చేసిన బంకించంద్ర 1894లో, 56 ఏళ్ళ వయసులోనే తుది శ్వాస విడిచారు.

---

గింది. జయదేవుని కవితలా యిప్పుడు కనుల కింపుగా లేదు. భైరవి రాగంలో మధురమైన వీణాధ్వని వినిపించటంలేదు. హుంకార శబ్దాలు వినిపిస్తున్నాయి. అలలు పోటెత్తుతున్నాయి. సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి. ప్రతికూల పవనాలు నావ గమనాన్ని నిలువరించాయి. దాన్ని నీటిలో ముంచటానికి ప్రయత్నిస్తున్నాయి. దారి దిశను మళ్ళిస్తున్నాయి.

రక్షకులు నావను భద్రఘాట్ వద్ద నిలిపివేశారు. అదే క్షణంలో అక్కడ ఓ క్షురక మహిళ ప్రత్యక్షమైంది. ఆమె చేతులకు లక్కగాజులున్నాయి. నావ పైకొచ్చి అటూ ఇటూ చూడసాగింది. ఆమె ముఖంపై మేలిముసుగుంది. నావ అధికారులు ఆమెను గమనించసాగారు.

ఓ వైపు శైవలిని కోసం భోజనం సిద్ధం చేస్తున్నారు. ఆమె కోసం ఓ బ్రాహ్మణుడు వంట చేస్తున్నాడు. ఒక్కరోజులోనే ఆమెను భార్యగా మార్చుకోలేనని పాస్టర్‌కు తెలుసు. ఆమె పారిపోకుంటే, ప్రాణత్యాగం చేయకుంటే ఏదోరోజు ముసల్మాన్ వంటవాడు చేసిన భోజనం ఆరగిస్తుందనుకున్నాడు. పాస్టర్ తొందరపడదలచుకోలేదు.

## కొత్తగాలి...

**మొక్క మొక్క**
**కలిస్తే వనం!**
**మనిషి మనిషి**
**కలిస్తే జనం!**

- పెయ్యల శ్రీనివాసరావు,
అలికాం, శ్రీకాకుళం జిల్లా

తొందరపడితే మొదటికే మోసమని ఆలోచించి నౌకర్ల సలహాపై ఓ బ్రాహ్మణుడ్ని శైవలిని వెంట వుంచాడు.

బ్రాహ్మణుడు వంట చేస్తుంటే ఓ దాసి అవసరమైన దినుసులందిస్తోంది. క్షురక స్త్రీ ఆ దాసి వద్దకు వచ్చి "అక్కా! మీరెక్కడ్నుండి వస్తున్నారు? " అడిగింది.

ఆ దాసికి కోపం వచ్చింది.

"ఢిల్లీ నుంచి వస్తున్నాం! అయినా నీకెందుకట? " అంది గట్టిగా.

క్షురక మహిళ గాభరా పడినా తమాయించుకుని, "అమ్మా కోపించకు! నేనో క్షురక మహిళని. మీ నావలో స్త్రీలకెవరికైనా పాదాలు మర్దించి నాలుగు డబ్బులు తీసుకోవచ్చని.." అంది.

ఆ దాసి కొంచెం మెత్తబడి- "ఉండు! తెలుసుకుని వచ్చి చెబుతా" అంటూ శైవలిని గదిలోకి వెళ్ళింది.

కాసేపు మనసు మళ్ళించుకోవడానికి మర్దన తప్పులేదనుకుని శైవలిని సరేనంది. అధికారుల అనుమతితో ఆ దాసి క్షురక స్త్రీని గదిలోకి పంపి తనపనికి పోయింది.

క్షురకస్త్రీ గదిలోకి వచ్చి శైవలినిని చూసి తన ముఖంపైని ముసుగును మరింత ముందుకులాగి ఆమె పాదాల వద్ద కూర్చొని నూనె రాయసాగింది.

శైవలిని ఆమెను పరీక్షగా చూసి "నీ పేరేమిటి? " అడిగింది.

ఆమె నుండి జవాబు రాలేదు.

"ఏం నువ్వేడుస్తున్నావా? " శైవలిని మళ్ళీ అడిగింది.

మృదుస్వరంతో "లేదు" అందామె.

ఉన్నట్టుండి శైవలిని ఆమె ముఖంపై ముసుగు లాగేసింది. ఆమె నిజంగానే ఏడుస్తోంది.

"నీ రాకతోనే నిన్ను గుర్తించా! నావద్ద ముసుగెందుకు? "

ఆమె మరెవరో కాదు శైవలిని నేస్తం సుందరి.

సుందరి కళ్ళు తుడుచుకుని "వెంటనే ఇక్కడి నుంచి వెళ్ళిపో! నా చీర ఇస్తాను కట్టుకో! ఈ గాజులు ధరించి ముఖంపై ముసుగు వేసుకుని పారిపో!" అంది.

శైవలిని ఖిన్నురాలైంది.

"నువ్వెలా రాగాలిగావిక్కడికి? "

"అదంతా చెప్పడానికి సమయం లేదు. తర్వాత చెబుతాను. నిన్ను తీసుకెళ్లిన పల్లకి గంగానది వైపు వెళ్ళిందని తెల్సింది. పొద్దున్న లేచి ఎవరికీ చెప్పకుండా బయలుదేరి గంగాతీరం చేరాను. నావ ఉత్తరం వైపు వెళ్ళిందని తెలిసింది. అప్పుడు ఓ నావను అద్దెకు తీసుకుని నీ నావ వెంట వచ్చాను. నీ పెద్దనావ గాలి తీవ్రతకు నిలిచిపోయింది. నాది చిన్ననావ కాబట్టి నీ నావను చేరుకోగలిగాను"

"మరిప్పుడు? " శైవలిని అడిగింది.

"నువ్వు నా చీర కట్టుకో! ఈ గాజులు వేసుకో! ముసుగేసుకొని నావ దిగిపో! ఎవరూ గుర్తించరు. తీరం వెంటవెళ్తే, చిన్ననావ పైన నా భర్త కన్పిస్తాడు. నిన్ను నావ ఎక్కించుకుని యింటికి చేరుస్తాడు" అంది సుందరి.

శైవలిని కొంచెం ఆలోచించింది "మరి నీ పరిస్థితి? " అడిగింది.

"నా గురించి ఆలోచించకు! బెంగాల్‌లో ఏ ఆంగ్లేయుడూ సుందరి వంటి బ్రాహ్మణ స్త్రీని బంధించడు. మనస్సును స్థిరంగా

వుంచుకుంటే భూమ్మీద ఏ ఆపదా రాదు మనకు. నువ్వు వెళ్ళు. ఎట్టి పరిస్థితుల్లోను రాత్రికి యిల్లు చేరగలను. నువ్వాలస్యం చేయకు. నావపైన నీ తమ్ముడు.. అదే నా భర్త ఎదురు చూస్తుంటాడు. రాత్రి కూడా అతడు భోజనం చేయలేదు. ఇవ్వాళ కూడా తింటాడో లేదో తెలియదు"

"సరే! నువ్వు చెప్పినట్లే ఇంటికి వెళ్తా! యింట్లోకి రానిస్తారా? " అంది శైవలిని.

"ఎందుకు రానీయరు? "

"ఇంగ్లీషుదొర నన్నెత్తుకు వచ్చాడు. మరిప్పుడు నాకు కులం ఉందా? " శైవలిని అడిగింది.

సుందరి ఆశ్చర్యంతో శైవలినిని చూస్తుండిపోయింది.

ఆమె అలా చూస్తుంటే శైవలిని అభిమానంతో తలదించుకుంది.

సుందరి కొంత కఠినంగా "సత్యం చెబుతావా? ఏమైనా..? " అడిగింది.

"ఆఁ! సత్యమే చెబుతాను"

"గంగామాత పై ఒట్టుపెట్టి.."

"ఒట్టుపెట్టి నిజం చెబుతాను. ఇంతవరకు ఆ తెల్లదొర నా ముఖం చూడలేదు. కానీ ఇపుడు నే వెళ్లాక నన్నేలుకుంటే నా స్వామి జాతి భ్రష్టుడు కాడూ? "

"నీ స్వామి నిన్ను తప్పకుండా స్వీకరిస్తాడు. సందేహం వద్దు. ఆయన ధర్మాత్ముడు. దారి తప్పడు. నువ్విప్పుడు వృథా చర్చలతో సమయం నష్టపరుస్తున్నావు" అంది సుందరి చిరాకుగా.

శైవలిని మౌనం వహించింది.

తర్వాత కళ్ళు తుడుచుకొని, "వెళ్తాను. నా స్వామి స్వీకరిస్తాడు. కానీ నాపైన కళంకం మాసిపోతుందా? " అడిగింది.

సుందరి జవాబు యివ్వలేదు.

మళ్ళీ శైవలినే "గ్రామంలోని చిన్నపిల్ల కూడ వేలెత్తిచూపుతుందా? లేదా? 'ఈమెను ఇంగ్లీషువాడు ఎత్తుకుపోయాడు' అని. రేపు నా సంతానం అన్నప్రాశనకు పిలిస్తే ఎవరొచ్చి భోజనం చేస్తారు? ఒకవేళ కూతురు పుడితే ఆమెను బ్రాహ్మణుడు పెళ్లాడతాడా? నేను తిరిగి వెళ్తే పవిత్రురాలినని ఎవరైనా విశ్వసిస్తారా? ఇంటికి వెళ్ళి నా ముఖమెలా చూపను? " అంది.

"మనకేది రాసుంటే అది జరుగుతుంది. పూర్వపుస్థితి రమ్మంటే రాదు. కష్టాలొస్తే భరించక తప్పదు. కానీ నీ యింట్లో నువ్వుంటావు" అంది సుందరి.

"ఏ సుఖాన్ని కోరి కష్టాల్ని భరించాలి? తల్లా? తండ్రా? తోడబుట్టినవాడా? ఎవరున్నారు? " అంది వ్యథతో శైవలిని.

"భర్త లేడా? స్త్రీజీవితం ఎందుకట? "

"నీకంతా తెలుసు"

"తెలుసు! భూమ్మీద పాపిష్ఠివాళ్ళంతా తెలుసు. నీలాంటి పాపాత్మురాలు ఎవరూ లేరు. నీ భర్తలాంటి వుత్తముడు మరెవరికీ లేడు. ఆయన సాన్నిధ్యంలో నీ మనసు తృప్తిపడదు. పిల్లలు ఆటబొమ్మలతో ఆడుకుంటారు. కానీ దేవతల్లా పూజించడం వారికి తెలియదు. బ్రహ్మ శిల్పాల్ని చేసి రంగులు వేసి వదలలేదు. వాటిని మనుషులుగా తయారుచేశాడు. నీ భర్త ధర్మాత్ముడు, పండితుడు. కానీ నువ్వో పాపిష్ఠిదానివి. ఆయనపై నీ మనసెందుకు నిలుస్తుంది? " అంది తీవ్రస్వరంతో సుందరి. మళ్ళీ ఆమే "చూడు! నువ్వు గుడ్డిదానికంటే ఎక్కువ గుడ్డిదానివి! నీకేమర్థంకాదు. నీ భర్త నిన్నెంతగా ప్రేమిస్తాడో నీకు తెలీదు. జీవితంలో అంత ప్రేమ దుర్లభం. పూర్వజన్మ సుకృతం వల్లే అలాంటి జీవిత భాగస్వామిని పొందగలిగావు. ఇప్పుడవన్నీ ఎందుకు గానీ, ఆయన నిన్నిప్పుడు ప్రేమించకున్నా, ఆయన పాదసేవలోనే జీవితం ధన్యం చేసుకో! ఎందుకాలస్యం చేస్తున్నావో గానీ నాక్కోపం వస్తోంది" అంది.

"ప్రస్తుతం నా తండ్రి కుటుంబంలో ఎవరైనా వుంటే వారి దగ్గరికి వెళ్ళేదాన్ని. కా

నీ ఎవరూ లేరు. కాశీకి వెళ్ళి బిచ్చమెత్తుకుంటా! లేదా గంగలో మునిగి ఛస్తా! అంతేకానీ నా స్వామి దగ్గరకు వెళ్ళను. ముంగేరి వెళ్తున్నాను.. వెళ్తాను! రాజధానిని చూస్తాను. అక్కడ బిచ్చం దొరుకుతుందేమో చూస్తా! చావైతే ఎలాగూ వున్నదే. మరణం కంటే వేరు దారి లేదు. చావో! బతుకో! ఏదైనా కాని, నేనిప్పుడు యింటికి రానుగాక రాను. అనవసరంగా నా కోసం కష్టపడ్డావు! వెళ్ళిపో! నేనెటూ వెళ్ళను. చచ్చాననుకో!" అంది శైవలి స్థిరంగా!

సుందరి ఏడుస్తూ "నువ్వు త్వరగా చావాలని కోరుకుంటున్నావు! నీకు మరణించే శక్తి, ధైర్యం యివ్వమని భగవంతుడ్ని ప్రార్థిస్తున్నా! ముంగేరి చేరకముందే నువ్వు చావాలి. తుపానులో కావచ్చు. వర్షంలో కావచ్చు. లేదా నావ మునిగిపోయి కావచ్చు. నువ్వు తొందరగా మరణించు" అంటూ తైలపు డబ్బీ నీటిలోకి విసిరి గబగబా నావ దిగి తన భర్త వున్న నావ వైపు నడిచింది.

★ ★ ★

చంద్రశేఖర్ లెక్కలు వేసి భవిష్యత్తు గణన చేశాడు. కానీ రాజోద్యోగితో "నేను భవిష్యత్తు గణించలేక పోయానని నవాబుగారికి మనవి చేయండి" అన్నాడు.

"ఎంచేత? " రాజోద్యోగి అడిగాడు.

"అన్ని విషయాలు తెలియడం జ్యోతిష్యంతో సాధ్యం కావు. ఒకవేళ అదే సాధ్యమయితే, మనిషి భగవంతుడవుతాడు. నాకు ఈ శాస్త్రంలో తగినంత పాండిత్యం లేదు" చంద్రశేఖర్ జవాబిచ్చాడు.

"రాజులకిష్టంలేని విషయాల్ని బుద్ధిమంతులు తెలుపలేరు. మీ మనవి నవాబుగారికి విన్నవిస్తా" అన్నాడు రాజోద్యోగి.

చంద్రశేఖర్ సెలవు తీసుకున్నాడు.

అతనికి దారి ఖర్చులు సమర్పించే ధైర్యం రాజోద్యోగికి లేదు. 'చంద్రశేఖర్ బ్రాహ్మణుడు. పైగా మహాపండితుడు. యాచక పండితుడు మాత్రం కాదు. యాచన చేయడు.. దానమడగడు" అనుకున్నాడు ఆ రాజోద్యోగి.

★ ★ ★

చంద్రశేఖర్ గ్రామంలో ప్రవేశించాడు. దూరం నుండే గృహదర్శనమై అతనికి సంతోషం కలిగింది. అతడు తత్త్వవేత్త. తత్త్వజిజ్ఞాస గలవాడు. తనను తానే ప్రశ్నించుకున్నాడు. 'విదేశాల నుండి తిరిగి వచ్చేవాళ్లకి తమ మాతృభూమి చూసి సంతోషమెందుకు కలుగుతుంది? ఇన్ని రోజులు తిండికి, నిద్రకు కష్టపడ్డారా? అక్కడ దొరకని ఏ సుఖం యిక్కడ లభిస్తుంది? ' అనుకున్నాడు. ఈ వయసులో భారీ వ్యామోహంలో చిక్కుకున్నాడు తను. ఇందుకు సందేహం లేదు.

ఆ గృహంలో తన ప్రియ ప్రాణసతి ఉంది. అందుకే తనకు సంతోషం కలుగుతోంది. 'వసుధైక కుటుంబం' అంటారు కదా! మరి కొందరి పట్లే ప్రేమెందుకు? ఇంకొందరి పట్ల ద్వేషం ఎందుకు? ఏమో? నా వెనక నా సామానెత్తుకు వచ్చే వ్యక్తిని కనీసం తిరిగి చూడాలనిపించటం లేదు. కానీ వికసించిన కమలం లాంటి భార్య ముఖాన్ని చూడాలనే ఎందుకనిప్పిస్తోంది?

భగవంతునిపై శ్రద్ధలేదు. కానీ తను అత్యంత కఠినమైన మోహజాలంలో చిక్కుకున్నాడు. విచిత్రమేమంటే ఈ బంధం నుండి బయటపడాలనీ లేదు. అనంత కాలం బతికినా ఈ మోహం వదిలేలా లేదు. తను ఎంతసేపట్లో శైవలిని చేరుకుంటాడో?

అకస్మాత్తుగా భయం వేసింది.

ఇంటికి వెళ్ళి శైవలినిని చూడలేకపోతే? ఎందుకు చూడడు? ఒకవేళ రోగగ్రస్తురాలైతే? రోగాలందరికీ వస్తాయి! సరే! ఆ మెకు వెనుకటి ఆరోగ్యం చిక్కుతుందా?

ఆలోచించాడు.

రోగపు ఆలోచన వస్తేనే యింత భయ

మెందుకు? ఎవరికీ జబ్బు రాదా? ఒకవేళ అది నివారణ లేనిదైతేనో?

చంద్రశేఖర్ నడక వేగం పెంచాడు. ఒకవేళ జబ్బు చేస్తే? ఆమె ఆరోగ్యం మెరుగు కాకపోతే? ప్రార్థిస్తాడు. అప్పటికీ ఆరోగ్యం మెరుగుకాకపోతే?

చంద్రశేఖర్ కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

'ఓ భగవంతుడా! నాకీ వయస్సులో ఈ రత్నాన్నిచ్చి తిరిగి తీసుకుంటావా? '

ఆశ్చర్యమేముంది? తను ఆయన కృప కు పాత్రుడా? సుఖం తప్ప దుఃఖం లేకుండా చేస్తాడా? ఈ భయంకరమైన దుఃఖం తన నొసట రాసుందా? తను వెళ్ళేసరికి శైవలిని లేకుంటే? శైవలిని భయంకర రోగగ్రస్తురాలై ప్రాణత్యాగం చేసిందని వింటే?

తను మాత్రం ప్రాణాలతో వుండడు.

చంద్రశేఖర్ నడకలో ఇంకా వేగం పెరిగింది. గ్రామంలోకి వచ్చిన అతన్ని జనం విచిత్రంగా చూడసాగారు. ఆ చూపుల్లోని అర్థాన్ని అతడు గ్రహించలేకపోయాడు. పిల్లలు అతన్ని చూసి చిన్నగా నవ్వసాగారు. కొందరు అతన్ని దూరంగా అనుసరించి రాసాగారు. వృద్ధులు అతన్ని చూసి ముఖాలు తిప్పుకున్నారు.

చంద్రశేఖర్‌కు ఆశ్చర్యం కలిగింది.

నేరుగా వచ్చి తన యింటి ద్వారం ముందు నిలిచాడు. తలుపులు మూసి వున్నాయి. తలుపు తట్టడంతో నౌకరు ద్వారం తెరిచాడు. చంద్రశేఖర్‌ను చూసి అతడు శోకాలు పెట్టాడు.

"ఏం జరిగింది? " అడిగాడు.

నౌకరు సమాధాన మివ్వలేదు. ఏడుస్తూ వెళ్ళిపోయాడు.

చంద్రశేఖర్ మనసులో తన ఇష్టదైవాన్ని ప్రార్థించుకున్నాడు. ఇల్లు ఊడ్చిలేదు. చండీమండపం నిండా దుమ్ము. అక్కడక్కడ కాగడాల ముక్కలు పడున్నాయి. కొన్ని తలుపులు విరిగి వున్నాయి. ఇల్లంతా తిరిగాడు. దాసి అతన్ని చూసి ముందు వాకిట్లోకి పరుగెత్తి పెద్దగా ఏడవసాగింది.

అతడు వాకిటికి వచ్చి గట్టిగా "శైవలినీ" అంటూ ఒకటికి పదిసార్లు పిలిచాడు.

జవాబు లేదు.

అతని పిలుపుతో దాసి ఏడుపాపింది.

చంద్రశేఖర్ మళ్ళీ మళ్ళీ భార్యని పిలిచాడు. ఆ పిలుపు యిల్లంతా ప్రతిధ్వనించింది. కానీ జవాబు రాలేదు.

ఆ సమయంలో శైవలినితో వెళ్తున్న నావ గంగా జలాల్లో వేగంగా పోతోంది. నావపైనున్న ఇంగ్లీషు వారి ఎర్రపతాకం రెపరెపలాడుతోంది. సరంగులు పాట పాడుతూ తెడ్లు వేస్తున్నారు.

★ ★ ★

చంద్రశేఖర్ అంతా విన్నాడు.

తన ఇంట్లో సాలగ్రామాలను సుందరి తండ్రి గృహంలో వుంచి వచ్చాడు. సామాను, బట్టలు, వస్తువులన్నింటినీ పేదలకు పంచిపెట్టాడు. సాయంత్రం వరకు ఆ పనులన్నీ పూర్తిచేశాడు.

రక్తం ధారపోసి సంపాదించిన ప్రియమైన తన గ్రంథాలన్నింటిని ఒకచోట పడేసి, నిప్పు అంటించాడు. అవి మండుతున్నాయి. పురాణాలు, చరిత్రలు, కావ్యాలు, అలంకారశాస్త్రాలు, వ్యాకరణాలు అన్నీ కాలిపోతూ మంటలు లేచాయి. పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు మొదలైనవారి స్మృతులు, న్యాయ, వేదాంత, మీమాంసలు, తత్త్వశాస్త్రాలు, కల్పసూత్రం, అరణ్యకం, ఉపనిషత్తులు ఒక్కొటొక్కటి బూడిదవుతున్నాయి. కష్టపడి సమకూర్చుకున్నవన్నీ భస్మీపటలమయ్యాయి.

గ్రంథాలు కాల్చేసరికి ఒక ఝాము రాత్రి అయింది. ఆ రాత్రే అతడు కేవలం భుజంపైన ఉత్తరీయంతో ఇల్లు వదిలాడు. ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు. ఎవరూ అతన్ని అడగలేదు కూడా.

★ ★ ★

"ఈ పక్షి నాట్యం చెయ్యదు. నువ్వన్నా నీ పలుకులు వినిపించు" పెంపుడు చిలుకతో అంటూ దలినీ బేగం నాట్యం చెయ్యని నెమలితోక పట్టి లాగింది. మణులు పొదిగిన తన చేతి కంకణం తీసి నెమలి మెడలో వేసింది. ముద్దు మాటలు వినిపించే చిలుక పలకక పోవటంతో దాని కళ్ళలో గులాబి రంగు చిమ్మింది.

చిలుక "ఛీపో..! దాసిదానా..!" అంటూ తిట్టింది. దలినీ స్వయంగా తనే ఆ తిట్టు చిలుకకు నేర్పింది.

దగ్గరలో నిలబడిన దాసి, రాణి నెమలికి నాట్యం నేర్పడాన్ని గమనిస్తోంది. ఆ దాసితో దలినీ "కులుసూమ్! నువ్వేం కబురు తెచ్చావ్? చెప్పు" అంది.

ఆమె "చెప్పేదేముంది బేగం? ఆయుధాలతో నిండిన రెండు పడవల్ని మన సేనాపతి గురుగన్ఖాన్ ఆపేశాడు. మరోపడవలో ఇంగ్లీషువాళ్లున్నారు. రెండు నావలు తీరంలో ఆగిపోయాయి.

అలీ ఇబ్రహీంఖాన్ 'నావల్ని వదలిపెట్టండి! వాటిని ఆపడం వల్ల అనవసరంగా ఆంగ్లేయులతో యుద్ధం వస్తుంది' అని గురుగన్ఖాన్కు నచ్చజెప్పటానికి ప్రయత్నించినా వినలేదతను. పైగా 'యుద్ధం జరుగుతుందా! సరే కానీ! ఎట్టి పరిస్థితుల్లో పడవలను మాత్రం వదలను' అని ఖడింతంగా చెప్పాడట!"

"ఆయుధాలు ఎక్కడికి పోతున్నాయి?" అడిగింది దలినీ.

"యుద్ధం ఎక్కడ జరిగితే అక్కడికి! ఇంగ్లీషువాళ్ళు ఏ రీతినా యుద్ధాన్ని వదిలిపెట్టరు. యుద్ధం జరిగే చోటికి ఆయుధాలు పంపిస్తున్నారనేది కోటలో వినిపించిన మాట.." కులుసూమ్ జవాబిచ్చింది.

"గురుగన్ఖాన్ వాటిని ఎందుకు ఆపాలనుకుంటున్నారు?"

"అక్కడికి మరిన్ని ఆయుధాలు చేరితే గెలవడం సాధ్యం కాదు. శత్రువుల్ని ముందుకు పోనీయడం మంచిది కాదంటాడతను. 'మనం ఆంగ్లేయుల్ని జయించలేం. యుద్ధం చేయకపోవటమే మేలు. నావలను నిలిపి కయ్యానికి కాలుదువ్వటం ఎందుకు?' అనేది అలీ ఇబ్రహీం మాట. నిజమే! ఇంగ్లీషువాళ్ళ నుండి మనల్ని కాపాడుకోలేం. సిరాజుద్దౌలా ఉదంతం తిరిగి జరుగుతుందేమోనని ప్రజల భయం" కులుసూమ్ తనకు తెలిసిన విషయం మనవి చేసింది.

దలినీ కొంతసేపు ఆలోచించి "కులుసూమ్! ఓ పని చేస్తావా?" అంది.

"రాణీ బేగం! ఏలీస్ చేపను తినిపించనా? లేక పన్నీటి స్నానం చేయించనా?"

"పరిహాసమా? నవాబుకు తెలిస్తే నిన్ను, నన్ను ఏనుగుతో తొక్కిస్తారు" హెచ్చరించింది దలినీ.

అయినా కులుసూమ్ వెనక్కి తగ్గకుండా "ఎలా తెలుస్తుంది? బంగారు, వెండి, అత్తరు, పన్నీరు వంటివి దొంగిలించినా తెలియలేదు. మగాళ్ళ కళ్ళు కేవలం స్త్రీల ముఖారవిందం పైనే వుంటాయి. అది తప్ప ఆ కళ్ళకు ఏదీ కనబడదు. ఆడవాళ్ళ తెలివితేటలు ఎప్పుడైనా మగాళ్ళకు తెలుస్తాయా? నేనైతే గమనించలేదు" అంది.

దలినీ కోపంతో కఠినంగా "నోరు మూసుకో! నేను కొజ్జా గురించో, వంటవాడి గురించో చెప్పడంలేదు. నవాబ్ అలీజహా

**కొత్తగాలి...**

**ప్రాచీన**
**సంప్రదాయాల మీద**
**సరికొత్త ఆవిష్కరణ**
**అమరావతి!**

– జి.వి.యస్. ప్రియంవద,
శ్రీకాకుళం

అందరి మగాళ్ళలా కాదు. ఆయనకు తెలియకుండా ఏదీ ఉండదు" అంది.

"ఆ మాత్రం జాగ్రత్త తీసుకోనా? ఇంతకీ ఏం చెయ్యాలి? "

"గురుగన్‌ఖాన్‌కు లేఖ ఇచ్చి రావాలి"

కులుసూమ్ మౌనం వహించింది.

"చేయలేవా? " రెట్టించింది దలినీ.

"ఉత్తరమెవరిస్తారు? "

"నేను"

"ఎందుకు? మీకు పిచ్చిపట్టిందా? "

"అంతేననుకో!"

కొద్ది సమయం ఇద్దరి నడుమా మౌనం. నెమళ్ళు వారి మౌనం చూసి తాము కూర్చుండే కర్ర పైకి ఎక్కాయి. చిలుక అరవడం మొదలెట్టింది.

"పని చిన్నది. ఎవరైనా కొజ్జాకు డబ్బిచ్చి చేయించుకోవచ్చు. కానీ నవాబుకు తెలిస్తే ప్రాణాలు పోతాయి. ఏమోనమ్మా! నీ పని నీ యిష్టం! అయితే లేఖతోబాటు కొంత డబ్బివ్వు" కులుసూమ్ అంది.

కులుసూమ్ లేఖ తీసుకుపోయింది.

ఈ లేఖవల్ల అదృష్టం- దలినీని, శైవలినిని ఒకేగాట చేర్చింది.

★ ★ ★

ఎవర్నికైతే దలినీ ఉత్తరం చేరిందో అతని పేరు గురుగన్‌ఖాన్. బెంగాల్‌లోని రాజోద్యోగుల్లో గొప్పవాడు. ఆర్మానీ జాతీయుడు. ఇస్ఫహాన్ ప్రాంతంలో జన్మించాడు. మొదట్లో అతడు బట్టల వర్తకుడు. అసాధారణ ప్రతిభావంతుడు. రాజోద్యోగంలో చేరిన కొద్దికాలానికే స్వశక్తితో సేనాపతి కాగలిగాడు. ఆ వెంటనే ఫిరంగి దళాన్ని ఏర్పాటు చేశాడు. యూరోపియన్లలానే సైన్యాన్ని శక్తిమంతంగా మలిచాడు. అతడు తయారుచేయించిన మందుగుండు సామగ్రి యూరోపియన్లను మించిపోయింది. అతని చేతి కింద యూరోపియన్ సైన్యానికి దీటైన సైన్యముంది.

గురుగన్‌ఖాన్ సాయంతో ఆంగ్లేయుల్ని ఓడించగలననే నమ్మకం నవాబు మీర్‌ఖాసింకుంది. నవాబు వద్ద అతని అధికారం ఆ కారణంగానే బలపడింది. అతని సలహా లేనిదే నవాబు ఏ పనీ చెయ్యడు. అతనికి వ్యతిరేకంగా ఏ ఫిర్యాదు వచ్చినా మీర్‌ఖాసిం నమ్మడు. ఫలితం గురుగన్‌ఖాన్ చిన్న నవాబు అయ్యాడు. పరిపాలనలోని ముస్లిం కార్యాధ్యక్షులు అతనికి వ్యతిరేకం అయ్యారు.

రాత్రి రెండు ఝాములయ్యింది. గురుగన్‌ఖాన్ యింకా నిద్రపోలేదు. దీపం వెలుగులో కలకత్తా నుండి వచ్చిన ఉత్తరాలు చదువుతున్నాడు. చదవడం పూర్తవడంతో కాపలా సైనికుడ్ని పిలిచాడు.

అతను వచ్చి ఎదురుగా నిలిచాడు.

"ద్వారాలన్నీ తెరిచి వున్నాయా? "

"జీ హుజూర్! అన్నీ తెరిచి వున్నాయి"

"ఎవరైనా నా దగ్గరకొస్తుంటే ఆపకండి. 'మీరెవరు? ' అని కూడా అడగవద్దు. ఈ విషయం కాపలా వాళ్ళందరికీ చెప్పు"

తలూపాడతను.

"సరే! నువ్వెళ్ళు"

అతను వెళ్లాక గురుగన్‌ఖాన్ ఉత్తరాలు కట్టగా కట్టి దాచాడు. తర్వాత ఆలోచనలో మునిగాడు.

ఇప్పుడేం చేయాలి? ప్రస్తుతం భారతదేశం ఓ సముద్రం. ఎవరెంత లోతుకు చేరితే వాళ్ళకంత సంపద లభిస్తుంది. తీరంపైన కూర్చుండి అలలు లెక్కిస్తే లాభమేముంటుంది? నేనొకప్పుడు గజం బద్దతో గుడ్డలు కొలిచి అమ్మాను. కానీ ఈ రోజు నా భయంతో హిందుస్థానమే కదిలిపోతోంది. నేనిప్పుడు బెంగాల్‌కు ప్రభువును. అసలు ప్రభువులు ఎవరు? ఆంగ్లేయులు. మీర్‌ఖాసిం వారికి బానిస. నేను మీర్‌ఖాసింకు బానిసను.

నేను పాలించేవారి బానిసకు బానిసను. చాల పెద్ద అధికారం! ఒకమారు బలప్రదర్శన చేయాలి. ఇంగ్లీషువాళ్లని దేశం

చమత్కారం,

# గంగకు ఆ దరి మేలా? ...ఈ దరి కీడా?

పరబింబాధరమున్ బయోధరములున్ పత్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూప కవ్వలి మొగంబైనంత నేమాయె? నీ
గురుభాస్వజ్జఘనంబు గ్రొమ్ముడియు మాకుం జాలవే? గంగ క
ద్దరిమేలిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజబింబాననా!

ప్రియుడు రావడం ఆలస్యమైనట్టుంది.. ప్రేయసి అలకబూనింది. అతని ముఖం చూడరాదని వెనుకకు తిరిగి నిలబడింది.

అయితే ఆ సరసుడు బహుగడసరి! అందమైన నీ దొండపండ్లలాంటి అధరాలు, పాలిండ్లు, ముఖంమీద వాలే తుమ్మెద రెక్కల్లాంటి నీకురులు మనస్సును దోచేసే నీ కళ్లు చూపకుండా నువ్వు వెనక్కి తిరిగి నిలబడితే మాత్రమేంటి..? ఘనమైన నీ జఘనం, ముడేసుకున్న నీ కేశపాశాల సౌందర్యం మాకు చాలవా? గంగకు ఆ ఒడ్డు మంచిదని, ఈ ఒడ్డు చెడ్డదనీ ఉంటుందా? అంటూ స్త్రీ ఏవైపు నుంచి చూసినా అందమే కనబడుతుందని సూత్రీకరించాడు.

అహో! ఏం పోలిక! ఏం ఊహ! శభాష్!

ఇలాంటి పద్యాలు చెప్పాలంటే సాధారణంగా శ్రీనాథ మహాకవి గాక ఇంకెవరు చెబుతారు? అనుకుంటారు.. కానీ ఈ పద్యం చెప్పింది మాత్రం అక్షరాలా తెనాలి రామకృష్ణుడు. 'భళిరా రామకృష్ణకవీ!' అని ప్రశంసించడం తప్ప మనమేం ఇవ్వగలం ఆ మహానుభావుడికి!

సేకరణ: చంద్రప్రతాప్



నుండి వెడలగొట్టాలి. అప్పుడే అధికారం దక్కుతుంది. నేను బెంగాల్‌కు రాజును గావాలి. మీర్‌ఖాసింను రాజుగా అంగీకరించను. తలచుకుంటే మీర్‌ఖాసింను పదవి నుండి దించిపారేస్తాను. అదే ప్రస్తుతం పొందాల్సిన పైమెట్టు. నేను పైకి వెళ్ళిం తర్వాత ఆ మెట్టును తొలగించేస్తాను. నిజమైన క్షుద్రులు ఆంగ్లేయులు. వాళ్లు నన్ను పట్టుకోవాలనుకుంటున్నారు. కానీ నేనే వాళ్లని ఏరిపారేస్తాను. వాళ్ల చేతికి ఎట్టి పరిస్థితుల్లోను తను చిక్కకూడదు.

మీర్‌ఖాసిం ప్రస్తుతం గద్దె మీద వున్నాడు. అతడి సహాయకుడిగా ఉండి, బెంగాల్ నుండి ఆంగ్లేయుల్ని తరిమికొట్టాలి. అందుకోసం ఓ యుద్ధాన్ని కల్పించాలి. తర్వాత మీర్‌ఖాసింను గద్దె దింపడం చిటికెలో పని. ఈ మార్గమే బాగుంది.

అతని ఆలోచనలు దలినీ వైపు సాగాయి. అసలు దలినీ ఈ పనికెందుకు పూనుకుంది? తనకెందుకు వుత్తరం రాసింది? అతని ఆలోచనలు నడుస్తుండగానే దలినీ బేగం ఎదురుగా నిలిచింది. గురుగన్‌ఖాన్ ఆమెకు ఆసనం చూపాడు.

"సోదరీ! చాలారోజుల పిదప నిన్ను చూసి సంతోషం కలుగుతోంది. నువ్వు నవాబు యింట ప్రవేశించాక మళ్ళీ దర్శనం కాలేదు. నువ్వు ఈ అపాయకరమైన పనెందుకు చేస్తున్నావు? "

"ఇందులో అపాయమేముంది? "

"నువ్వు నవాబుగారి పత్నివి. ఇంత రాత్రి ఒంటరిగా, రహస్యంగా నా దగ్గరికి వచ్చావు. నవాబుగారికి తెలిస్తే యిద్దరి ప్రాణాలు గాల్లో కలుస్తాయి"

"ఈ విషయం ఆయనకు తెలిస్తే మన సంబంధం ఏమిటో చెబుతాను. అప్పుడాయన కోపించే అవకాశమే వుండదు"

"చిన్నదానివి! కనుకే అలా అనుకుంటున్నావు. ఇంతకాలం మన సంబంధం మనకే తెలుసు. నవాబు ముందు పెట్టలేదు. మనం పరస్పరం తెలుసన్న విషయం బయటకు రాలేదు. ఈ క్లిష్టపరిస్థితుల్లో మనం నిజం చెప్పినా ఆత్మరక్షణకు అసత్యం చెబుతున్నామంటారు. నువ్వు ఇక్కడకు రావడం సరికాదు"

"అయినా నవాబుగారికి తెలుస్తుందనే అనుమానమెందుకు? కావలివాళ్లంతా నీ అధికారం కింద వున్నవాళ్ళే! నువ్వు యిచ్చిన గుర్తు చూపితేనే నన్ను వదిలిపెట్టారు. ఒక్క విషయం నిన్నడగటానికే వచ్చాను. ఇంగ్లీషువాళ్లతో యుద్ధం జరుగుతుందా? ఇది నిజమా? "

"కోటలోనే ఇది తెలుసుకోలేవా? "

"తెలుసుకోగలను. తెలుసుకున్నా. ఆంగ్లేయులతో యుద్ధం నిర్ణయమైంది. నువ్వే దీన్ని ఆహ్వానించావనీ తెలిసింది, ఎందుకీ సాహసానికి పూనుకున్నావు? "

"చిన్నపిల్లవు! నీకీ రాజకీయాలు ఎలా అర్థమవుతాయి? "

"చిన్నపిల్లలా మాటాడుతున్నానా? ప్రవర్తిస్తున్నానా? నన్నెక్కడైతే నీ సహాయకురాలిగా నిలిపావో, అక్కడ నేను చిన్నపిల్లను కానా? ఇప్పుడు చిన్నపిల్లలా లెక్కిస్తే సరిపోతుందా? "

"సరిపోకపోనీ! అయినా ఆంగ్లేయులతో యుద్ధం జరిగితే నీకు, నాకు నష్టమేముంది? జరిగేదేదో జరుగుతుంది"

"నువ్వు జయించగలవా? "

"జయిస్తామనే నమ్మకముంది"

"నేటి వరకు వారిని గెలిచిందెవరు? "

"గురుగన్‌ఖాన్ వంటి వాళ్ళెందరితోనో ఆంగ్లేయులు పోరాటం చేశారు కానీ.."

"మనం ఆంగ్లేయులతో యుద్ధం చేసి జయించలేమనేదే నా నమ్మిక. ఈ యుద్ధం వల్ల మనం సర్వనాశనమైపోతాం. నిన్ను ప్రార్థిస్తున్నా! నువ్వే యుద్ధాన్ని ఆహ్వానించకు"

"ఇలాంటి రాజకీయ విషయాల్లో స్త్రీల అభిప్రాయం తీసుకోరు"

అ
క్ష
రం

జ్ఞానాన్ని పెట్టుబడిగా పెడితే
నిరంతరం వడ్డీ వస్తుంటుంది.

– బెంజమిన్ ఫ్రాంక్లిన్



"నా ఆలోచన మన్నించాలి. నాకు రక్షణ కల్పించాలి"

గురుగన్‌ఖాన్ ఆశ్చర్యపోయాడు.

"ఏడుస్తున్నావెందుకు? ఒకవేళ మీర్‌ఖాసింకు సింహాసనం పోతే, నేను నిన్ను మనదేశం తీసుకుపోతాను"

క్రోధంతో దలినీ కళ్ళు మండాయి. ఆమె ఆడపులిలా గర్జిస్తూ "నువ్వు మరిచిపోతున్నావు. మీర్‌ఖాసిం నా పతిదేవుడు. నాకు అన్నివైపులా అంధకారమే గోచరిస్తోంది" రోదించిందామె.

గురుగన్‌ఖాన్ విస్మయంతో "లేదు, మరవలేదు. కానీ ఎవరి పతిదేవుడూ శాశ్వతం కాదు. ఒక భర్తపోతే మరోభర్త వస్తాడు. ఒకనాటికి నువ్వు హిందుస్థాన్‌లో మరో నూర్జహాన్ అవుతావేమో!"

దలినీ కోపంతో కంపించిపోయింది. లేచి నిలబడి కళ్లు తుడుచుకుంది.

"నువ్వు నాశనమైపోతావ్! ఏ దురదృష్టంతోనో నీకు సోదరినై పుట్టాను. ఏ దుష్టసమయంలోనో నీకు సాయపడతానని మాట యిచ్చాను. చేతనైనంత సాయపడ్డాను. స్త్రీలలో వుండే ప్రేమ, దయ, ధర్మాలు నీకు తెలియవు" అంది. మళ్ళీ ఆమే "నువ్వు ఈ యుద్ధపు ఆలోచన నుండి దూరం జరిగితే మేలు. లేదా నీకు, నాకు భవిష్యత్తులో ఏ సంబంధమూ వుండదు. బాంధవ్యమేకాదు, ఈ క్షణం నుండి నిన్ను శత్రువుగా భావిస్తా. నన్ను కూడా నీ శత్రువుగా భావించు. రాజ్యాధికారంలో నీకు నన్ను మించిన శత్రువు వుండదు" అంటూ ఆమె విసవిసా బయటకు నడిచింది.

దలినీ వెళ్ళిపోవటంతో గురుగన్‌ఖాన్ అప్రమత్తమయ్యాడు. అతడు జరగబోయేది ఆలోచించాడు. దలినీ ఇప్పుడు తన మనిషి కాదు. తన సోదరి కాదు. మీర్‌ఖాసిం పత్ని.

'సోదరా!' అని పిలుస్తుందే కానీ ప్రేమంతా భర్తమీదే. సోదరుడు భర్తకు హాని చేస్తాడని భావిస్తే భర్తకే సహాయపడుతుంది. తనకి హాని చేస్తుంది. ఇప్పుడు ఆమె కోటలో ప్రవేశించకూడదు. వెంటనే కాపలాదారుని పిలిచాడు.

అతను వచ్చి ఎదుట నిలిచాడు.

"కాపలాదారులందరికి దలినీ బేగంని కోటలో ప్రవేశించనీయకూడదని నా మాటగా చెప్పు" అంటూ ఆదేశించాడు.

అశ్వాన్నెక్కి ఆ కాపలా సైనికుడు దలినీ కంటె ముందు కోటద్వారం చేరుకున్నాడు.

సింహద్వారం వద్ద దలినీకి ప్రవేశానుమతి లేదని కావలివారు సూచించారు.

మొదలు నరికిన తీగలా ఆమె కూలబడింది. కళ్ళు ధారలు కట్టాయి. 'సోదరుడు నిలువ నీడ లేకుండా జేశాడు' అనుకుంది.

"అమ్మా! తిరిగి సేనాపతి దగ్గరకు వెళ్దాం!" అంది కులుసూమ్.

"ఎందుకు వెళ్ళాలి? ఇప్పుడు నా స్థానం గంగానది గర్భంలోనే"

అర్ధరాత్రి వేళ వెంట ఒక చెలికత్తెతో వున్న బెంగాల్ నవాబు ప్రియపత్ని దలినీ బేగం రాజమార్గంపై నిలబడి రోదిస్తోంది.

"ఇప్పుడేం చేద్దాం? " కులుసూమ్ అంది.

దలినీ కళ్ళు తుడుచుకుని "ఈ చెట్టు కింద నిలబడదాం! తెల్లవారనీ..!" అంది.

"తెల్లవారితే మనం పట్టుబడిపోతాం!"

"భయమెందుకు? నేనేం చెడ్డపని చేశానని భయపడాలి? "

"దొంగల్లా రాజభవనం విడిచి వచ్చాం. ఎందుకు వచ్చామో మనకు తెలుసు. కానీ లోకులు ఏమంటారు? నవాబు ఏం ఆలోచిస్తారు? ముందది తెలుసుకో!"

"ఎవరు ఏమైనా అనుకోని! భగవంతుడు మనకన్యాయం జెయ్యడు. మరొకరి మాట నేను లెక్కచేయను. అవసరమైతే మరణిస్తా! నష్టమేముంది? "

"ఇక్కడ నిలబడి వుంటే మాత్రం కలిగే లాభం ఏముంది? "

"ఇక్కడే వుంటే పట్టుబడిపోతా. అందుకే ఉన్నా. ఎట్టా పట్టుబడిపోవాలా అనేదే నా ఆలోచన. బంధించిన వాళ్లు నన్నెక్కడికి గొనిపోతారు? "

"రాజదర్బార్‌కు.."

"నవాబు దగ్గరకు! నేనక్కడికే వెళ్ళదలచాను. వెళ్ళేందుకు నాకు మరోచోటు లేదు. నవాబు నాకు మరణ శిక్ష విధిస్తే చనిపోయే ముందు నేనే తప్పు చేయలేదని నవాబుకు చెప్తాను. పద! ఆ నగరద్వారం ముందే కూర్చుందాం! అక్కడైతే ఇంకా త్వరగా బంధిస్తారు" అడుగు ముందుకు వేయబోయింది దలినీ బేగం.

తమ పక్కనుంచే ఓ విశాలకాయుడు గంగానది వైపు వెళ్తున్నాడు. అతన్ని చూసి భయభ్రాంతులై వారు మరింత చీకట్లోకి చెట్టు పక్కకు ఒదిగారు.

తన గమనం మార్చి అతడు వీళ్ల వైపు చెట్టు కిందకు వచ్చాడు.

"మీరెవరు? " అంటూ ప్రశ్నించి తన లాగే దారితెలియక తిరుగుతున్న దురదృష్టవంతులేమో అనుకున్నాడు తనలో.

మొదట భయపడినా, అతని మృదువైన కంఠధ్వని విని జవాబిచ్చారు వాళ్లు.

"మేం స్త్రీలం! మీరెవరు? " అంది కులుసూమ్.

"నేనా? మీరెందరున్నారు? అయినా ఇంత రాత్రి వేళ ఇక్కడేం చేస్తున్నారు? "

"మేం దురదృష్టవంతులం! మా దుఃఖ గాథ వింటే మీకేం లాభం? "అంది దలినీ.

"నేను సాధారణ వ్యక్తిని. ఆపదలో వుంటే, నా శక్తి కొలదీ మీకు సహాయపడతాను" అన్నాడు విశాలకాయుడు.

"మీరెవరైనా కావచ్చు, మీ మాటలపై నమ్మకం కలుగుతోంది. నిండా మునిగి చనిపోయేవారు అందే సహాయం ఎలాంటిదని ఆలోచించరు. మా గురించి తెలియాలంటే కొంతదూరం నడుద్దాం. అసలే రాత్రి సమ యం. ఈ విషయం రహస్యం. మరెవరికీ తెలియరాదు" అంది దలినీ.

"సరే నడవండి!" అంటూ అతడు నగరంలోకి నడిచాడు. ఒక చిన్న గృహం ముందు నిలిచి చేత్తో తలుపుపై శబ్దం చేస్తూ "రామచరణ్" అని పిలిచాడు.

ద్వారం తెరుచుకుంది. ద్వారం తెరిచిన రామచరణ్ దీపం వెలిగించి ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

"నువ్వెళ్ళి పడుకో" అతనితో అన్నాడు ఆ దీర్ఘకాయుడు.

రామచరణ్ ఆయన వెనక వచ్చిన దలినీ, కులుసూమ్‌లను జూస్తూ వెళ్లాడు.

'ఠాకూర్‌జీ! ఇంత రాత్రివేళ ఇద్దరు స్త్రీలనెందుకు తెచ్చారు? ' అతనిలో జిజ్ఞాస పెరిగింది. రామచరణ్‌కు ఆయన బ్రహ్మచారిగా తెలుసు. ఆయనను దైవంగా భావిస్తాడతను. అతడు జితేంద్రియుడని అనుకుంటాడు. తన నమ్మకంలో అనుమానం లేదు. బహుశా ఈ ఇద్దరు స్త్రీలు విధవలై వుంటారు. వారిని సధవలు చేయడానికి హితబోధకై తీసుకొచ్చి వుంటారు. ఈ చిన్నవిషయం అర్థం చేసుకోలేకపోయానని మొట్టికాయ వేసుకున్నాడు రామచరణ్.

బ్రహ్మచారి ఓ ఆసనంపై కూర్చున్నాడు. స్త్రీలిద్దరూ నేలమీద కూర్చున్నారు.

దలినీ బేగం మొదట తన పరిచయం

## ఆధునిక తెలుగు కవిత్వ సదస్సు 7న..

న్యూఢిల్లీలోని గురజాడ కళామందిరంలో ఈనెల ఏడోతేదీన 'ఆధునిక కవిత్వ సదస్సు' జరుగుతుందని నిర్వాహకులు ఒక ప్రకటనలో తెలిపారు. దేశరాజధానిలోని తెలుగువారికి కవిత్వ రుచులు అందించే ప్రయత్నమిది. విభిన్న దృక్పథాలకు, కవితా పద్ధతులకు ప్రాతినిధ్యం వహిస్తున్న రెండు తెలుగు రాష్ట్రాల వారితో పాటు, అమెరికా నుంచి ఎనిమిది మంది కవులు ఈ సదస్సులో పాల్గొంటున్నారు. స్వీయకవితా గానంతో పాటు ఐదు దశాబ్దాల తెలుగు కవిత్వం తీరుతెన్నులు చర్చించే ఈ సదస్సులో దేవరకొండ సుబ్రహ్మణ్యం, యేల్చూరి మురళీధరరావు, యార్లగడ్డ లక్ష్మీవరప్రసాద్, కె. శివారెడ్డి, ఎన్. వేణుగోపాల్ తదితర ప్రముఖులు పాల్గొంటున్నారు.

చేసుకుని తర్వాత ఏ విషయంగా ఎక్కడికి వెళ్ళింది, అక్కడ ఏం జరిగిందీ.. తాము ఇప్పుడు చిక్కుల్లో పడిన దుస్థితీ.. అంతా ఏదీ దాచకుండా వివరించింది.

బ్రహ్మచారి ఆలోచించాడు. విధిలిఖితం తప్పుతుందా? ఏది జరగాలో తప్పకుండా జరుగుతుంది. 'ఠాకూర్‌జీ! నువ్వు నీ గ్రంథాలన్నీ కాల్చిపారేశావు! మరిచావా?' మనసులో అనుకుని "చేతులు ముడుచుకోవటం పురుషార్థం కాదు. కర్తవ్యం తప్పకుండా నిర్వహించాలి. అమ్మా! నా సలహా ఏమంటే మీరిప్పుడు నవాబు ముందుకు వెళ్ళకండి. పరోక్షంగా ఉత్తరం ద్వారా ఆయనకు మనవి జేయండి. మీపై ప్రేమాభిమానాలుంటే, విశ్వాసం కుదిరితే ఆయన ఆజ్ఞ ఇస్తే ముందుకు వెళ్ళండి" అన్నాడు.

"స్వామీ! ఉత్తరం ఎలా చేరుతుంది?"

"నేను ఆ ఏర్పాటు చేయగలను"

దలినీ కాగితం, కలం అడిగింది

రామచరణ్‌ను పిలిచాడు బ్రహ్మచారి. అతడు కాగితం కలం తెచ్చిచ్చాడు.

దలినీ ఉత్తరం రాసింది.

బ్రహ్మచారి ఉత్తరం తీసుకుని వాళ్లతో "ఈ ఇల్లు నాది కాదు కానీ, నవాబుగారి జవాబు అందేదాకా మీరిక్కడే వుండండి! ఎవరూ మిమ్మల్ని అడగరు. ఎవరికీ ఏమీ చెప్పాల్సిన అవసరంలేదు" అని చెప్పి రామచరణ్‌కు తగిన సూచనలందించి, చీకట్లోనే బయటకు వెళ్ళిపోయాడు.

ముంగేరి రాజధానిలో హిందూ ఉద్యోగులందరూ బ్రహ్మచారికి పరిచితులే. ముసల్మానులు కూడ ఆయన్ని గుర్తిస్తారు.. గౌరవిస్తారు.

ముంగి రాయగోవింద్‌రాయ్ బ్రహ్మచారిని అధికంగా గౌరవిస్తాడు. బ్రహ్మచారి సూర్యోదయంతోనే కోటలో ప్రవేశించాడు. రాయగోవిందరాయ్‌ని కలిసి ఉత్తరం అందించాడు.

"ఎక్కడా నా పేరొద్దు. ఓ బ్రాహ్మడు వుత్తరం తెచ్చాడు" అని చెప్పండి అన్నాడు.

'ఉత్తరం ఎవరిది? ఏ విషయం?' అని గోవిందరాయ్ అడగలేదు. బ్రహ్మచారి చెప్పలేదు. కానీ గోవిందరాయ్ బ్రహ్మచారితో "స్వామి జవాబు కోసం రేపు రండి" అని నమస్కరించాడు.

వెంటనే బ్రహ్మచారి ఇల్లు చేరుకుని దలినితో "అమ్మా! రేపు జవాబు వస్తుంది. ఏదోలా ఈ రోజు గడపండి" అన్నాడు.

రామచరణ్ ఆ స్త్రీలను ఉదయం చూశాడు. వాళ్ళలో 'సతి' అయ్యే లక్షణాలేవీ కనిపించలేదు. ఆ గృహంలో మరో గదిలో ఓ వ్యక్తి పడుకుని వున్నాడు. అతన్ని పరిచయం చెయ్యాల్సి వుంది.

★ ★ ★

సుందరి కోపంతో శైవలిని వున్న పడవ దిగిపోయింది. మార్గమంతా తన భర్త ముందు శైవలినిని దూషిస్తూనే వుంది. ఓసారి 'అభాగిని' అంటూ, మరోసారి

'గుర్రం ముఖం' అంటూ, ఇంకోసారి 'నల్ల ముఖం' అంటూ తన భర్తలో కుతూహలాన్ని పెంచుతూ వచ్చింది. ఇల్లు చేరింతర్వాత బోరున ఏడ్వసాగింది.

కొన్ని రోజులు గడిచాయి. ఒక రోజున సుందరి ఢాకా చీర ధరించి, ఆభరణ భూషితరాలైంది.

సుందరిది చంద్రశేఖర్ ఇరుగిల్లు. బాంధవ్యంలో అతనికి చెల్లెలవుతుందన్నది విదితమే కదా! తండ్రి ఒంటరి అవుతాడని సుందరి తండ్రి వద్దనే వుంటోంది. ఆమె భర్త శ్రీనాథుడు. ఇల్లరికపు అల్లుడు కాదు కానీ ఎక్కువ కాలం అత్తవారింటే వుంటాడు. శైవలిని దుర్ఘటన సమయంలో వేదగ్రామంలోనే వున్నాడు. సుందరి తల్లి రోగిష్టిది. మంచంలోనే వుంటుంది. సుందరికి ఓ చెల్లెలుంది. ఆమె పేరు రూపసి. పెళ్లయ్యింది. అత్తారింట్లో వుంటోంది.

సుందరి చీర, నగలు, ధరించి వచ్చి తండ్రితో "నాన్నా! నేను రూపసిని చూసి వస్తాను. దాని గురించి నాకు పీడకలలొస్తున్నాయి" అంది.

సుందరి తండ్రి కృష్ణ కమల్ చక్రవర్తి. కూతురి చేతిలో మనిషి. అయినా కూతురిని నిరోధించే ప్రయత్నం చేసి చివరికి అంగీకరించాడు.

సుందరి పల్లకిపై చెల్లిగారి ఇంటికి వెళ్ళింది. శ్రీనాథుడు తనింటికి వెళ్ళాడు.

రూపసి భర్త ఎవరు? అంటే శైవలినితో వివాహమైన తర్వాత చంద్రశేఖర్ తన అత్తవారింటి పక్కయింట్లో ప్రతాప్‌ను చూసేవాడు. ప్రతాప్ కథ అతనికి నచ్చింది. సుందరి చెల్లెలు రూపసి, రజస్వలయింతర్వాత ఆమె పెళ్ళి ప్రతాప్‌తో జరిపించాడు. అంతేకాదు చంద్రశేఖర్ కరీంఅలీఖాన్ విద్యా గురువు. కరీంఅలీఖాన్ నవాబు వద్ద రాజకీయోద్యోగంలో వున్నాడు. ఆయన సహాయంతో ప్రతాప్‌కు రాజదర్బార్‌లో ఉద్యోగం ఇప్పించాడు.

ప్రతాప్ తన గుణగణాలతో మంచి పేరు హోదా సంపాదించాడు. అతడిప్పుడు జమీందార్! పెద్ద భవనం, పేరు ప్రఖ్యాతులు వున్నాయి.

సుందరి పల్లకీ పట్టణంలో ప్రవేశించింది. రూపసి అక్కను చూసి ప్రణమిల్లి గౌరవంగా గృహంలోకి తీసుకుపోయింది.

ప్రతాప్ వచ్చి వదినగారి యోగక్షేమాలు విచారించాడు. తర్వాత వీలుచూసి వేదగ్రామం, చంద్రశేఖర్ గురించి అడిగాడు.

వేదగ్రామంలో జరిగింది చెప్పడానికే వచ్చాను. అనర్థం జరిగిపోయిందంటూ చంద్రశేఖర్ ఇంటిపై దాడి, శైవలిని అపహరణ, చంద్రశేఖర్ ఇల్లొదిలి పోవడం పూసగుచ్చినట్లు సుందరి వివరించింది.

"ఇన్ని రోజులుగా నాకెందుకు తెలియజేయలేదు? " ప్రతాప్ ఆశ్చర్యపోతూ కొంచెం కఠినంగా అడిగాడు.

"ఎందుకు? చెబితే ఏం చేయగలవు"

"ఏం జరుగుతుంది? ఎంతో కొంత మేలు వెంటనే జరిగేది"

"నువ్వు మేలు చేయగలవని నాకేం తెలుసు? "

"నీకు తెలియదు? నా సర్వస్వం చంద్రశేఖర్ వద్ద ఉంది"

"గొప్ప మనుషులయ్యాక, పాత విషయాలు మరిచి పోతారనుకున్నా"

ప్రతాప్‌కు కోపం వచ్చింది. అయినా మౌనంగా లేచాడు. సుందరి అతని కోపం చూసి సంతోషించింది.

ఆ రోజే ప్రతాప్ ఓ వంటవాణ్ణి, ఓ నౌకరును తీసుకుని ముంగేరికి ప్రయాణమయ్యాడు. నౌకరు రామచరణ్.

రూపసితో అతను "చంద్రశేఖర్, శైవలినిలను వెతకడానికి వెళ్తున్నాను. వాళ్ళు దొరికే దాకా రాను" అంటూ చెప్పాడు.

ముంగేరిలో బ్రహ్మచారి దలినీబేగం, కులుసూమ్‌లను తీసుకెళ్ళిన స్థావరం ప్రతాప్‌దే.

సుందరి కొన్ని రోజులు చెల్లెలి దగ్గర వుంది. పగలు, రాత్రి అనకుండా ఉన్నన్ని రోజులూ చెల్లెలి ముందు శైవలినిని తిట్టి పోసింది. శైవలిని పాపాత్మురాలు.. అలాంటి అభాగిని మరొకరుండరని నిరూపించే ప్రయత్నం చేసింది.

వినీ వినీ రూపసి ఒకరోజు- "సరే! నువ్వెందుకు ఆమె గురించి ఇంతగా ప్రయాస పడుతున్నావు? " అని నిలదీసింది.

"ఆమె తల నరకటానికి! యముడి వద్దకు పంపడానికి" అంది సుందరి కోపంతో.

"ఊరికే చిటపటలాడుతున్నావు? "

"ఆమే నన్నిలా తయారుచేసింది"




కలకత్తాలోని కౌన్సిల్ నవాబుతో యుద్ధానికి నిర్ణయించింది. ఆ సమయంలో ఆజమాబాద్ (పాట్నా) గిడ్డంగికి ఒక నావ నిండా ఆయుధాలు పంపారు.

ఆజమాబాద్ అధికారి ఏలిసా సాహెబ్‌కు రహస్య సమాచారం అందించాల్సిన అవసరం ఏర్పడింది. అమియట్ సాహెబ్ ముంగేరీలో నవాబుతో యుద్ధనివారణ ప్రయత్నంలో ఉన్నాడు. ముంగేరీలో ఏం ప్రయత్నాలు జరిగాయి? అతడేం చేస్తున్నాడు? ఆ వివరాలు తెలియకుండా ఏలీసాకు ఏం సమాచారం అందించాలో నిర్ణయించలేకపోతున్నారు. సమాచారం తెలుసుకోవడానికి ఓ వ్యక్తిని పంపాల్సిన అవసరం ఏర్పడింది. అతడు అమియట్‌ను ముంగేరీలో కలిసి అతని అభిప్రాయం తెలుసుకుని, ఆ తర్వాత ఆజమాబాద్ వెళ్ళటం అక్కడ ఏలీసాకు, కలకత్తా కౌన్సిల్ నిర్ణయాన్ని చెప్పడం అతని పని.

ఈ పనుల కోసం గవర్నర్ బాసిటార్ట్ పురందరపూర్ నుండి పాస్టర్‌ను పిలిపించాడు. అతని పని ఆయుధ నావకు రక్షణగా వెళ్లడం, మధ్యలో అమియట్‌ను కలవడం, అక్కడ్నుంచి ఆజమాబాద్ వెళ్ళటం. పాస్టర్ కలకత్తా చేరిన వెంటనే పశ్చిమ యాత్రకు ప్రయాణమయ్యాడు.

ఈ విషయాలన్నీ పాస్టర్ ముందే తెలుసుకున్నాడు. కనుకే శైవలినిని నావ ఎక్కించి ముంగేరికి పంపించాడు. ఆ నావ ముంగేరి చేరక ముందే ఆయుధ నావతో వచ్చి మధ్యలో కలుసుకుని రెండు నావల్నీ ముంగేరి తీరంలో ఆపించాడు.

ముందు ముంగేరీలో అమియట్‌ను కలిశాడు. వివరాలు తెలుసుకుని ప్రయాణానికి సెలవు తీసుకున్నాడు.

కానీ గురుగన్‌ఖాన్ ఆ రెండు నావల్ని నిలిపివేయించాడు. ఆ సందర్భంలో అమియట్, నవాబుల మధ్య చర్చ మొదలైంది. ప్రయాణం ఆగిపోవడంతో అమియట్, పాస్టర్‌ల మధ్య ఓ నిర్ణయం జరిగింది. నవాబు నావలను వదిలితే ముందుకు సాగడం, లేదా ఆయుధ నావను అక్కడ వదిలేసి, రెండో నావతో ఆజమాబాద్ వెళ్ళిపోవడం పాస్టర్ పని.

పాస్టర్ ముంగేరీ తీరంలో నిలిపిన రెండు నావల్లో ఒకటి దేశీ నావ.. చాలా పెద్దది. రెండోది చిన్నది. దేశీనావపై నవాబు సైనికులు పహరా కాస్తున్నారు. వారికి సహాయంగా తీరంపైన కూడా సైన్యం ఉంది. ఈ నావనే గురుగన్‌ఖాన్ నిలిపివేశాడు. అదే ఆయుధాలున్న నావ.

చిన్న నావలో ఆయుధాల్లేవు. పెద్ద నావకు అది ఏభై గజాల దూరంలో ఉంది. అక్కడ నవాబు సైనికులు లేరు.

నావ పైభాగంలో ఆంగ్లేయుల 'తిలంగా' (ఆంగ్లేయుల పటాలంలోని హిందుస్థాని సైనికుడు) రక్షణగా ఉన్నాడు.

రాత్రి రెండున్నర ఝాములు. చీకటి రాత్రి. ఆకాశం నిర్మలంగా ఉంది. చిన్న నావపై కాపలా ఉన్న 'తిలంగా' సాయుధుడు కూర్చుంటూ, లేస్తూ, అటూ ఇటూ తిరుగుతూ ఉన్నాడు.

తీరమంతా చిట్టడివి! అందులో ఓ మనిషి దాగుండి నిరీక్షిస్తున్నాడు. అతడెవరో కాదు ప్రతాప్‌రాయ్.

ప్రతాప్‌రాయ్ కాపలాదారు చర్యలను గమనించి నిశ్శబ్దంగా నీళ్ళలోకి దిగాడు. అయినా నీళ్ళ శబ్దం విని కాపలాదారు "ఎవరూ? " అంటూ అరిచాడు.

ప్రతాప్‌రాయ్ జవాబియ్యలేదు. కాపలాదారు మళ్ళీ తన పనిలో నిమగ్నుడయ్యాడు. నావలో పాస్టర్ జాగ్రత్తపడ్డాడు.

కాపలాదారుని అరుపు విని అతడు నావ నుంచి పరిశీలించి చూశాడు. ఓ మనిషి స్నానం కోసం నీటిలోకి దిగాడు.

అదే సమయంలో అడవిలోంచి తుపాకి పేలింది. నావపైని 'తిలంగా' తూటా తగిలి నీటిలో పడిపోయాడు. అతడు పడినచోట నావ నీడ పడి చీకటిగా ఉంది. అక్కడే ప్రతాప్‌రాయ్ ముక్కుల దాకా నీటిలో మునిగి నిలబడున్నాడు.

తుపాకీ పేలిన శబ్దం విన్న పెద్దనావ సిబ్బందిలో 'ఏమయింది? ఏమయింది? ' అంటూ గడబిడ ప్రారంభమైంది. నావలో నిద్రించేవాళ్ళు లేచారు. పాస్టర్ బందూక్ చేతబట్టి గది నుండి బయటకొచ్చాడు. నలువైపులా దృష్టి సారించాడు. నావపై 'తిలంగా' కనిపించలేదు. నక్షత్రాల వెలుగులో ప్రవాహంలో కొట్టుకుపోతున్న అతని శరీరాన్ని చూశాడు. సైనికులు అతన్ని కాల్చారనుకున్నాడు నవాబు. కానీ అదే సమయంలో అడవిలో సన్నటి పొగరేఖ పైకి లేవటం చూశాడు. పెద్ద నావ నుండి కొందరు జరిగింది తెలుసుకోవటానికి తమ వైపు వస్తున్నారు.

ఆకాశంలో తారలు ప్రకాశిస్తున్నాయి. గంగ ఒడ్డున వందలాది పెద్ద నావలు వరసగా నిద్రించే రక్షకుల్లా పడున్నాయి. గలగల శబ్దం చేస్తూ నది ప్రవహిస్తోంది. అదే ప్రవాహంలో 'తిలంగా' శరీరం కొట్టుకుపోతోంది. క్షణకాలంలో పాస్టర్ అంతా గ్రహించాడు. అడవిలో పొగలేచిన ప్రదేశాన్ని చూస్తూ తుపాకి గురిపెట్టాడు. శత్రువు అడవిలో ఉన్నాడని గ్రహించిన పాస్టర్ అతన్ని వెంటనే కాల్చి చంపగలడు. కానీ పాస్టర్ 'ప్లాసీ' యుద్ధం జరిగిన తర్వాత ఇక్కడ ఉద్యోగంలో చేరాడు. ఆంగ్లేయుడ్ని ఓ హిందుస్థానీ గురిపెట్టి కాలుస్తాడని అతడూహించలేదు. హిందుస్థానీని చూసి ఏ ఆంగ్లేయుడు భయపడతాడో వాడు చావడం మేలని అతని అభిప్రాయం. అతడు అడవిలోని శత్రువుపై ఎప్పుడు తుపాకి గురిపెట్టాడో అప్పుడే అడవిలో మంటలు లేచాయి. మళ్ళీ తుపాకి పేలింది. ఈసారి పాస్టర్ తలకు గాయమై కాపలాదారు లాగే నీటిలో పడిపోయాడు. అతడి చేతిలోని తుపాకి శబ్దం చేస్తూ నావపై పడింది.

ప్రతాప్‌రాయ్ తన మొలనుండి ఖైజార్ తీసి నావను కట్టి ఉంచిన తాళ్ళు కోసేశాడు. నీళ్ళు అక్కడ తక్కువ ఉండటంతో లంగరు వేయలేదు. ఒకవేళ లంగరు వేసినా శక్తిమంతుడైన అతనికి నావను తీసుకుపోవడం కష్టం కాదు. ఆ తర్వాత ఒక్క గంతులో నావపైకి చేరాడతను.

ఈ సంఘటన వర్ణించటానికి పట్టిన సమయంలో వందోవంతులో మొత్తం కార్యం జరిగిపోయింది. కాపలాదారు దెబ్బతిని పడిపోవటం, పాస్టర్ బయటకు రావడం, అతడూ పడిపోవడం, ప్రతాప్ నావనధిరోహించడం.. ఇంత జరిగినా పెద్ద నావవాళ్ళు అక్కడకు చేరలేకపోయారు.

అక్షరం

మేడమెట్లన్నీ చూడకపోయినా సరే, నమ్మకం అనేది తొలి సోపానమై గమ్యాన్ని చేరుస్తుంది

– మార్టిన్ లూథర్ కింగ్



వాళ్ళు చేరేసరికి చతురుడైన ప్రతాప్ నావను నడుపుకుపోయాడు. నావనందుకోవడానికి ఓ మనిషి నీటిలో దూకాడు. ప్రతాప్ నావ నడిపే తెడ్డుతో అతని తలపై మోదాడు. అతడు వెనుకకు మరలాడు. మరెవరూ ముందుకు రాలేదు. నావ ప్రవాహంలోకి వచ్చి తూర్పు వైపుకు వేగంగా సాగింది. ప్రతాప్ తెడ్డుతో రావడం చూసిన నావపైని మరో తిలంగా మోకాళ్ళపై కూర్చుని తుపాకి ఎత్తుతున్నాడు. అది చూసి ప్రతాప్ అతడి చేతిపై తెడ్డుతో బలంగా దెబ్బవేశాడు. అతని చెయ్యి విరిగినంత పనయి బందూకు కిందపడింది. ప్రతాప్ కిందపడిన తుపాకి, పాస్టర్ జారవిడిచిన తుపాకి రెండింటిని తీసుకుని, నావలో ఉన్న వారందరితో గంభీరంగా "వినండి! నా పేరు ప్రతాప్ రాయ్. నవాబుసాహెబ్ నాకు భయపడతారు. నా చేతిలో రెండు తుపాకులున్నాయి. వీటి సాయంతో మీలో చాలా మందిని నేనొక్కడినే చంపగలను. నాకు సహకరిస్తే ఎవరికీ హాని చేయను. చుక్కాని దగ్గరకు వెళుతున్నాను. పడవ నడిపే సరంగులందరూ మీ స్థానాల్లోకి వెళ్లి తెడ్లు వేయండి. మిగతా వాళ్లు ఎక్కడివారక్కడే ఉండండి. ఎవరికేం భయం లేదు" హెచ్చరించాడు.

నావ నడిపేవారిని సిద్ధం చేసి ప్రతాప్ చుక్కాని పట్టాడు. అందరూ మౌనంగా ఉండిపోయారు. నావ వేగంగా ముందుకు సాగింది. పెద్దనావ నుండి ఒకటి రెండు తుపాకులు పేలాయి. అవి నావను చేరలేదు. పెద్ద నావ నుండి చిన్న బోటులో వచ్చిన వారు నావ నందుకోడానికి ప్రయత్నించారు. ప్రతాప్ తుపాకులతో బోటుపై కాల్పులు జరిపాడు. కొందరు గాయపడ్డారు. మిగతావాళ్లు భయంతో బోటు తిప్పుకొని పారిపోయారు.

ప్రతాప్ సురక్షితంగా వెళ్లిపోవడం అడవిలో ఉన్న రామచరణ్ చూశాడు. పెద్ద నావ నుండి కొందరు అడవిలో వెదకడానికి రావడం చూసి వెళ్లిపోయాడు.

★ ★ ★

నావలో నిద్ర పోతున్న శైవలిని మేల్కొంది. ఆ నావలో రెండుగదులున్నాయి. ఒక గదిని పాస్టర్, రెండో దానిని శైవలిని, ఆమె దాసి ఉపయోగిస్తున్నారు. శైవలిని ఇప్పటికీ దొరసాని దుస్తులు వేసుకోలేదు. అదే నల్లంచు చీర, భుజాలకు బాజొబందులు, కాళ్ళకు కడియాలు. వెంట పురందరపురం దాసి పార్వతి ఉంది.

శైవలిని గాఢ నిద్రలో కలగంటోంది. పురందరపురంలోని భీమా సరస్సు. దాని చుట్టూ తీగలు, లతలతో అల్లుకుపోయిన చెట్లు వంగిపోయి నీటిని స్పృశిస్తున్నాయి. చీకట్లు వ్యాపించి ఉన్నాయి. శైవలిని ముఖం కమలమై నీటిలో మునిగి ఉంది. సరోవరంలో బంగారు హంస విహరిస్తోంది. తీరంపైన ఓ తెల్లపంది తిరుగుతోంది. రాజహంసను చూసి దాన్ని పట్టుకోవడానికి శైవలిని ఉత్సాహపడింది. కానీ హంస ఆమె వైపు చూడకుండా ముఖం చాటేసింది. పంది శైవలిని ముఖపద్మాన్ని పట్టుకోవడానికి అక్కడే తిరుగుతోంది.

## కొత్తగాలి...

**అమ్మభాషను**
**అటకెక్కిస్తే**
**ఆంగ్లభాష**
**కొండెక్కి కూచుంది!**

– ముడుంబ సీత,
భద్రాచలం, ఖమ్మం జిల్లా

రాజహంస ముఖం కనడబటం లేదు. కానీ పంది ముఖం పాస్టర్‌లా ఉంది.

శైవలిని హంసను పట్టుకోవాలన్న తపనలో ఉంది. కానీ కాళ్లు తామర తూళ్లలా భూమిలో పాతుకుపోయాయి. కదిలించడానికి వీలు కావడం లేదు.

"నావైపు రా! హంసను పట్టిస్తా" అంటోంది పంది.

మొదటి తుపాకి మోతతో శైవలినికి నిద్రా భంగమైంది. కాపలాదారు నీటిలో పడిన శబ్దం వింది. మధ్యలో నిద్రాభంగం కావడంతో శైవలిని జరిగిందాన్ని అర్థం చేసుకోలేకపోతోంది. అదే రాజహంస, అదే సూకరం జ్ఞాపకం రాసాగాయి.

మళ్లీ తుపాకి మోత, నావపై గడబిడ ..వినిపించింది. నిద్ర తేలిపోయింది. గది ద్వారం వద్ద నిలబడి చూసింది. ఏమీ అర్థం కాలేదు. గదిలో దీపం వెలుగుతోంది. పార్వతి కూడా లేచింది.

"పార్వతీ! బయటేం జరుగుతోంది? " శైవలిని అడిగింది.

"ఏం జరిగిందో..? వారి మాటల ద్వారా నావలో దోపిడీ జరుగుతోందని తెలుస్తోంది. పాస్టర్ సాహెబ్‌ను ఎవరో చంపేశారు. మన పాపాల ఫలితమై ఉంటుంది" జవాబిచ్చింది పార్వతి.

"పాస్టర్‌ను చంపారా? ఇందులో మన పాపమేముంది? అది సాహెబ్ పాప ఫలితమే అవుతుంది"

"నావలో దోపిడి జరుగుతోంది. ఆపద మనకీ ఉంది"

"ఆపద ఏముంది? ఓ దొంగతో ఉన్నాం. మళ్లీ మరో దొంగతో ఉంటాం. తెల్లదొంగ నుండి విడివడి నల్లదొంగ చెంతకు వెళ్తాం" అంటూ చిరునవ్వుతో వీపుపైన వేలాడుతున్న జడను ఊపుతూ వెళ్లి పడకపై కూర్చుంది శైవలిని.

"ఈ పరిస్థితుల్లో మీ నవ్వు నాకు నచ్చటం లేదు"

"నచ్చకపోతే గంగలో దూకు! నవ్వే సమయం వచ్చింది నాకు. నవ్వుతా! ఓ దొంగను పిలువు! ఓ ప్రశ్న అడగాలి!"

"పిలవాల్సిన అవసరం లేదు. వాళ్లే స్వయంగా వస్తారు కొంతసేపట్లో" అయిష్టంగా అంది పార్వతి.

గంటన్నర గడిచినా ఏ దొంగా రాలేదు. శైవలిని దుఃఖంతో అంది "మన అదృష్టం బాగాలేదు. దొంగలు కూడా పిలిచి అడగటం లేదు"

పార్వతి భయంతో వణికిపోతోంది.

చాలాసేపటి తర్వాత నావ తీరంలో ఆగింది. దండధారులు కొందరు ఓ పల్లకీ తెచ్చారు. వారితో రామచరణ్ ఉన్నాడు.

బోయీలు పల్లకి కింద దించారు. రామచరణ్ నావపైకి వెళ్లి ప్రతాప్‌ను కలిశాడు. ప్రతాప్ ఆదేశంపై గదిలో ప్రవేశించాడు. మొదట పార్వతి ముఖం చూసి పిదప శైవలినిని చూశాడు. "మీరు దిగండి" అన్నాడు శైవలినితో.

"నువ్వెవరు? నన్నెక్కడికి తీసుకుపోతారు? " శైవలిని ప్రశ్నించింది.

"అమ్మా! నేను మీ సేవకుడ్ని. ఆలోచించకండి! నాతో రండి! పాస్టర్ సాహెబ్ మరణించారు" సమాధానం చెప్పాడు రామచరణ్.

శైవలిని లేచి రామచరణ్‌ను అనుసరించి బయటకు వచ్చింది. రామచరణ్ నావ

దిగాడు. అతనితో బాటే శైవలిని దిగింది. పార్వతి వెంబడిస్తోంది. రామచరణ్ ఆమెతో "నువ్వు రావద్దు" అన్నాడు. పార్వతి భయంతో పైనే ఆగిపోయింది.

రామచరణ్ శైవలినితో "అమ్మా! పల్లకినెక్కండి" అన్నాడు.

శైవలిని పల్లకిలో కూర్చుంది. రామచరణ్ పల్లకితో ప్రతాప్ గృహం చేరాడు. దలినీ, కులుసూమ్‌లను బ్రహ్మచారి ఉంచింది ఆ గృహంలోనే! వాళ్లక్కడే ఉన్నారు. రామచరణ్ వారికి నిద్రాభంగం కాకుండా శైవలినిని మేడ పైనున్న గదికి చేర్చాడు. దీపం వెలిగించాడు.

"ఇది ఎవరిల్లు? " శైవలిని అడిగింది.

రామచరణ్ జవాబు చెప్పకుండా ఆమెకు నమస్కరించి.. గది తలుపులు దగ్గరగా వేసి వెళ్లిపోయాడు.

రామచరణ్ ఇక్కడ తన బుద్ధినుపయోగించి శైవలినిని ప్రతాప్ గృహానికి చేర్చాడు. దీనిపై ప్రతాప్ ఆదేశం లేదు. ప్రతాప్ పల్లకిని జగత్‌సేర్ ఇంటికి చేర్చమని చెప్పాడు.

మార్గంలోనే రామచరణ్ ఆలోచించాడు. 'ఇంతరాత్రి జగత్‌సేర్ ఇంటి ద్వారం తెరిచి ఉంటుందా? కావలివారు ప్రవేశం ఇవ్వరు. అడిగితే ఏం చెప్పాలి? పరిచయం చెప్తే తనను హంతకుడిగా బంధిస్తారు. ఈ తతంగం అనవసరం. ఈ సమయంలో తమ గృహం చేరడమే మేలు' అనుకుని పల్లకి ఇంటికి చేర్చాడు.

గంగా తీరంలో ప్రతాప్ పల్లకి వెళ్లడం చూశాడు. నావ దిగాడు. మొదలే అతని చేతుల్లో తుపాకులు చూసి నావపై వారు మౌనంగా ఉండిపోయారు. ఇప్పుడు అతని వెంట సాయుధులను చూసి ఎవరేం మాట్లాడలేదు. ప్రతాప్ నావ దిగి తమ నివాసం వైపు నడిచాడు.

★ ★ ★

తలుపులపై శబ్దం కావడంతో రామచరణ్ ద్వారం తెరిచాడు. అతను ప్రతాప్ ఆదేశానికి విరుద్ధంగా పనిచేశాడు.

అదే విషయం ప్రతాప్‌కు నివేదించాడు.

ప్రతాప్ అతన్ని కొట్టినంత పనిచేసి "వెంటనే ఆమెను జగత్‌సేర్ ఇంటికి చేర్చి సేర్‌ను పిలుచుకురా? " ఆదేశించాడు.

రామచరణ్ శైవలిని గదికి వచ్చాడు. చెబితే ఎవరూ నమ్మరు.. ఆమె ఉన్న పరిస్థితుల్లో అస్సలు నిద్రరాదు. కానీ శైవలిని గాఢనిద్రలో ఉంది.

రామచరణ్ శైవలినిని లేపలేదు. వెళ్లి ప్రతాప్‌తో "ఆమె నిద్రిస్తోంది. లేపమంటారా? " అడిగాడు.

ప్రతాప్ ఆశ్చర్యంగా మనసులో అనుకున్నాడు.. 'స్త్రీల నిద్ర పురుషుల కంటే పదహారు రెట్లు అధికమని చాణక్యుడు రాయడం మరచి ఉంటాడ'ని.

"రామచరణ్ అంత శ్రమ వద్దు. నువ్వెళ్లి పడుకో! నేనూ పడుకుంటా" అన్నాడు.

రామచరణ్ వెళ్లిపోయాడు. అప్పటికింకా తెల్లారలేదు. నగరంలో చీకటితో కూడిన నిశ్శబ్ద వాతావరణం ఉంది. ప్రతాప్ లేచి మేడపైనున్న తన గదికి నడిచాడు. తలుపులు తెరచి లోనికి చూశాడు. పడకపై శైవలిని నిద్రిస్తోంది. శైవలినిని అతని గదిలో ఉంచిన విషయం రామచరణ్ ప్రతాప్‌కు చెప్పలేదు.

దివ్వె వెలుగులో కన్పిస్తున్న ఆమె.. తెల్లని పడకపై అందమైన పూలకుప్పలా ఉంది. వర్షాకాలంలో గంగానది జలాల్లో కమలాలు నాట్యమాడుతున్నట్లున్న ఆ మనోహర దృశ్యాన్ని చూసి ప్రతాప్ దృష్టి మరల్చుకోలేకపోయాడు. ఆ ముగ్ధత్వం చూసో, ఇంద్రియాలకు వశీభూతుడవడం వల్లో దృష్టి తిప్పుకోలేకపోయాడన్నది నిజం కాదు. కేవలం అన్యమనస్కంగా ఉండటంతో చూపు తిప్పుకోలేకపోయాడు.

చాలాకాలం కిందటి విషయాలు అతని

మదిలో మెదిలాయి. ఆలోచనా తరంగాలు ఒకటి వెంట ఒకటి కదలసాగాయి.

నిజానికి శైవలిని అసలు నిద్ర పోలేదు. కళ్లు మూసుకుని తన దుర్గతి గురించి ఆలోచిస్తోంది. కళ్లు మూసి ఉండడంతో రామచరణ్ ఆమె నిద్రిస్తోందని భావించాడు. దీర్ఘమైన విచారంలో ఉన్నందున ప్రతాప్ పద ధ్వనిని గుర్తించలేదామె.

ప్రతాప్ చేతిలో తుపాకీతో పైకి వచ్చాడు. శబ్దమయ్యేలా దాన్ని గోడకానించాడు. తుపాకి నిలబెడుతూనే పక్కకి పడిపోయింది.

ఆ శబ్దానికి శైవలిని కళ్లు తెరిచి లేచి మంచంపై కూర్చుంది. భయంతో పెద్దగా అరుస్తూ "ఏం జరిగింది? ఇంతకీ ఎవరు నువ్వు?" అడుగుతూనే తెలివితప్పి పక్కకి వాలిపోయింది.

ప్రతాప్ గబుక్కున నీళ్లు తెచ్చి ఆమె ముఖంపై చిలకరించాడు. అప్పుడు ఆమె ముఖం శిశిర రుతువులో మంచుబిందువులు కురిసిన కమలంలా శోభించింది. నీరు చెల్లాచెదరైన ఆమె ముంగురుల్ని తడిపింది. అవి కమలాల్ని తగులుకున్న గడ్డిపరకల్లా సరికొత్త సౌందర్యాన్ని సంతరించుకున్నాయి.



శైవలినికి తెలివి వచ్చింది. నిట్టూర్పు విడిచి మౌనం వహించింది. ఆమె స్వస్థురాలు కావడంతో ప్రతాప్ మౌనంగా అక్కడి నుంచి కదిలాడు.

"వెళ్లవద్దు" శైవలిని హెచ్చరికగా అంది. అతడు అయిష్టంగా నిలబడిపోయాడు.

"నువ్విక్కడి కెందుకొచ్చావు? "

"ఇది నా నివాసం"

శైవలిని పూర్తిగా స్వస్థచిత్తురాలు కాలేదు. హృదయంలో మంటలు.. శరీరం కంపిస్తోంది. కొంత సమయం మౌనం వహించి ధైర్యం కూడగట్టుకుని "నన్నిక్కడి కెవరు తెచ్చారు? " అని అడిగింది.

"మేమే తెచ్చాం"

"మేమంటే..? ".

"నేను, నా నౌకరు"

"మీరు నన్నిక్కడికెందుకు తెచ్చారు? " ప్రతాప్ అప్రసన్నంగా "నీవంటి పాపాత్మురాలి ముఖం చూడటానికి కాదు. నిన్ను మ్లేచ్ఛుని చెర నుండి విడిపించాను. అయినా నన్నిక్కడి కెందుకు తెచ్చారని అడుగుతున్నావా? " అన్నాడు.



శైవలిని అతనికి మృదుస్వరంతో జవాబిచ్చింది. "నన్ను మ్లేచ్ఛుని ఇంట చూసి దౌర్భాగ్యురాలినని భావిస్తే అక్కడే కాల్చి పారేస్తే సరిపోయేది. నీ చేతిలో తుపాకీ కూడా ఉంది కదా? " అంది.

ప్రతాప్ చాలా క్రుద్ధుడై "ఆ పని కూడా చేసేవాణ్ని. స్త్రీ హత్యా భయంతో చేయలేకపోయాను. నువ్వు చావటమే మేలు"

శైవలిని దుఃఖిస్తూ "నేను చావటం సరైందని ఎవరైనా అనొచ్చు. కానీ నువ్వెప్పుడూ నాతో అనొద్దు. నాకీ దుర్దశ ఎవరివల్ల కలిగింది? నా జీవితాన్ని అంధకారమయం ఎవరు చేశారు? ఎవరి కారణంగా నేను సుఖాన్ని మరచి, మంచీ చెడు గుర్తించలేకపోయాను? ఎవరి కారణంగా నేను దుఃఖితురాలినయ్యాను? వీటన్నింటికి

## కొత్తగాలి...

**ఆశయాలు**
**ఆచరణలో పెట్టినపుడే**
**మానవుడు**
**మహనీయుడు!**

– బిక్కనూరి రాజేశ్వర్,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

కారణం నువ్వే! నేను మంచి గృహిణిగా ఎందుకుండలేకపోయా? అంతా నువ్వే చేసి నన్ను నిందిస్తున్నావా? " నిలదీసింది.

"నువ్వు పాపాత్మురాలివి! అందుకే నిన్ను నిందిస్తున్నాను. నా తప్పేమిటో భగవంతుడికి తెలుసు. నేనే విషయంలోనూ దోషిని కాను. ఇప్పుడూ నిన్ను సర్పంగా భావించి నీ దారి నుండి తప్పుకుంటా. నీ విషభయంతోనే వేదగ్రామం విడిచా. ఇది నీ మానసిక దోషం. నీ స్వభావ దోషం. అందుకే నింద నాపై వేస్తున్నావు. నేను నీకు చేసిన నష్టమేముంది? "

శైవలిని గర్జిస్తూ "నువ్వేం చేశావా? ఎందుకు నీ మంగళమూర్తి విగ్రహంతో నా ముందుకొచ్చావు? వికసించే నా యవ్వన కాలంలో ఆ మూర్తిని నా ముందెందుకు ప్రకాశింపజేశావు? ఒకసారి మరచిపోయా! మళ్లీ ఎందుకు వెలిగించావు? నేను నిన్ను చూశానా? చూసి నిన్నెందుకు పొందలేదు? పొందకపోతే చావలేదెందుకు? నీకు తెలియదా? నీ రూపాన్ని ఆరాధించే నా గృహం అరణ్యం అయింది. నీతో అనుబంధం తెగిపోయిన తర్వాత నేను నిన్ను పొందలేనని నీవనుకోలేదా? అందుకే నేను గృహత్యాగం చేశాను. పాస్టర్ నాకేమవుతాడు? " అంది.

ఆమె మాటలు అతనికి వజ్రపాతమైనాయి. తేలు కుట్టినవాడిలా స్తబ్ధుడయ్యాడు. గబగబా బయటకు వెళ్లిపోయాడు. అప్పుడే వీధిలో ద్వారం ముందు కోలాహలం వినిపించింది.

★ ★ ★

శైవలినిని రామచరణ్ పల్లకి ఎక్కించుకుని వెళ్లడం, ప్రతాప్ నావ దిగిపోవడం, నావపైన గాయపడి ఉన్న తిలంగా గమనించాడు. తర్వాత అతడు నావ దిగి చాటుగా పల్లకిని అనుసరించాడు.

అతను ముసల్మాన్! అతని పేరు బకావుల్లాఖాన్. క్లైవు వెంట మద్రాసు నుండి వచ్చిన సైన్యంలో అతడున్నాడు. ఆంగ్లేయులు దేశీ సైనికుల్ని 'తిలంగాలు' అనేవారు. తర్వాత చాలా మంది హిందూ, ముస్లింలు ఆంగ్లేయుల సైన్యంలో చేరిపోయారు. బకావుల్లా స్వస్థలం గాజీపురం.

బకావుల్లా పల్లకిని చాటుగా అనుసరిస్తూ ప్రతాప్ ఇంటివరకు వచ్చి, శైవలిని ఆ ఇంటిలోకి వెళ్లే వరకు చూశాడు. దాని ఆనుపానులు గుర్తుంచుకుని అతడు అమియట్ ఉన్న గిడ్డంగికి వెళ్లాడు.

గిడ్డంగి కోలాహలంగా ఉంది. చిన్న నావపై జరిగిన దాడి సంగతి అమియట్‌కు తెలిసింది. అతడు నావపై జరిగిన దాన్ని బేరీజువేస్తున్నాడు. దాడి చేసిన వారి గురించి తెలియజేస్తే వెయ్యి రూపాయలు బహుమతి ఇస్తానని ప్రకటించాడు.

బకావుల్లా అమియట్ ముందుకొచ్చి, సైనిక వందనం చేసి నావపై జరిగినదంతా చెప్పాడు. తనకు సహాయంగా అధికారుల్ని పంపిస్తే ఆ ఇంటిని, వారిని కూడా చూపిస్తానన్నాడు.

అమియట్ ముఖం వికసించింది.

నలుగురు సైనికులు ఒక అధికారిని ఆ పనికి వెంటనే ఏర్పాటు చేసి "మీరు బకావుల్లా వెంట వెళ్లి ఆ బద్మాష్‌లను బంధించి తెచ్చి నా ముందు పడెయ్యండి" అంటూ ఆదేశించాడు.

బకావుల్లా "సాహెబ్! ఇద్దరు ఆంగ్లేయ

సైనికుల్నివ్వండి. ప్రతాప్‌రాయ్ రాక్షసుడు. దేశీ సైనికులు బంధించలేరు" అన్నాడు.

గ్లాస్టన్, జాన్సన్ అనే ఆంగ్ల సైనికులు ఆయుధాలతో బకావుల్లా వెంట వెళ్లారు. అప్పుడు జాన్సన్ బకావుల్లాతో "నువ్వెప్పుడైనా ఆ ఇంట్లోకి వెళ్లావా? " అడిగాడు.

బకావుల్లా "లేదు.. వెళ్లలేదు" అంటూ సమాధానమిచ్చాడు.

గ్లాస్టన్- జాన్సన్‌తో "అగ్గిపెట్టె, కొవ్వొత్తులు కూడా తీసుకెళ్దాం. హిందువులు నూనె ఖర్చని దీపం వెలిగించరు" అన్నాడు.

జాన్సన్, అగ్గిపెట్టె, కొన్ని కొవ్వొత్తులు జేబులో వేసుకున్నాడు.

అందరూ సిద్ధమై వేగంగా నడిచారు. అందరూ మౌనంగా ఉన్నారు. నగర కాపలాదారు వారిని చూసి భయంతో పక్కకు తొలిగాడు.

గ్లాస్టన్, జాన్సన్ సైనికులతో బకావుల్లా చూపిన ఇంటి ముందు నిలిచి, తలుపులను దబదబా బాదారు.

రామచరణ్ లేచి తలుపులు తెరవడానికి వచ్చాడు. రామచరణ్‌లోని సమర్థతకు, అతడు చేసే పనికి అసలు పోలికే లేదు. ఇక్కడ అతడు సేవకుడు మాత్రమే. కానీ శరీరాన్ని మాలిష్ చెయ్యడంలో నిపుణుడు. వస్త్రాలను ఎంపిక చెయ్యడంలో, లేపనాలు తయారుచేయడంలోనూ మంచి పనితనం ఉంది. క్రయవిక్రయాలలోనూ నేర్పరే. లాఠీ తిప్పడంలో ముర్శీదాబాద్‌లో సుప్రసిద్ధుడు. హిందూ, ముస్లింలలో చాలామంది అతని చేతిలో పరాజితులే. తుపాకీ కాల్చడంలో కూడా మేటి అనడానికి నావపై అతడు జరిపిన కాల్పులే నిదర్శనం. వీటన్నిటి కంటే మరో గుణముంది. నక్కవంటి జిత్తులమారి. అంతకంటే మించిన స్వామిభక్తీ ఉంది.

తలుపులు తెరవడానికి వెళ్తూ అతడు ఆలోచించాడు. ఈ సమయంలో ఎవరు వచ్చారు? ఎవరు తలుపులు కొడుతున్నారు? బహుశా ఠాకూర్ మహాశయులై ఉంటారు. అయినా తామే ఘనకార్యం సాధించి వచ్చారు. బయటవారెవరో తెలియకుండా తలుపులు తెరవకూడదు అనుకొని, నిశ్శబ్దంగా తలుపులకు చెవులానించాడు. బయట ఇద్దరు వ్యక్తులు చెడిపోయిన భాషలో మాట్లాడుకుంటున్నారు మెల్లగా. రామచరణ్ ఆ భాషను 'ఇండిల్-మిండిల్' అంటాడు. ఇప్పుడు దాన్ని 'ఇంగ్లీషు' అంటున్నారు.

రామచరణ్ ఇప్పుడు తలుపులు తెరవాలంటే చేతిలో తుపాకి లేకుండా తెరవకూడదు. 'ఇండిల్-మిండిల్‌వాణ్ని విశ్వసించటం మూర్ఖత్వమవుతుంది' అనుకున్నాడు మనసులో. 'ఇద్దరి కంటే ఎక్కువమంది ఉన్నట్లున్నారు వాళ్లు. ఒక్కటి కాదు, మాలిక్ తుపాకి కూడా కావాలి. అప్పుడే తలుపులు తెరవాలి' అనుకొని ప్రతాప్‌ను పిలవడానికి వెనుతిరిగాడు.

జాన్సన్ "చూస్తారేంది! లాఠీలతో తలుపులు పగలగొట్టండి! హిందుస్థాన్ తలుపులు ఆంగ్లేయుల లాఠీల ముందు నిలుస్తాయా? " అన్నాడు.

గ్లాస్టన్ తలుపుపై లాఠీతో బలంగా మోదాడు. మిగతావాళ్లూ తమ లాఠీలకు పని చెప్పారు. దర్వాజా, ఖడ-ఖడ, భడ-భడ, ఘన-ఘన లాడింది. రామచరణ్ పరుగెత్తాడు. ఈ శబ్దాలకు ప్రతాప్ మెట్లు దిగుతూ వచ్చాడు.

అందరూ లాఠీలు ప్రయోగించడంతో దర్వాజా విరిగిపడింది.

"ఈ రీతిగానే ఆంగ్లేయుల పదఘాతాలతో భారతదేశంలోని అన్ని ద్వారాలు విరిగి పడతాయి" అంటూ ఆంగ్లేయ సైనికులు లోపలికి జొరబడ్డారు. వెంట సిపాయిలు వచ్చారు.

మెట్లపైన రామచరణ్, ప్రతాప్‌లు పరస్పరం ఎదురయ్యారు. రామచరణ్ ప్రతాప్‌తో "చీకట్లో దాక్కోండి! ఆంగ్లేయులు

వచ్చారు. బహుశా వాళ్లు 'ఆమ్‌బాత్' గిడ్డంగి నుండి వచ్చివుంటారు. రామచరణ్ 'అమియట్'ను 'ఆమ్‌బాత్' అన్నాడు.

"భయమెందుకు? "

"వాళ్లు చాలామంది ఉన్నారు"

"నేను దాక్కుంటా! కానీ ఈ ఇంట్లో ఇంకా స్త్రీలున్నారు. వాళ్ల గతేంటి? నువ్వు నా తుపాకీ తీసుకురా" అన్నాడు ప్రతాప్.

రామచరణ్ ఆంగ్లేయుల్ని పూర్తిగా తెలిసినవాడైతే ప్రతాప్‌ను దాక్కోమనడు. వాళ్లు సంభాషిస్తున్న సమయంలోనే ఇంటి నిండా వెలుగురేకలు వ్యాపించాయి. జాన్సన్ వెలుగుతున్న క్యాండిల్‌ను సిపాయి కందించాడు. ఆ వెలుగులో వాళ్లు మెట్లపైన ఇద్దరు వ్యక్తుల్ని చూశారు.

జాన్సన్ బకావుల్లాను "వీళ్లేనా? "అని అడిగాడు.

బకావుల్లా సరిగా గుర్తించలేకపోయాడు. చీకట్లో అతడు రామచరణ్, ప్రతాప్‌లను చూశాడు. సరిగా గుర్తించలేదు. చేయి విరగడంతో నొప్పిని అతడు భరించలేకపోతున్నాడు. ఎవరైతేనేం వాళ్లే నొప్పికి కారణం అనుకుని "ఔను! వాళ్లే!" అన్నాడు.

చిరుతల్లా దూకి ఆంగ్లేయ సైనికులు మెట్లపై నిలిచారు.

సిపాయిలు వెనక రావడం రామచరణ్ చూశాడు. ప్రతాప్ తుపాకీ తేవడానికి రామచరణ్ మెట్లెక్కసాగాడు.

అది చూసి జాన్సన్ తన చేతిలోని పిస్తోల్‌తో రామచరణ్‌పై కాల్పులు జరిపాడు. రామచరణ్ కాలికి గాయమైంది. నడవలేక అక్కడే కూలబడిపోయాడు.

ప్రతాప్ చేతిలో ఆయుధం లేదు. అతడికి పారిపోవాలని కూడా లేదు. పారిపోతే? రామచరణ్ పరిస్థితి ఏంటి? అందుకే శాంతంగా ఆంగ్లేయ సైనికులతో "మీరెవరు? ఎందుకొచ్చారు? " అడిగాడు.

గ్లాస్టన్ "నువ్వెవరు? " అడిగాడు.

"నేను ప్రతాప్‌రాయ్‌ను"

ఆ పేరు బకావుల్లాకు జ్ఞాపకముంది. నావపైన చేతిలో తుపాకులతో దర్పంగా 'వినండి నాపేరు ప్రతాప్‌రాయ్' అనడం గుర్తొచ్చింది.

బకావుల్లా వెంటనే "జనాబ్! ఇతనే నావపైన దాడి చేసిన సరదారు" అన్నాడు.

జాన్సన్ ప్రతాప్ చేయి పట్టుకున్నాడు.

ప్రతాప్ తిరగబడటం మంచిది కాదనుకుని మౌనంగా ఉన్నాడు. ప్రతాప్ చేతికి బేడీలు తగిలించాడు అధికారి.

గ్లాస్టన్ పడివున్న రామచరణ్‌ను చూపి "అతడి సంగతి? " అన్నాడు.

జాన్సన్ సిపాయిల్ని చూసి "అతన్ని కూడా తీసుకురండి" ఆజ్ఞాపించాడు.

ఇద్దరూ అతన్ని ఎత్తుకు వచ్చారు.

బయట జరుగుతున్న గడబిడకు దలినీ, కులుసూమ్‌లు లేచారు. తలుపులు కొద్దిగా తెరచి తొంగి చూడసాగారు. మెట్ల వద్దనే వారు నిద్రించిన గది ఉంది.

ఆంగ్లసైనికులు ప్రతాప్, రామచరణ్‌లను తీసుకుని మెట్లు దిగుతుంటే సిపాయిల చేతుల్లోని కాండిల్ వెలుగురేకలు తలుపు సందు నుండి చూస్తున్న దలినీ కళ్లపై బడి నీలమణుల్లా ప్రకాశించాయి..

బకావుల్లా ఆ కళ్లను చూసి "పాస్టర్ సాబ్ భార్య" అన్నాడు.

గ్లాస్టన్ "నిజమా! ఎక్కడ? " అన్నాడు.

బకావుల్లా ఆ ద్వారాన్ని చూపి "ఆ గదిలో.." అన్నాడు.

గ్లాస్టన్, జాన్సన్‌లు గదిలోనున్న దలినీ, కులుసూమ్‌లను చూసి "మీరు మాతో రండి" అన్నారు.

దలినీ, కులుసూమ్‌లు భయభీతులై మౌనంగా వారి వెంట నడిచారు. ఆ ఇంట శైవలిని ఒకర్తే ఉండిపోయింది. ఆమె కూడా జరిగిందంతా చూసింది.

★ ★ ★

దలినీ, కులుసూమ్‌లు కొద్దిగా తలుపులు తెరచి చూసినట్లే శైవలిని కూడా పూర్తిగా

**అ క్ష రం**

జీవితంలో మార్పు అనేది సహజ పరిణామం.
కేవలం గతాన్నే లేదా భవిష్యత్తునే తల్చుకునేవాళ్ళు
వర్తమానాన్ని కోల్పోవడం తథ్యం.

– జాన్ ఎఫ్. కెనెడీ



చూసింది. కానీ వారికంట పడలేదు. అందరూ వెళ్లిపోయిన తర్వాత ఇంటిలో తనొక్కర్తినేనని పడకపై కూర్చొని చింతించసాగిందామె.

ఇప్పుడేం చెయ్యాలి? తానొంటరి. అయినా తనకు భయమెందుకు? ప్రపంచంలో తనకేం భయంలేదు. మరణం కంటే మించిన భయం ఏం లేదంటారు. ప్రతి రోజు చావును కోరే తనకేం భయం? తనకు మరణమెందుకు రాలేదు? ఆత్మహత్య సులభం కదా! సులభమెక్కడ? ఇన్ని రోజులు నీళ్లలో ఉన్నా మునిగి చావలేకపోయింది. రాత్రివేళ అందరు నిద్రించిన పిదప బయటపడి నీట దూకితే ఎవరడ్డగించేవారు? తప్పకుండా ఆపేవారు. నావ పైన ఎల్లప్పుడు పహారా ఉంటుంది కదా? అయినా తను ప్రయత్నమెప్పుడు చేసింది కనుక! అంటే తనకు జీవితాశ ఉందన్నమాటే కదా!

ఆశ ఉన్న మనుషులు మరణించలేరు. నిజంగా ఈ రోజు మరణించేదే! కానీ వాళ్లు ప్రతాప్‌ను బంధించి తీసుకుపోయారు గదా! అతనికేమవుతుంది? అది తెలుసుకోకుండా చావలేదు. అయినా తనకెందుకు? ప్రతాప్ తనకేమవుతాడని? తను అతని దృష్టిలో పాపిష్ఠిది. శైవలిని వంటి శలభానికి అతడు అగ్నిగోళం. తన శిథిల జీవితానికి గ్రీష్మరుతువులోని పిడుగులాంటివాడు. తనపాలిట మృత్యువు. తనెందుకు గృహత్యాగం చేసింది? ఆంగ్లేయుడి వెంట ఎందుకు వెళ్లింది? సుందరి వెంట ఎందుకు పోలేదు?

తల బాదుకుంటూ శైవలిని దుఃఖించసాగింది. వేద గ్రామంలోని తన ఇల్లు జ్ఞాపకానికొచ్చింది. గోడ దగ్గర శైవలిని తన చేతుల్తో 'కనేర్' (సూదుల్లాంటి చివరలుగల ఆకులుండి ఎత్తుగా పెరిగే వృక్షం) మొక్కను నాటింది.

ఆ కనేర్ వృక్షపు ఎత్తయిన ఓ కొమ్మ గోడపై నుండి ఎర్రని పూలతో నీలాకాశాన్ని అందుకునేలా కదులుతుండేది. అప్పుడప్పుడు తుమ్మెదలు, చిన్నచిన్న పక్షులు వాలుతుండేవి. తులసి కోట, దాని చుట్టూ చదును చేసిన నేల, ఇంట్లోని పెంపుడు పిల్లి, పంజరంలోని రామచిలుక, ఇంటి దగ్గరి తియ్యమామిడి చెట్టు.. ఇలా ఎన్నో ఆమె స్మృతిలో మెదలసాగాయి. మబ్బులు లేని ఆకాశాన్ని మిద్దె మీద కూర్చుని చూస్తుండేది. సువాసన పుష్పాల్ని సేకరించి నీట కడిగి చంద్రశేఖర్ పూజకు సిద్ధం చేసేది. సువాసనా భరిత శీతల మందవాయువుల్ని వేపచెట్టు కింద శ్వాసించేది. నీటిలో కదిలే చిరుతరగలు, చేపపిల్లల్ని చూస్తుండేది. సరస్సు తీరంపైన కోయిల రాగాల్ని వినేది.

నిట్టూర్పు విడిచి- తిరిగి ఆలోచనల్లో మునిగిందామె. ఇంటి బయటకు వెళితే ప్రతాప్ కనబడతాడనుకునేది. పురందర పురం గిడ్డంగికి వెళతాను! ప్రతాప్ ఇల్లు పురందరపురానికి దగ్గరలో ఉంది. గిడ్డంగి కిటికీ నుండి చూపుల్ని బాణాలుగా చేసి ప్రతాప రూపి పక్షిని బంధిస్తాను. సమయం చూసి ఫిరంగిని మోసం చేసి పారిపోయి ప్రతాప్ చరణాలపై పడవచ్చని

తాను పాస్టర్ వెనక వెళ్లింది.

నేను పంజరంలోని పక్షిని.. నాకు ప్రపంచరీతి తెలియదు. మనిషి నిర్మాణం చేస్తే బ్రహ్మ కూలగొడతాడు. ఆంగ్లేయుల పంజరం ఇనప పంజరం అని తెలుసుకోలేకపోయాను. నా కోరిక నష్టమైపోతుందా? నేను అనవసరంగా కళంకం నెత్తిన వేసుకున్నాను. జాతి భ్రష్టురాలయ్యాను. పరలోకానికి దూరమయ్యాను.

పాపిష్ఠి శైవలిని మదిలోకి ఈ ఆలోచన రాలేదు. పాపానికి ఉన్న సార్ధకత, వ్యర్థతా ఏముంది? వ్యర్థతే సరైంది కదా! ఆమె ఏ రోజైనా అర్థం చేసుకుంటుంది. ఒకరోజు ప్రాయశ్చిత్తం కోసం తన ఎముకలు కూడా ఇవ్వడానికి సిద్ధమవుతుంది. అలాంటి ఆశ లేకపోతే, ఈ 'పాపం' అనే చిత్రాన్ని ఎందుకు రచిస్తాం?

శైవలిని యింకా ఆలోచిస్తోంది.. పరలోకమా? ఏ రోజు ప్రతాప్‌ను చూశానో ఆ రోజే దూరమైపోయింది. కానీ అంతర్యామి ఆ రోజే నా భాగ్యంలో నరకాన్ని రాశాడు. ఈ జన్మ కూడ నాకు నరకమే. నా మనస్సే నరకం. లేకుంటే ఇంతటి దుఃఖాన్ని ఎందుకు పొందుతాను. రెండు కళ్ళకు విషప్రాయమైన ఆంగ్లేయుని వెంట యిన్ని రోజులు ఎందుకు తిరిగాను. నాకు ప్రియమైంది ప్రతిదీ మండిపోతోంది. నా కారణంగానే ప్రతాప్ ఆపదలో చిక్కుకున్నాడు. నేనెందుకు చావడంలేదు.

శైవలిని మళ్ళీ దుఃఖించింది. కొంత సమయం తర్వాత కళ్ళు తుడుచుకుంది. కిటికీ మూసివేసింది. పెదవులు కొరుక్కుంది. క్షణంలో వికసించిన కమలం లాంటి ముఖం క్రోధ భరితమైంది. సర్పంలా ప్రకాశించసాగింది. తనెందుకు చావడంలేదు? అనుకుంది.

క్షణంలో తన దుస్తుల్లోంచి ఒక కత్తి తీసింది. అది పదునుగా వుంది. దాన్ని చేతిలోకి తీసుకొంది. దాంతో ఆట ప్రారంభించింది.

మళ్ళీ తనలో అనుకుంది 'ఈ కత్తి ఎందుకు తీశాను? ఈ కత్తి నా పాపిష్ఠి హృదయంలో ఎందుకు దిగడంలేదు? నా దగ్గర ఎందుకుంది?' కత్తి మొనను ఛాతి కానించి ఆలోచనలో పడింది. 'ఒకరోజు ఈ కత్తిని నిద్రించే పాస్టర్ ఛాతిపై వుంచాను. ఆ రోజు అతన్ని చంపలేదు. ధైర్యం చాల్లేదు. ఈ రోజు ఆత్మహత్య చేసుకోవటానికి ధైర్యం కలగడంలేదు. ఈ కత్తి భయంతోనే పాపాత్ముడైన ఆ ఆంగ్లేయుడి వశమయింది. తను ఆమె గదిలో ప్రవేశిస్తే.. కత్తితో నన్ను పొడుస్తుంది.. లేదా తనను పొడుచుకుంటుందని భీతిల్లాడు. ఈ కత్తి భయంతోనే నా పాపిష్ఠి హృదయం వశం కాలేదు. ఇప్పుడు చావలేను. వేదగ్రామం వెళ్ళి మరణిస్తాను. నావంటి నా జాతిది మంచిది కాదని సుందరితో చెబుతాను. నాకు కులంలేదు. పాపం నుండి విముక్తి పొంది మరణిస్తాను. మాట మనసులో ఆగిపోదు. మనసులోకి వస్తే వేలతేళ్ళు కాటు వేసినట్లుంటుంది. నరనరాన మంటలెత్తుతాయి. నేను నా భర్తకు యోగ్యురాలిని కాదు. ఆయనెంత దుఃఖమనుభవించాడో? నేను ఆయనకేమీ కాను. గ్రంథాలే ఆయన సర్వస్వం. ఆయన నా కోసం ఆలోచించరు.

ఎవరైనా వచ్చి ఆయన సమాచారం అందిస్తే ఎంత బాగుండు? ఆయన ఏం చేస్తున్నారో? నేను ఆయన్ని ఎన్నడూ ప్రేమించలేదు. ప్రేమించలేను కూడా. ఒక వేళ నావల్ల ఆయనకు దుఃఖం కలిగితే నా పాపం మరింత పెరిగిపోతుంది. ఆయనకు ఓ మాట చెప్పాలి! కానీ పాస్టర్ మరణించాడు. ఆ మాటకు సాక్ష్యమెవరున్నారు? నా మాట ఎవరు నమ్ముతారు?' ఇలా ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకుంది. నిద్రలో కూడ అవే ఆలోచనలు సాగుతున్నాయి. పీడ కలలు వస్తున్నాయి. దుఃఖి

స్తూనే వుంది.

ఆమె మేల్కొనే సరికి చాలాపొద్దెక్కింది. తెరిచివున్న కిటికీ నుండి ఎండ కనిపిస్తోంది. శైవలిని పూర్తిగా కళ్ళు తెరిచింది. ఎదురుగా.. ఆమెలో భయం.. ఆశ్చర్యం ముప్పిరిగొన్నాయి. నిశ్చేష్టురాలైంది. ఎదురుగా.. చంద్రశేఖర్!




**ముం**గేరిలో ఒక మఠం ఉంది. ఆ మఠంలో పరమహంస ఒకరు చాలా రోజులుగా వుంటున్నాడు. ఆయన పేరు రామానందుడు. మనకు పరిచయమైన బ్రహ్మచారి ఆయనతో సంభాషిస్తున్నారు.

రామానందుడు సిద్ధపురుషుడు, చాలా గొప్ప జ్ఞాని. భరతవర్షం నుండి అదృశ్యమైపోయిన తత్త్వజ్ఞానమంతా ఆయనకు తెలుసునని ప్రచారం వుంది.

ఆయన "వత్సా చంద్రశేఖర్! పలు విద్యలు అభ్యసించావు. వాటన్నింటిని సంయమనంతో వుపయోగించు. దుఃఖానికెప్పుడు హృదయంలో స్థానమివ్వకూడదు. ఎందుకంటే దుఃఖం అనే ప్రత్యేక పదార్థం లేదు. 'సుఖం.. దుఃఖం' రెండూ సమానమే. ముఖ్యంగా జ్ఞాని వద్ద అవి రెండూ సమానమైపోతాయి. తెలుసుకున్న వాళ్ళు పుణ్యాత్ములు. తెలుసుకోలేనివారు దుఃఖితులవుతారు" అని చెబుతూ యయాతి, హరిశ్చంద్రుడు, దశరథుడు తదితర ప్రాచీనుల చరిత్రలను వుటంకించాడు. శ్రీరాముడు, యుధిష్ఠిరుడు, నలుడు మొదలైన రాజుల్ని ఉదహరించాడు. రాజులు, చక్రవర్తులు పుణ్యాత్ములైనా ఎల్లకాలం దుఃఖితులుగానో, సుఖవంతులుగానో వున్నారు.

వశిష్ఠుడు, విశ్వామిత్రుడు వంటి రుషుల గురించి చెబుతూ వీళ్ళు కూడా దుఃఖాన్ని అనుభవించారు. రాక్షసుల బాధలు పడ్డ దేవతలు కూడ దుఃఖితులేనని చెప్పాడు.

సర్వజ్ఞులు దుఃఖభరితమైన విశాల సంసారంలో అనంతకాలాల్లో హృదయంలో దుఃఖితులే. దయామయులు కూడ అపార దుఃఖాన్ని అనుభవిస్తుంటారు. కాకపోతే వాళ్ళు దయామయులు కాలేరు. దుఃఖంతో ఎల్లప్పుడూ దయకు సంబంధముంటుంది. దుఃఖం లేకుంటే దయ ఎలా పుడుతుంది? దయామయుడైన ప్రభువు అంతంలేని ఈ సంసారంలోని అనంతమైన దుఃఖాన్ని చిరకాలం అనుభవిస్తాడు. అలా కానట్లయితే అతడు దయామయుడు కాలేడు.

అతడు నిర్వికారుడు, అతనికేం దుఃఖమంటావేమో? దానికి సమాధానం- ఎవరైతే నిర్వికారులో వారు, ఈశ్వరుని సృష్టి స్థితి, లయలకు సంబంధించి అజ్ఞానులు. వారు సృష్టికర్తను బ్రహ్మగా గుర్తించరు. వారు నిత్యానంద స్వరూపులు కనుక దుఃఖం వస్తువు కాదు అనేది యథార్థం.

ఇంకా దుఃఖముందని అంగీకరిస్తే దుఃఖాన్ని దూరం చేసే ఉపాయం వుండదా? ఉపాయం లేదు. అయినా దుఃఖాన్ని దూరం చేసే ప్రయత్నం చేయలేమా? ప్రయత్నిస్తే తప్పకుండా దుఃఖం దూరమవుతుంది.

బ్రహ్మ స్వయంగా ప్రతిరోజు దుఃఖాన్ని దూరం చేయడానికే నియుక్తుడయ్యాడు. ప్రపంచంలో దుఃఖం దూరమైతే, సంసార దుఃఖం దూరమవుతుంది. దేవతలంతా జీవుల దుఃఖాన్ని దూరం చేయడానికి నియమితులైనవారే! అందువల్లే ఈశ్వ

## కొత్తగాలి...

**బలపాలు విరిగినా**
**పలకలు అరిగినా**
**తొలి నే నేర్చినది**
**మాతృభాషే!**

– వి.యం. కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్., హైదరాబాద్

రీయ సుఖమున్నది. లేకుంటే యింద్రియాల వికార స్వరూపులైన దేవతలకు సుఖముండదు.

రుషుల లోకోపకారాన్ని భజించే భీష్మాది మహాపురుషులు దేవతల పరోపకారాన్ని వర్ణించారు. వారు చెప్పిందే పరోపకారం. చేసినవారు సుఖవంతులు. మిగతా వారు సుఖవంతులు కారు అని.

ఆ తర్వాత రామానందుడు పరోపకారాన్ని గురించి సవివరంగా వర్ణించారు. ధర్మ, శాస్త్ర, పురాణ, చరిత్రల్లోని ఉదాహరణలు చెబుతూ ఎన్నో ప్రమాణాలు వివరించారు. శబ్దశాస్త్రాన్ని మథించి నానార్థాలు తెలిపే, వినటానికి ఇంపైన పదాలు కూర్చిన వాక్యాలతో పలురకాల పుష్పాల్ని కూర్చి పూలమాల అల్లినట్లు వివరించారు.

ఒకసారి స్వామి కంఠం, గంభీరంగా మేఘగర్జనలా వుంటే మరోసారి వీణాస్వరంలా మధురంగా ధ్వనించింది. చంద్రశేఖర్ సాష్టాంగ నమస్కారం చేసి పాద ధూళి స్వీకరించాడు.

రామానందుడు చంద్రశేఖర్‌ను లేపి ఆలింగనం చేసుకున్నారు.

★ ★ ★

చంద్రశేఖర్ పంపించిన ఉత్తరం ముంగేరిలో నవాబుకు చేరింది. దలినీ ప్రతాప్ రాయ్ యింటి వద్ద వుందని తెలిసి వారి కోసం నవాబు పల్లకీ పంపించారు.

కానీ అప్పటికే ఆలస్యమైంది. ఆ ఇంట్లో శైవలిని తప్ప మరెవరూ లేరు. ఆమెను చూసి సైనికులు బేగం అనుకున్నారు. అలా శైవలిని కోటకు వెళ్ళాల్సి వచ్చింది. హఠాత్తుగా ఆమె మనస్సులో ఓ షడ్యంత్రం రూపుదిద్దుకుంది.

కవులు 'ఆశ'ను వర్ణించటంలో ముగ్ధులవుతారు. ఆశ ప్రపంచంలో ఎన్నో సుఖాలకు కారణం. అలాగే ఎన్నో దుఃఖాలకు కూడా మూలం. ఎన్నో పాపాలు జరిగిపోతుంటాయి. ఎవరూ కూడ ఆశతో మంచి పనులు చేయరు. స్వర్గం దొరుకుతుందనే ఆశతోనే వాటిని చేస్తుంటారు. కాబట్టి తను వారి కృత్యాలన్నింటిని సత్కర్మలుగా భావించదు. ఆశతో ముగ్ధురాలైన శైవలిని నిరాటంకంగా పల్లకి నధిరోహించింది.

సైనికులు ఆమెను అంతఃపురంలోని నవాబు ముందు నిలిపారు. ఆమెను చూసి 'ఈమె దలినీ బేగం కాదు. ప్రపంచాన్ని మోహింపజేసే ఇంత అందంగల స్త్రీ తన రాణివాసంలో ఎవరూ లేరు' అనుకుని- శైవలినిని "నువ్వెవరు? " అడిగారు.

"బ్రాహ్మణపుత్రిని" అంది శైవలిని.

"నువ్వెందుకొచ్చావు? "

"మీ సైనికులు తెచ్చారు"

"వారు నిన్ను మా బేగం అనుకుని తీసుకొచ్చారు. బేగం ఎందుకు రాలేదు? "

"ఆమె అక్కడ లేదు"

"మరి ఆమె ఎక్కడ ఉంది? "

గ్లాస్టన్, జాన్సన్‌లు వచ్చి దలినీబేగం, కులుసూమ్‌లను తీసుకుపోవడం చూసింది తను. వారెవరో తెలియదు. దాసీయో? నాట్యకత్తో? అనుకుంది. వచ్చిన సిపాయిలు శైవలినితో నవాబుగారి బేగం ఇక్కడ వుంది.. తీసుకురమ్మన్నారని అన్నారు. ఆంగ్లేయులు తీసుకుపోయింది నవాబు గారి పత్ని అని అర్థమైంది. జరిగిందాన్ని గురించి ఆలోచిస్తోంది శైవలిని.

శైవలిని మాటాడకపోయేసరికి "నువ్వా

మెను చూశావా? " అడిగారు నవాబు.
"చూశాను" అంది శైవలిని.
"ఎక్కడ చూశావు? "
"మేం రాత్రి వున్న ఆ గృహంలో"
"ఎక్కడ? ప్రతాప్‌రాయ్ గృహమేనా? "
"అవును! అక్కడే..!"
"బేగం ఎక్కడికి వెళ్లిందో తెలుసా? "
"ఇద్దరు ఆంగ్లేయులు వాళ్లందరినీ పట్టుకుపోయారు"
"ఏమన్నావు? " నవాబు కోపం.
శైవలిని అదే జవాబు మళ్ళీ చెప్పింది.
నవాబు మౌనం వహించాడు. పెదవి కొరకి, గడ్డం సవరించుకున్నాడు. సైనికుడ్ని పిలిచి గురుగన్‌ఖానును తీసుకురమ్మని ఆదేశించారు.
"ఆంగ్లేయులు బేగంనెందుకు తీసుకుపోయారో తెలుసా? " శైవలినిని తిరిగి ప్రశ్నించారు నవాబు .
"లేదు. తెలియదు"
"ప్రతాప్‌రాయ్ అప్పుడెక్కడ వున్నాడు? "
"ఆయన్నీ బంధించి తీసుకుపోయారు"
"వాళ్ళందరిని ఎందుకు తీసుకుపోయారో తెలుసా? "
శైవలిని అప్పటివరకు అంతా నిజమే చెప్పింది. ఇక అబద్ధాలు ప్రారంభించింది.
"లేదు" అంది.
"ప్రతాప్ ఎవరు? అతనిల్లెక్కడ? "
ప్రతాప్ గురించి నిజాన్ని చెప్పింది.
"ఇక్కడ ఏంచేయడానికి వచ్చాడు? "
"సర్కారీ నౌకరి చేయడానికి"
"నీకతడేమవుతాడు? "
"నా స్వామి"
"నీ పేరేమిటి? "
"రూపసి"
శైవలిని సునాయాసంగా సమాధానాలు చెప్పింది. పాపిష్ఠిది ఇవన్నీ చెప్పడానికే ఇక్కడకు వచ్చినట్లుంది.
"సరే ఇక ఇంటికి ఫో" అన్నారు నవాబు.
"నాయిల్లు ఎక్కడుంది? ఎక్కడకు వెళ్ళను? "
నవాబు ఆశ్చర్యపోయారు. తర్వాత ఆయనే "మరెక్కడికి వెళ్తావు? " అడిగారు.
"నాభర్త దగ్గరికి. నా భర్త దగ్గరికి పంపించండి. మీరు దేశానికి నవాబులు. మీకు ఫిర్యాదు చేస్తున్నాను. నా స్వామిని ఇంగ్లీషువారు తీసుకుపోయారు. సాధ్యమైతే నా భర్తను విడిపించండి. లేకపోతే నన్నూ అక్కడికే చేర్చండి. నా ప్రార్థన మన్నించకపోతే, ఇప్పుడే మీ ముందు ప్రాణత్యాగం చేస్తాను. అందుకే మీవద్దకు వచ్చాను" అంటూ శైవలిని చేతులు జోడించి ప్రార్థించింది.
గురుగన్‌ఖాన్ వచ్చినట్లు సమాచారం వచ్చింది. నవాబు శైవలినితో "అమ్మా! నువ్విక్కడేవుండు! నేను మళ్లీ వస్తాను" అంటూ బయటకు వెళ్ళిపోయారు.

★ ★ ★

నవాబు గురుగన్‌ఖాన్ నుండి విషయం విని "మనం ఆంగ్లేయులతో పోరాటం చెయ్యడమే మేలు. దానికి ముందే ఆంగ్లేయాధికారి అమియట్‌ను బంధించడం మన కర్తవ్యం. అమియట్ మనకు పెద్దశత్రువు. ఏమంటావు? " అన్నారు.
"యుద్ధానికి నేనెప్పుడూ సిద్ధమే. కానీ రాజదూతను బంధించడం మంచిది కాదు. రాజదూతను శిక్షిస్తే మనల్ని విశ్వాసఘాతకులంటారు. మనపై ఫిర్యాదు కూడా చేస్తారు" అన్నాడు గురుగన్‌ఖాన్.
"అమియట్ నిన్న రాత్రి ఈ నగరంలో ఓ యింటిపై దాడిచేసి అందరినీ బంధించి తీసుకువెళ్ళాడు. మన అధికారం కింద వుండి నేరం చేస్తే, అతను రాజదూత అయినంత మాత్రాన శిక్షించకూడదా? " ప్రశ్నించారు నవాబ్.
"అతానావిధంగా చేస్తే శిక్షించాల్సిందే! అతన్ని ఏవిధంగా బందీని చేద్దాం? "
"తక్షణం అతని ఆవాసానికి సిపాయిల్ని

పంపించు! బంధించి తెమ్మని ఆదేశించు" గురుగన్‌ఖాన్‌ను ఆజ్ఞాపించారు నవాబు.

"వాళ్ళంతా ప్రస్తుతం నగరంలో లేరు. మధ్యాహ్నమే వెళ్ళిపోయారు"

"ఎందుకు వెళ్ళిపోయారు? మనకు తెలియజేయకుండానే"

"మనకు చెప్పటానికి 'హే' అనే వ్యక్తిని వుంచారు"

"మనకు చెప్పకుండా, అనుమతి లేకుండా పోవటానికి కారణం? ఇది మనల్ని అవమానించడమే. కావాలనే వాళ్లిలా ప్రవర్తించారనిపిస్తోంది"

"వాళ్ల ఆయుధాల నావపై వుండే ఆంగ్లేయుడ్ని రాత్రి ఎవరో కాల్చిచంపారు. అప్రమత్తులై వెళ్ళిపోయారు. ఇక్కడ వుంటే తమ ప్రాణాలకు రక్షణ లేదన్నారు"

"చంపిందెవరో నీకు తెలుసా? "

'ప్రతాప్‌రాయ్ అనే వ్యక్తి"

"బాగా చేశాడు. అతనొస్తే సన్మానిస్తా! ప్రతాప్‌రాయ్ ఎక్కడున్నాడు? "

"వాళ్ళందరినీ బంధించి అమియట్ తన వెంట తీసుకుపోయాడు. వెంట తీసుకువెళ్ళాడో? అజామాబాద్ పంపించాడో? పూర్తి సమాచారం తెలియదు"

"ఇంత సమాచారం తెలిసినా మాకెందుకు ఇంతవరకు తెలుపలేదు? "

"నాకూ యిప్పుడిప్పుడే తెలిసింది"

గురుగన్‌ఖాన్ చెప్పిన అసత్యమిది.

అతడికి ఆది నుండి అంతం వరకు అంతా తెలుసు. అతని సలహాలేకుండా అమియట్ ముంగేరి వదిలేవాడు కాదు. గురుగన్‌ఖాన్‌కు రెండు ఆలోచనలు వున్నాయి. మొదటిది దలినీబేగం ముంగేరి విడిచి వెళ్ళడం మంచిది. రెండోది అమియట్ కొంతవరకైనా అతని చేతిలో వుండటం అవసరం. భవిష్యత్తులో అతని వల్ల లాభం కలగవచ్చు.

నవాబు గురుగన్‌ఖాన్‌ను వెళ్ళమని చెప్పారు. అతడు వెళ్తుంటే తల పంకిస్తూ చూశారు. దానర్థం 'యుద్ధం పూర్తయ్యేవరకు నిన్నేమనను. యుద్ధంలో నువ్వే నా ఆయుధం. తర్వాత నిన్ను చంపి దలినీ బేగం రుణం తీర్చుకుంటాను' అని.

నవాబు ముంగీని పిలిపించారు. ముర్షీదాబాద్‌లో ఉన్న మహ్మద్ తకీ పేరున అమియట్ నావ ముర్షీదాబాద్ చేరగానే అతన్ని బంధించమని, అమియట్ బందీ చేసిన ఖైదీలను వెంటనే తన ముందు హాజరుపరచమని సమాచారం పంపమన్నారు. "జాగ్రత్తగా వ్యవహరిస్తూ ముఖాముఖీ పోరాటం లేకుండా, తెలివితేటలతో ఉపాయంతో కార్యం సాధించమను. ఈ ఫర్మానా తీరం వెంట వేగంగా పంపాలి. వారి నావ కంటే ముందుచేరాలి" అంటూ ఆదేశించారు.

నవాబు రాణివాసంలోనికి తిరిగివెళ్ళి శైవలినిని పిలిపించారు. ఆమెతో "ప్రస్తుతం నేను నీ భర్తను విడిపించలేకపోయాను. ఆంగ్లేయులు వాళ్ళందరినీ తీసుకుని కలకత్తా వెళ్ళారు. నేను ముర్షీదాబాదు ఆదేశం పంపించాను. అక్కడే వాళ్ళను విడిపిస్తారు. నువ్విప్పుడు.."

మధ్యలోనే శైవలిని చేతులు జోడించి "ఎక్కువగా మాట్లాడుతున్న ఈ స్త్రీని క్షమించండి. ఇప్పుడే మనిషిని పంపిస్తే విడిపించడం సాధ్యం కాదా? " నవాబుకు మనవి చేసింది.

"ఫౌజును పంపాలి. పెద్దనావ కావాలి. మనం పట్టుకునే ప్రయత్నంలోనే వాళ్ళు ముర్షీదాబాదు చేరుతారు. యుద్ధప్రయత్నం జరిగితే ఖైదీలను చంపేస్తారు. ముర్షీదాబాదులో నిపుణులైన వ్యక్తులున్నారు. వారు తెలివితో యుక్తిగా పట్టుకుంటారు" నవాబు వివరించారు.

శైవలిని అనుకుంది, తన అందమైన ముఖమే ఈ పని సాధించింది. నవాబు ఆమె సుందర వదనాన్ని చూసి, ఆమె చెప్పిన విషయాలన్నీ సత్యమని నమ్మాడు.

ఆమెపై చాల దయ చూపాడు. లేకుంటే ఆమెకు అంతగా అర్థం చేయించాల్సిన అవసరం ఏముంది నవాబుకు?

శైవలిని ధైర్యం తెచ్చుకుని చేతులు జోడించి వినయంగా "ప్రభువులు ఈ అనాథ స్త్రీపై ఇంత దయచూపారు. మరోమనవి చేసుకుంటాను. క్షమించండి. ఆయన చేతిలో ఆయుధం వుంటే అతన్ని ఇంగ్లీషు వారు ఏమీ చేయలేరు. ఆయన చేతికి ఎవరైనా ఆయుధం అందిస్తే, ఆయనను బంధించి వుంచలేరు. తనే స్వయంగా విడిపించుకోగలరు. తన తోటివారిని కూడా విడిపిస్తారు"

నవాబు నవ్వి "నువ్వు చిన్నపిల్లవు. ఆంగ్లేయుల సంగతి నీకు తెలియదు. ఈ పరిస్థితుల్లో ఎవరు నావ పైకి వెళ్ళి ఆయుధాన్నందించగలరు? " అన్నారు.

శైవలిని "అనుజ్ఞ దయచేస్తే, నావను, ఆయుధాల్నిస్తే నేనే వెళ్ళి అందిస్తాను" వినయంగా అంది.

నవాబు అట్టహాసంగా నవ్వారు.

ఆ నవ్వు విని శైవలిని భ్రుకుటి ముడివేసింది. ఆమె "సర్కార్! సాధించలేక పోతే మరణిస్తాను. దానివలన ఎవరికీ నష్టంలేదు? ఒకవేళ సాధిస్తే నా పని, మీ పనీ పూర్తవుతుంది" అంది.

శైవలిని భ్రుకుటి ముడిపడడం చూసి నవాబు- 'ఈమె సాధారణమైన స్త్రీ కాదు. మరణిస్తుందా? మరణించనీ, నాకేం నష్టం? ఒకవేళ కార్యం సాధిస్తుందా? మంచిదే కదా! ఎలాగు ముర్షీదాబాద్‌లో మహ్మద్‌తకీ పనిపూర్తిచేస్తాడు' అనుకున్నాడు. శైవలిని వంక తేరిపారజూస్తూ "నీవు ఒంటరిగా వెళ్తావా? " అడిగారు.

"స్త్రీని.. ఒంటరిగా వెళ్ళలేను. దయచేసి ఒక దాసిని, ఒక రక్షకుడ్ని సహాయంగా యిస్తూ ఒక నావతో బాటు కొన్ని ఆయుధాలు ఇప్పించండి.. చాలు" అందామె.

నవాబు కొంచెం ఆలోచించి ముసీబుద్దీన్ అనే బలిష్ఠుడు, విశ్వసనీయుడైన

# కొత్తగాలి...

**మొక్కే కదాని**
**నిర్లక్ష్యంచేస్తే**
**పర్యావరణం కల్ల**
**ప్రజల ప్రాణాలు గుల్ల!**

- బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

వ్యక్తిని పిలిపించారు. అతడు వచ్చి నవాబుకు సలాంచేసి ఎదురుగా నిలిచాడు.

నవాబు అతడితో "నువ్వు ఈమెను, మరో హిందూ దాసిని తీసుకుని ఈమె అడిగిన ఆయుధాల్ని, వేగంగా నడిచే నావను తీసుకుని ముర్షీదాబాదు వైపు వెళ్లు" ఆదేశించారు.

"మహారాజా! ఏం పని పూర్తిచేసుకు రావాలి" అడిగాడు ముసీబుద్దీన్.

"ఈమె చెప్పింది చెయ్యి. బేగంలానే గౌరవించు. దలినీబేగం కనబడితే ఆమెను వెంట తీసుకురా" అన్నారు నవాబు.

దాసి, ముసీబుద్దీన్ నవాబుకు సలాం చేశారు. శైవలిని కూడా వారు చేసినట్లే నేలనంటి వెనక్కి నడుస్తూ సలాం చేసింది. అది చూసి నవాబు నవ్వారు.

వెళ్లే సమయంలో నవాబు శైవలినిని పిలిచి "అమ్మాయీ! జ్ఞాపకముంచుకో! ఎప్పుడైనా కష్టకాలంలో, ఈ మీర్‌ఖాశింఖాన్‌ను మరచిపోకు. నా వద్ద సహాయం తప్పక లభిస్తుంది" అన్నారు.

శైవలిని మళ్ళీ సలామ్ చేసింది.

మనసులో 'రాకపోవటమేం? రూపసితో బాటు, ప్రతాప్‌ను తీసుకుని తప్పకుండా ఇదే దర్బారుకు వస్తా' అనుకుంది.

ముసీబుద్దీన్, దాసీ సహా నావ ఏర్పాటైంది. శైవలిని చెప్పినట్లు బందూక్,

మందుగుండు, పిస్తోల్, తల్వార్, చురకత్తి వంటి ఆయుధాలు తీసుకున్నారు. 'వీట న్నింటి అవసరమేంటి?' అని అతనడగ లేదు ధైర్యంచేసి. కానీ మనసులో 'ఈమె మరో 'చాంద్ సుల్తానా' తప్పక అవు తుంది' అనుకున్నాడు. రాత్రికి రాత్రే నావ నెక్కి యాత్ర ప్రారంభించారు.

★ ★ ★

వెన్నెల పరుచుకొని వుంది. గంగానది కిరువైపుల ఇసుక తిన్నెలు, మైదానాలు వున్నాయి. వెన్నెల కాంతుల్లో యిసుక మైదానాలు శ్వేతవర్ణంలో మెరుస్తున్నాయి. గంగాజలాలు వెన్నెల కిరణాలలో మరింత నీలివర్ణం దాల్చి గాఢంగా మారాయి.

తీరంపై వృక్షసమూహాలు మేఘాల్లా నల్లగా వున్నాయి. పైన ఆకాశమంతా నీలి వర్ణం.. విశాలమైన ప్రకృతిని చూస్తోంటే అప్పుడప్పుడు మనస్సు చంచలమవుతోంది. దృష్టి సారించినంత వరకు నది అనంతంగా వుంది. మనిషి అదృష్టంలా, ఆచ్ఛాదితమైన భవిష్యత్తులా వుంది. కింద నీరు, పక్కన యిసుక మైదానాలు, పైన ఆకాశం.. అన్నీ ఆనందమే! అనంత ఆకాశంలో చుక్కలు లెక్కింపలేనన్ని ప్రకాశిస్తున్నాయి. నదీతీరం వెంట యిసుకలో నావలు కట్టివున్నాయి. వాటి కింద ఉన్న యిసుక విలువ మనిషికుందా?

ఆ పడవల వరుసల్లో పెద్దనావ ఒకటుంది. ఆ నావ పైన సిపాయిలు పహారా కాస్తున్నారు. పాతిన ప్రతిమల్లా సిపా



యిలు భుజంపై బందూకులతో చలనం లేకుండా నిలబడివున్నారు. లోపల స్వచ్ఛమైన తెల్లని దీపకాంతుల్లో రకరకాల విలువైన ఆసనాలు, తల్పాలు, చిత్రపటాలు, ప్రతిమలు మెరుస్తున్నాయి. చాలామంది ఆంగ్లేయ అధికారులున్నారు. ఇద్దరు చదరంగం ఆడుతుంటే, ఒకడు మద్యం సేవిస్తున్నాడు. ఇంకొకరు పఠనంలో వుంటే, వేరొకరు వాద్యం వాయిస్తున్నారు. ప్రతివారు తమకిష్టమైన వినోదంలో మునిగి ఉన్నారు.

ఒక్కసారిగా అందరూ తుళ్ళిపడ్డారు. ఆ నిశిరాత్రి హఠాత్తుగా ఎవరిదో ఏడుపు.. నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ..

అమియట్ సాహెబ్ చదరంగంలో పావు కదుపుతూ "అదేమిటి? " అడిగాడు.

జాన్సన్ "నీదో పావు చనిపోయింది" అన్నాడు, అతని మాట పట్టించుకోకుండా.

రోదనమింకా పెరిగింది. శబ్దం ఎక్కువగా లేదు. కానీ ప్రశాంతమైన ఆ ప్రదేశంలో అది పెద్దగానే వినిపిస్తోంది. అమియట్ ఆట విడిచిపెట్టి లేచాడు. బయటకొచ్చి నలువైపులా చూశాడు. ఎవరూ కనబడలేదు. పక్కన శ్మశానం కూడా లేదు. ఇసుక మైదానం నుండి శబ్దమొస్తోంది.

అమియట్ నావ దిగి శబ్దం వస్తున్న వైపు నడిచాడు. కొంత ముందుకు నడిచాక మైదానంలో ఎవరో ఒంటరిగా.. అమియట్ దగ్గరకు వెళ్లాడు. ఆమె ఓ స్త్రీ. పెద్ద స్వరంతో ఏడుస్తోంది. అమియట్‌కు హిందీ బాగా రాదు.



అయినా ఆమెను "నువ్వెవరు? ఎందుకేడుస్తున్నావు? " అంటూ అడిగాడు.

ఆమె దాన్ని అర్థం చేసుకోలేదు. ఇంకా ఏడుపు పెంచింది. అమియట్ మళ్ళీ-మళ్ళీ అడిగాడు. ఆమె నుండి ఏడుపు తప్ప జవాబు రాలేదు. ఆమెను తన వెనక రమ్మనట్లు సంజ్ఞ చేశాడు. ఆమె ఏడుస్తూనే అనుసరించింది.

ఆమె ఎవరోకాదు పాపిష్ఠి శైవలినే!

★ ★ ★

నావలోకొచ్చిన అమియట్ గ్లాస్టన్‌తో "ఈ స్త్రీ ఆ మైదానంలో ఒంటరిగా రోదిస్తోంది. నా భాష తెలియడం లేదు. నువ్వామెనడిగి తెలుసుకో" అన్నాడు.

గ్లాస్టన్ కూడా దగ్గరదగ్గరగా అమియట్‌తో సమానపండితుడే! కానీ ఇంగ్లీషు వాళ్ల సమూహంలో అతనికి పేరుంది.

గ్లాస్టన్ "నువ్వెవరు? " అని అడిగాడు.

శైవలిని మునుపటిలా రోదించసాగింది.

"ఎందుకు శోకిస్తున్నావు? "

జవాబివ్వకుండా ఏడుస్తూనే ఉంది.

"నీ ఇల్లెక్కడుంది? "

శైవలిని రోదిస్తునే ఉంది.

"నువ్విక్కడికెందుకొచ్చావు? "

శైవలిని యథాతథమే. ఆమె ఏ ప్రశ్నకు సమాధానం చెప్పకపోవడంతో గ్లాస్టన్ ఓటమి అంగీకరించాడు.

శైవలిని కదలకుండా నిలబడింది. కానీ రోదించడమాపలేదు.

అమియట్ "ఈమె మన భాష అర్థం చేసుకోదు. మనం ఈమె భాషను తెలుసుకోలేం! దుస్తులను బట్టి బెంగాలీ స్త్రీలా ఉంది. ఎవరైనా బెంగాలీని పిలిచి ఈమె విషయం తెలుసుకొమ్మను" అన్నాడు.

ఆంగ్లేయుల వంట వాళ్లందరూ బెంగాలీ ముస్లింలే. అమియట్ వాళ్లలో ఒకరిని పిలిపించి ఆమెతో మాట్లాడించమన్నాడు.

"రోదిస్తున్నావెందుకు? " వంటవాడు అడిగాడు.

శైవలిని పిచ్చిదానిలా నవ్వసాగింది.

వంటవాడు వాళ్లతో "సాహెబ్! ఈమె పిచ్చిది" అన్నాడు.

అమియట్ "ఆమెకేం కావాలో? తెలుసుకో!" అన్నాడు.

వంటవాడు ఆమెనడిగాడు.

ఆమె "ఆకలవుతోంది" అంది.

వంటవాడు వాళ్లకు తెలియజేశాడు.

"ఈమెకేదైనా తినడానికిచ్చి పంపించు" అన్నాడు అమియట్.

వంటవాడు సంతోషంతో ఆమెను వంట గదికి తీసుకువెళ్లాడు.

శైవలిని ఏమీ తినలేదు.

"కొంచెం తిను" అన్నాడు వంటవాడు.

"నేను బ్రాహ్మణ స్త్రీని. మీరు ముట్టుకున్నది నేనెలా తింటాను? " అంది.

వంటవాడు ఆ విషయం అమియట్‌కు తెలియజేశాడు.

అమియట్ "మన నావపైన బ్రాహ్మణులెవరూ లేరా? ఉంటే వారిని ఆమెకు భోజనం పెట్టమను" అన్నాడు.

వంటవాడు ఆమెను సిపాయి వద్దకు తీసుకువెళ్లాడు.

అతని వద్ద ఏమీలేదు. ఎక్కడైతే ఖైదీ ఉన్నాడో అతని వద్దకు తీసుకువెళ్లాడు. అక్కడ బ్రాహ్మణ ఖైదీ ఉన్నాడు. ఆ ఖైదీ ప్రతాప్‌రాయ్. ఆ చిన్న నావకు వెనక, ముందు సైనికులున్నారు.

అక్కడంతా చీకటిగా ఉంది.

"ఠాకూర్!" పిలిచాడు వంటవాడు.

"ఏమిటి? " గది నుండి ప్రతాప్ ప్రశ్న.

"బ్రాహ్మణ స్త్రీకి చాలా ఆకలిగా ఉంది. భోజనం పెట్టగలవా? "

అతని దగ్గర ఏమీలేదు. కానీ అతను అంగీకరించలేదు.

"ఇవ్వగలను. కానీ నా చేతులకు సంకెళ్ళున్నాయి తీయమను" అన్నాడు.

వంటవాడు సైనికుడ్ని సంకెళ్లు తీయమన్నాడు. అతను ఆజ్ఞాపత్రం చూపమ

న్నాడు. దాంతో వంటవాడది తేవటానికి వెళ్లాడు. ఇతరుల కోసం ఇంత శ్రమ ఎవరు పడగలరు? అతడు 'పీర్‌భక్ష్' ఎప్పుడూ ఎవరికి సహాయపడడు. భూమ్మీద ఎన్నిరకాల మనుషులున్నారో వారిలో ఆంగ్లేయుల వద్ద ఉన్న ముస్లీం వంటవాళ్లంత నీచులు మరెవరూ లేరు. కానీ పీర్‌బక్ష్‌కు సొంత అవసరముంది. అతను మనసుతో ఆలోచించాడు. 'ఈ స్త్రీ తిండి తిప్పలు పూర్తయింతర్వాత ఈమెను తీసుకుపోయి వంట గదిలో కూర్చోబెడతాను'

శైవలిని ప్రతాప్‌రాయ్ గది బైట నిలబడి ఉంది. ఆమె ముసుగు ధరించి ఉంది. వంటవాడు ఆజ్ఞ తీసుకురావడానికి అమియట్ వద్దకు వెళ్లాడు.

అందమైన ముఖం అన్నిచోట్ల విజయాన్ని పొందుతుంది. ఒకవేళ అది స్త్రీ ముఖమైతే అమోఘమే అవుతుంది. అమియట్ ఆమె సుందర ముఖం చూశాడు. ఆమె పిచ్చిదని తెలిసి అతడు దయచూపాడు. అమియట్ సైనికునితో సంకెళ్ళు తీయమని, ఆమెను ప్రతాప్‌రాయ్ వద్దకు తీసుకువెళ్లమని ఆదేశించాడు.

వంటవాడు దీపం తెచ్చాడు. సైనికుడు ప్రతాప్ సంకెళ్లు తీశాడు. వంటవాడికి తనతో రావద్దని చెప్పి ప్రతాప్ భోజనం తేడానికి వెళ్లాడు. అభిప్రాయం పారిపోవడం.

శైవలిని గదిలోకి వెళ్లింది. సైనికుడు బయట కాపలా కాస్తున్నాడు. లోపలకు వెళ్లలేదు. శైవలిని లోపలికి వెళ్ళి ముసుగు తొలగించింది. పెదవులు కొరుకుతూ నిలబడింది. ముఖంలో సంతోషం.. నిశ్చితమైన ప్రతిజ్ఞాభావం మెరుస్తోంది.

ఆమెను చూసి ప్రతాప్ ఆశ్చర్యపోయాడు. అతడు 'ఈమె ప్రతాప్ సింహానికి తగిన సివంగి' అనుకున్నాడు.

శైవలిని అతని చెవి వద్ద గుసగుసగా "చేతులు కడుక్కో! నేను తిండికి ముఖం వాచి ఉన్నానా?" అంది.

ప్రతాప్‌రాయ్ చేతులు కడుక్కున్నాడు.

## కొత్తగాలి...

**సాగు**
**సాగదా?**
**వరి ఉరికా?**
**ఊరికా??**

– జి. శైలూషి,
హైదరాబాద్

"పరుగెత్తు! నదీ తీరంలో నీ కోసం నావ ఉంది" అంది.

"నువ్వు ముందు వెళ్ళు! లేకుంటే ఆపదలో పడతావు" అన్నాడు ప్రతాప్.

"నాకో ఆలోచన వచ్చింది. నేను పిచ్చిదాన్ని! ముందుకు పరుగెత్తి నీటిలో దూకుతా! నన్ను కాపాడ్డానికి నువ్వు దూకు..!" అంటూ బిగ్గరగా నవ్వింది.. నవ్వుతూనే.. "నేనన్నం తింటాను.." అని ఏడుపు అందుకుంది. బయటకు పరుగెత్తుకు వచ్చి "నాకు ముసల్మానుల తిండి పెట్టారు. నా జాతి నాశనమై పోయింది. ఓ గంగా మాతా! నన్ను నీ ఒడిలోకి తీసుకో" అంటూ గంగా ప్రవాహంలోకి దూకింది.

"ఏమయింది? ఏమయింది?" అంటూ ప్రతాప్ బయటకు పరుగెత్తుకు వచ్చాడు. సైనికుడు అతన్ని ఆపబోయాడు.

"దొంగ నా కొడకా! ఓ స్త్రీ మునిగి చస్తుంటే.. చూస్తూ నిలబడతావా?" అంటూ సైనికుణ్ణి ఓ తన్ను తన్నాడు. అతడు నావ పక్కన ఇసుకలో పడిపోయాడు. "స్త్రీని కాపాడాలి.." అంటూ అతడు రెండోవైపు ప్రవాహంలో దూకాడు.

"ఖైదీ పారిపోతున్నాడు.." అంటూ అరుస్తూ గది రెండోవైపు సైనికుడు ప్రతాప్ పైకి తుపాకీ గురిపెట్టాడు.

ప్రతాప్ ఈదుతూ.. "భయపడకు నేను

పారిపోను! ఆ స్త్రీని కాపాడి తీసుకొస్తాను! నా కళ్ల ముందు స్త్రీ మరణం చూడలేను. నువ్వు పాపాత్ముడివి. హిందువు అయి కూడా బ్రహ్మహత్య చేస్తావా?" అంటూ అరుస్తూ ముందుకు సాగిపోయాడు.

ఆ సిపాయి తుపాకి కిందకు దించాడు.

శైవలిని చివరి నావ పక్క నుండి వేగంగా ఈదుతూ వెళ్తోంది. ఆ నావ..త ను లారెన్స్ పాస్టర్‌తో వచ్చిన నావ. దాన్ని చూసి గాభరా పడింది. భయపడు తూనే నావపైకి చూసింది. వెన్నెల వెలు గులో పై భాగాన ఓ మంచంపై ఓ వ్యక్తి పడుకుని ఉన్నాడు. వెంటనే తన వెనక ఈదుతూ వస్తున్న ప్రతాప్‌తో "చూశావా! మంచంపై లారెన్స్ పాస్టర్ ఉన్నాడు" అరుస్తున్నట్లు చెప్పింది.

అది విని పాస్టర్ ఆమె వైపు చూశాడు. "శైవలిని పారిపోతోంది " అతను బిగ్గరగా అరిచాడు "పట్టుకోండి.. పట్టుకోండి.. నా భార్య పారిపోతోంది"

పాస్టర్ శక్తిహీనుడు.. రోగి.. గాయపడి మంచంపై పడున్నాడు. లేచే శక్తి కూడా లేదు. పాస్టర్ అరుపులు విని నావ నుండి నలుగురైదుగురు నీటిలోకి దూకారు. ప్రతాప్ వారి కంటే చాలా ముందున్నాడు. వాళ్లందరూ ప్రతాప్‌తో "పట్టుకో.. ఆమెను పట్టుకో.. పాస్టర్ సాహెబ్ మంచి బహు మతి ఇస్తాడు" అన్నారు.

ప్రతాప్ మనసులో 'పాస్టర్‌కు తను గతంలోనే మంచి బహుమతి ఇచ్చాడు. మరోసారి ఇవ్వాలనే కోరిక ఉంది' అను కొని బిగ్గరగా "నేను పట్టుకుంటా! మీరు వెనక్కి వెళ్లండి!" చెప్పాడు.

అతని మాటలు నమ్మి వాళ్లంతా వెను దిరిగారు. పాస్టర్ కూడా ఆ వ్యక్తిని ప్రతా ప్‌గా భావించలేదు. అతని మెదడు కూడా స్వస్థతలో లేదు.

★ ★ ★

శైవలిని.. ప్రతాప్.. ఈదుతూ చాలా దూరం వెళ్లిపోయారు. అది ఎంతటి అంద మైన దృశ్యం! సుఖ సముద్రంలో ఈదులా డుతున్న వారిలా ఉంది. దేశం నిండా ప్రవహించేది, విశాల హృదయిని, చిన్న చిన్న అలలు గలది, నీలి రంగుతో నిండి నదైన గంగానది వక్షస్థలంపై వెన్నెల సముద్రంలో ఈదుతూ ప్రతాప్ పైన అనంత నీలాకాశంపై దృష్టిసారించాడు. అతడిలో ఆలోచన కలిగింది. మనిషి అదృ ష్టంలో ఆకాశపు కడలిలో ఈదే భాగ్యం లేదా? అతడు ఈ మేఘాల అలల్ని ఛేదిం చలేడా? ఏ పుణ్యం చేస్తే తను ఆ కడ లిలో ఈదులాడే జీవికాగలడు? ఈ క్షుద్ర మైన నదిలో ఈదటమా? పుట్టిననా ట్నుండి భయంకరమైన కాలమనే అల లపై ఈదుతునే ఉన్నాడు. ఇప్పుడు మళ్లీ ఈదాల్సి వస్తోంది.

శైవలిని ఆలోచన వేరుగా ఉంది. 'ఈ నీటికి అంతం ఉందా? నేనింత వరకు అగాథ జలంలో ఉన్నాను'

నువ్వు అర్థం చేసుకో, చేసుకోకపో, కానీ జడ ప్రకృతి విడిచిపెట్టదు. సౌందర్యం దాగి ఉండదు. నువ్వు సముద్రంలో ఈదు లాడినా, నీటి నల్లదనం లుప్తం కాదు. చిన్నచిన్న అలల ఎత్తులు మాయం కావు. నక్షత్రాలు అలాగే ప్రకాశిస్తుంటాయి. నీళ్లలో చంద్రుడు ప్రకాశిస్తూనే ఉంటాడు. జడ ప్రకృతి కఠినత్వం ప్రియమైన తల్లిలా ఎల్లకాలం ప్రేమగానే ఉంటుంది.

ఇవన్నీ ప్రతాప్ దృష్టిలో ఉన్నాయి. కా నీ శైవలిని దృష్టిలో లేవు. శైవలిని నావపై తెల్లని చిక్కిశల్యమై వాడిపోయిన రోగి ముఖాన్ని చూసింది. ఆమె మనసులో ఇప్పటికీ అదే దృశ్యం కదలాడుతోంది. శైవలిని యాంత్రికంగా ఈదుతోంది. ఆమెలో మానసిక శాంతి లేదు.

ఇద్దరూ ఈదటంలో నేర్పరులే.

ప్రతాప్‌లో ఈదటం ఆనందాన్నిస్తోంది. అతడు శైవలినిని "శై.." అని పిలిచాడు.

శైవలిని అదిరిపడింది. ఒక్కసారి ఆమె హృదయగతి పెరిగింది. బాల్యంలో ప్రతాప్ ఆమెను 'శై'.. 'శయీ' అంటూ పిలిచేవాడు. ఈ రోజు అదే పేరుతో పిలిచాడు ప్రియంగా. ఎన్నాళ్ల తర్వాత.. సంవత్సరాలతో కాలానికేం పని? భావ అభావాల్లో కాలం లెక్క ఉంటుంది. శైవలిని.. కొన్ని సంవత్సరాలుగా 'శై' పిలుపు వినలేదు. ఆమెకు ఆ కాలం ఓ మన్వంతరం. ఆ ప్రియమైన 'శై' పిలుపు.. అనంత జలరాశి మధ్య నిమీలిత నేత్రురాలైంది. మనసులో చంద్రుడ్ని, నక్షత్రాల్ని సాక్షులుగా భావించింది. అలాగే కళ్లు మూసుకుంది.

"ఈ రోజు నా మనో గంగానదిలో చంద్రుని కాంతులు ఎందుకు కురుస్తున్నాయి? " అంది.

"చంద్రుని వెలుగా? ... శై.. కళ్లు తెరిచి చూడు.. సూర్యోదయం అయింది.. ఇప్పుడు మనకేం భయం లేదు. చూడటానికెవరూ రారు"

"అయితే పద ఒడ్డుకెళదాం!"

"శై...!"

"ఏమి? "

"జ్ఞాపకముందా? "

"ఏ విషయం? "

"గతంలో ఇలాగే ఒక రోజు ఈ గంగానదిలో జంటగా ఈదాం"

అంతలో శైవలిని ప్రవాహంలో కొట్టుకుపోయే ఓ దుంగను ఆసరాగా అందుకుని "నువ్వూ పట్టుకో! బరువు తగ్గుతుంది. విశ్రాంతి లభిస్తుంది" అంది అతడితో.

అతడు కూడా ఆ దుంగను పట్టుకున్నాడు. మళ్లీ శైవలినితో "జ్ఞాపకమొస్తోందా? మనం అనుకున్న ప్రకారం ఆ రోజిద్దరం నీటిలో మునగాలి. కానీ నేను మునిగా. నువ్వు మునగలేదు" అన్నాడు.

"ఆఁ! జ్ఞాపకముంది. నువ్వు నా పాత

# చతుర ప్రవేశిక

## ఆగస్టు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. బంకించంద్ర జాతీయ గీతం? | 6. శైవలినిని మోహించిన ఆంగ్లేయుడు? |
| జ. | జ. |
| 2. శైవలిని భర్త? | 7. గురుగన్‌ఖాన్ సోదరి ఎవరు? |
| జ. | జ. |
| 3. ప్రతాప్ అనుచరుడు? | 8. 'సోదరికి వాటా' మూల రచయిత? |
| జ. | జ. |
| 4. దలినీబేగం దాసి? | 9. ఆస్తిలో సుమతి ఎంతవాటా కోరింది? |
| జ. | జ. |
| 5. రూపసి భర్త? | 10. 'అడవి' నవలా రచయిత? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (   )

చిరునామా: ----------------------------------------------

--------------------------- పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

పేరుతో పిలువకపోతే, ఈ రోజు దానికి ప్రతీకారం తీర్చుకునే దానినే! నన్నెందుకు పిలిచావు? "

"నేను మళ్లీ ఇప్పుడు మునిగిపోదలచుకు న్నాను. ఇది చెప్పటానికే పిలిచాను"

శైవలిని భయంతో "పద! ప్రతాప్.. ఒడ్డుకు వెళదాం" అంది.

"లేదు.. శై.. నేను వెళ్లను.. ఈ రోజు మరణిస్తా.." అంటూ ప్రతాప్ దుంగను వదిలాడు.

"ప్రతాప్! ఇలాంటి నిర్ణయం ఎందుకు తీసుకున్నావు? "

"నవ్వులాటకు కాదు. నిజంగానే నేను మునిగి చావదలచుకున్నా"

"నీకేం కావాలి? నువ్వేం చెబితే అది చేస్తా! ప్రతాప్ చెప్పు"

"ఒట్టు! అలాగైతేనే కానీ ఒడ్డుకు రాను"

"ఏం ఒట్టు పెట్టాలి? " అంటూ శైవలిని కూడా దుంగను వదిలింది. ఆమె కళ్ళు నక్షత్రాల వెలుగు లేకుండా అయ్యాయి. చంద్రుడు మసకబారాడు. నీలిరంగు నీళ్ళు నీలి మంటల్లా మండసాగాయి. పాస్టర్ చేతిలో కత్తితో కట్టెదుట అవతరించాడు. శైవలిని రుద్ధ కంఠంతో "ప్రతాప్! ఏం ఒట్టు అనాలి? చెప్పు" అంది.

ఇరువురు దుంగను విడిచి దగ్గరదగ్గర గానే ఈదుతున్నారు. గంగానది కలకల ధ్వనిలోనే వారి సంభాషణ సాగుతోంది. చుట్టూ పరుచుకున్న నీటిలో చంద్రుడు చిరునవ్వులు చిందిస్తున్నాడు. అచేతన ప్రకృతి ఎంతటి కఠోర హృదయం గలది?

శైవలిని "చెప్పు ప్రతాప్! ఏం ఒట్టు పెట్టాలి? " మళ్ళీ అడిగింది.

"ఈ గంగానదిలోనే.."

"ఈ గంగ నాకేమవుతుంది? "

"అయితే ధర్మదేవత సాక్షిగా చెప్పు.."

"ఇప్పుడు నాలో ధర్మమెక్కడ మిగిలి ఉంది ప్రతాప్? "

"అయితే నాపై ఒట్టు వెయ్యి"

"దగ్గరగా వచ్చి చెయ్యందించు"

ప్రతాప్ ఆమెకు దగ్గరగా వచ్చి శైవలిని చేతిని చాల సంవత్సరాల తర్వాత అందుకున్నాడు. ఇద్దరికీ ఈత కష్టమయ్యింది.

మళ్లీ ఇద్దరూ దుంగను అందుకున్నారు.

"ఇప్పుడు చెప్పు.. నువ్వేం చెప్పదలచుకున్నావో. నేను ఒట్టువేస్తున్నా. ఎంత కాలం తర్వాత నీ చేయి నందుకోగలిగాను" అంది శైవలిని ఉద్విగ్నంగా.

"ఇప్పుడు నాపైన ఒట్టు వెయ్!. లేదంటే మునిగి మరణిస్తాను. ఎవరికోసం ప్రాణాలతో ఉండాలి? ఎందుకోసం ఈ పాపమయమైన జీవితాన్ని సాగించాలి? చంద్రుని సాక్షిగా, చుక్కల సాక్షిగా, ఈ పవిత్ర గంగానది సాక్షిగా బరువు దించుకోడం కన్నా సుఖమేది? " అన్నాడు ప్రతాప్.

పైన చంద్రుడు నవ్వుతున్నాడు.

"నీతోడు.. నేనేం చెప్పాలి? "

"ఒట్టు వెయ్యి. నన్ను తాకి చెప్పు.. నా మరణానికి, జీవించడానికి, శుభానికి, అశుభానికి, అన్నింటికి ఉత్తరదాయిని నేనే"

"నీ పైన ఒట్టు.. నువ్వేం చెబితే అదే ఈ జీవితంలో జరుగుతుంది"

ప్రతాప్ భయంకరమైన ఒట్టు చెప్పాడు.

అది ఆమెకు చాలా ఇబ్బందికరం. ఆచరణలో అసాధ్యం. అందుకే శపథం చెయ్యలేకపోయింది.

"ప్రతాప్! ఈ ప్రపంచంలో నన్ను మించిన దుఃఖితురాలు, అభాగిని ఎవరున్నారు? " అడిగింది.

వెంటనే ప్రతాప్ "నేనున్నా" అన్నాడు.

"నీ వద్ద స్వామిత్వముంది. శక్తి ఉంది. కీర్తి ఉంది. బలగముంది. మంచి భవిష్యత్తుంది. అన్నింటి కంటే మించి నీ భార్య రూపసి ఉంది. మరి నాకేముంది ప్రతాప్? " అడిగింది.

"నీ వద్ద ఏమీలేదు.. రా.. ఇరువురం మునిగి చద్దాం.."

శైవలిని కొంత తడవు ఆలోచించింది. ఆ ఆలోచనల వల్ల ఆమెలో వ్యతిరేక భావనా తరంగాలు విరుచుకుపడ్డాయి. 'నేను మరణిస్తాను. నష్టమేముంది? కానీ నా కోసం ప్రతాప్ మరణించడమెందుకు? ' అనుకుని పైకి "ప్రతాప్ ఒడ్డుకు పోదాం పద"

ప్రతాప్ దుంగను విడిచి నీటిలో మునిగాడు. ప్రతాప్ చెయ్యి ఆమె చేతిలో ఉంది. శైవలిని అతన్ని పైకి లాగింది.

"ప్రతాప్ నువ్వు చెప్పిన విధంగా నేను శపథం చేస్తున్నా. కానీ ఒక్కసారి ఆలోచించి చూడు. నా సర్వశక్తుల్ని హరించి వేస్తున్నావు. నేను నిన్ను చూడలేను..! నిన్నెలా మరవగలను? " అంది.

ప్రతాప్ ఆమె చెయ్యి విడిచాడు. కానీ శైవలిని అతని చేతిని దృఢంగా పట్టుకుంది. అత్యంత గంభీరంగా.. స్పష్టంగా, కన్నీటితో నిండిన రుద్ధస్వరంతో "ప్రతాప్ చేయి బిగించి పట్టుకో! విను! నిన్ను ముట్టి ప్రమాణం చేసి చెబుతున్నా. నీ మరణం.. జీవనం.. శుభం.. అశుభం.. అన్నింటికి ఉత్తరదాయిత్వము నాదే. ఈ క్షణం నుండి నిన్ను మరిచిపోతాను. ఈ రోజుతో నా జీవన సౌభాగ్యాలన్నింటికి తిలాంజలులు అర్పిస్తున్నా. నా మనస్సును నా నియంత్రణలో ఉంచుకుంటా. ఈ రోజుతో.. ఆ శైవలిని మర..ణిం..చింది" అంటూ శైవలిని ప్రతాప్ చేయి వదిలింది. దుంగనూ వదిలేసింది.

ప్రతాప్ గద్గదకంఠంతో "పద.. ఒడ్డుకు.. పద.." అన్నాడు.

ఇరువురూ ఈదుతూ తీరం చేరారు. నడుస్తూ ముందుకు వెళ్లారు. అక్కడ కట్టి ఉన్న నావ తాడు విప్పారు. ఇరువురిలో ఎవరూ తమను గమనిస్తున్న రామానంద స్వామిని చూడలేదు.

ఇంగ్లీషు వారు 'ఖైదీ పారిపోయాడు' అనుకున్నారు. కొంతదూరం అనుసరించారు. కానీ నావ వాళ్ల చూపు నుండి

అదృశ్యమైపోయింది.

రూపసి కేసు ఫిర్యాదు చేయకపోవటం తో శైవలిని పరాజితురాలైంది.

★ ★ ★

ప్రతాప్ ఎప్పుడైతే పారిపోయాడో, అప్పుడు రామచరణ్ విడుదల సులభ మైంది. మొదట్నుండి రామచరణ్ ఆంగ్లే యుల నావపైన ఖైదీగా లేదు. అతని వల్ల పాస్టర్ గాయపడ్డ విషయంగాని, అతని చేతిలో కాపలాదారు మరణించిన విష యంగాని ఎవరికీ తెలియదు. అతన్ని సాధారణ నౌకరుగానే భావించి అమియట్ ముంగేరీ వెళుతూ అతన్ని వదిలి పెట్టి "నీ యజ మాని నీచుడు. అతనికి తగిన శిక్ష విధిస్తాం. నీతో

మాకెలాంటి వైరం లేదు. నువ్వు ఇష్టం వచ్చిన చోటుకు వెళ్లిపో" అన్నాడు.

రామచరణ్ సలాం చేసి, చేతులు జోడించి "అయ్యా! నేను పశుల కాపరిని, నాకు సరిగా మాట్లాడటం తెలియదు. నన్ను క్షమించండి. నా అవసరం మీకేమైనా ఉందా? " అడిగాడు.

దుబాసి అమియట్‌కు అతని మాటల్ని చెప్పాడు.

అమియట్ "ఎందుకు? " అడిగాడు.

"లేకపోతే నాతో పరిహాసమెందుకు? "

"పరిహాసమా? ఎందుకని? "

"అయ్యా! నా కాలు విరిచేశారు. ఇప్పుడు పొమ్మంటున్నారు. నేను మీ ఆంగ్లేయ స్త్రీని పెళ్లాడానా? పశుల కాపరిని. అలా చేస్తే నాజాతి పోతుంది" అన్నాడు.

దుబాసి అమియట్‌కు చెప్పాడు.

అమియట్ విషయం గ్రహించలేకపోయాడు. మనసులో మాత్రం ఈ దేశస్థులు ఎదుటివారిని ఆకట్టుకోడానికి 'అయ్యా! అప్పా' అంటూ మాట్లాడతారు.. సంబంధం కలుపుకుంటారు. రామచరణ్ కూడా అలాంటివాడే అనుకొని అతనితో ప్రశాంతంగా "నీకేం కావాలి? " అన్నాడు.

"అయ్యా! విరిగిన నా కాలు బాగు చేయించండి చాలు" అన్నాడు.

అమియట్ చిరునవ్వుతో "మంచిది. మాతో కొన్ని రోజులుండు. నీకు చికిత్స చేయిస్తా" అన్నాడు.

రామచరణ్ కోరుకున్నది అదే! కొంత కాలం వారితో ఉండాలని.. వారితో స్వేచ్ఛగా కాలం గడపాలని.

ప్రతాప్ పారిపోయిన రాత్రే, రామచరణ్ ఎవరికీ చెప్పకుండా నావ దిగి వెళ్లిపోయాడు. వెళ్తూ ఇంజిత్- మిండిల్ ఆంగ్లేయుల్ని దేశీతిట్లు తిడుతూ పోయాడు.

అప్పటికి అతని కాలు బాగై పోయింది.

★ ★ ★

ఆ రోజు రాత్రి చంద్రోదయం కాలేదు. ఆకాశమంతటా కారుమబ్బులు కమ్ముకున్నాయి. అంతటా పొగరంగు వ్యాపించింది. దాని కింద నల్లటి గాఢాంధకారం. అందువల్ల నది, చిట్టడవి, ఇసుకమైదానం, పర్వత పంక్తులు, అన్నిచోట్లా నల్లటి చీకటి ముసురుకుంది. అంతటి గాఢాంధకారంలో



పర్వతం కింద శైవలిని ఒంటరిగా వుంది.

రాత్రి ఆంగ్లేయుల నౌకర్లు వెంబడించ టంతో వారినుండి తప్పించుకుని నావ తీరం చేరింది. నదీతీరంలో అనేక ఏకాంత రహస్య ప్రదేశాలున్నాయి నావలు నిలుప డానికి. అలాంటి ఓ నిర్జన ప్రదేశంలో నావ నిలిచింది. శైవలిని జాగ్రత్తగా తప్పిం చుకు పారిపోయింది. ఈసారి శైవలిని చెడుతలంపుతో పారిపోలేదు. కార్చిచ్చులో మండిపోతామనే భయంతో అడవి జంతు వులు మంటలకు దూరంగా ఎలా పారిపో తాయో, అలాంటి భయంతోనే ప్రతాప్ నుండి శైవలిని తప్పించుకుని పారిపో యింది. సుఖం, సౌందర్యం, ప్రేమ వంటి వాటి నుండే కాదు, పూర్తి ప్రపంచం నుండి పారిపోయింది. సమీపంలో అన్నీ వుంటే ఎవరు త్యజించగలరు? ఎడారిలో దప్పి కతో వుండి కమ్మటి నీరు లభించినప్పుడు తాగకుండా ఎవరైనా వుండగలరా?

శైవలిని పోరాడలేక రణక్షేత్రం నుండి పారిపోయింది. పరారైన విషయం తెలిసి ప్రతాప్ వెదుకుతాడనే భయంతో దరిదాపు ల్లో లేకుండా దూరంగా పారిపోయింది. పగలు అడవిలో దాగి రాత్రి పర్వతం అధి రోహించాలనుకుంది. పగలు ఎక్కితే ఎవ రైనా గమనిస్తారని కిందే ఆగిపోయింది.

పగలంతా భోజనం లేకుండానే గడిచిపో యింది. సాయం సమయం కనుచీకటి! చంద్రుడు పైకి రాసాగాడు. ఆ చీకట్లో ఆమె పర్వతం ఎక్కటం ప్రారంభించింది. రాళ్ళు పాదాలకు గుచ్చుకుని గాయాలవుతు న్నాయి. చిన్నచిన్న చెట్లు, ముళ్ళపొదలు, వాటి మధ్య నడవడం కష్టంగా వుంది. కొమ్మలు, ముళ్ళు గీరుకుపోయి దేహమం తా రక్తం స్రవిస్తోంది. శైవలిని తనకు ప్రాయశ్చిత్తం మొదలైందనుకుంది.

ఆమెకు దుఃఖం రావడంలేదు. కావాలనే ఈ ప్రాయశ్చిత్తానికి సిద్ధమైంది. ఇష్టంతోనే ప్రపంచాన్ని విడిచి ఈ రాళ్ళు, రప్పలు, కంటకాల మధ్య పడింది. ఇంతకాలం చుట్టుకున్న పాపం, ఈ కష్టాల్ని అనుభ వించడంతో దూరం కాగలదా?

పాదాలు, శరీరం రక్తం ఓడుతున్నా, ఆకలి దహించి వేస్తున్నా, దప్పికతో నాలుక పిడచ కట్టినా భరిస్తూ పైకి ఎక్కు తోంది. పగలే దారిదొరకదు. అలాంటిది రాత్రిపూట సాధ్యమా? అతికష్టంతో కొంత వరకూ పైకి ఎక్కగలిగింది.

అదే సమయంలో ఆకస్మాత్తుగా వాతావ రణం మారింది. కారుమబ్బులు కమ్ముకొ చ్చి ఆకాశమంతా కాటుకలా ఆక్రమిం చాయి. నల్లని ముసుగు కప్పినట్లయింది పర్వతం. చుట్టూరా నది, అడవి అంతా అంధకారమే! ప్రకృతిలో రాళ్ళు, రప్పలు, ముళ్ళు, తుప్పలు తప్పించి మరేమి లేవని శైవలినికి చెబుతున్నాయి. పైకి ఎక్కటం అసాధ్యం, వ్యర్థమని శైవలిని అక్కడే శిలా కంటకాల మధ్య కూర్చుండిపోయింది.

ఆకాశం మధ్య నుండి అవని వరకు ఇంకా కిందకు తటిల్లతలు మెరుస్తున్నా యి. అత్యంత భయంకరంగా ఉరుములు, ఉరుముతున్నాయి. గ్రీష్మంలోని తుపాను ఆ పర్వతంపై ప్రభావం చూపనుందని శైవలిని గ్రహించింది. ఏమైనా నష్టమే ముంది? పర్వతంపై వృక్షాలు విరగొచ్చు, పూలు రాలొచ్చు, శిలలు జారిపోవచ్చు, కా నీ శైవలినికేం నష్టం?

శరీరంపై చల్లని స్పర్శ.. టప టప.. చినుకులు మొదలయ్యాయి. ఆకాశం మెరుస్తోంది. ఉరుములు భయంకరంగా ఉరుముతున్నాయి. గాలి తీవ్రంగా వీస్తోం ది. వర్షపుధారలు చుట్టుముట్టాయి. చెట్ల కొమ్మలు విరుగుతున్నాయి. భీతిల్లిన అడివిమృగాలు అరుస్తున్నాయి. దూరంగా గంగాతరంగాల భీషణఘోష.. శైవలిని తలవంచుకుని ఓ శిలపై కూర్చుంది. తలపై చల్లని నీటిధారలు.. శీతల వాయు వులు శరీరాన్ని వణికిస్తున్నాయి. శిఖరం

నుండి వచ్చే నీటి ప్రవాహం.. ఆమె తొడల నంటి ప్రవహిస్తోంది.

చాలాసేపటి తర్వాత వర్షం నిలిచింది కానీ గాలి ఉధృతి తగ్గలేదు. చీకట్లు మరీ దట్టమయ్యాయి. ఈ సమయంలో పైకిగానీ, కిందకు గానీ వెళ్ళడం అసాధ్యం అనుకుంది శైవలిని. అలాగే అక్కడే కూర్చుని చలికి వణుకుతోంది. అప్పుడు ఆమెకు- వేదగ్రామం, తనగృహం, పతిదేవుడు, సుఖమయ సంసారం.. అన్నీ గుర్తుకు రాసాగాయి. ఆ జీవితాన్ని మరొక్కసారి అనుభవించి మరణిస్తే? అప్పుడు చావు సుఖంగా వుండొచ్చు! సరే అసలిప్పుడు రేపటి సూర్యోదయం చూడగలదా? తను మృత్యువును ఆహ్వానిస్తే అదిప్పుడు చేరువకు వచ్చింది.

ఆ సమయంలో నిర్జన గాఢాంధకార వాతావరణంలో ఒకచేయి ఆమె భుజంపై ఆనింది. మొదట ఏ అడవి జంతువో అనుకుని కొంచెం పక్కకు జరిగింది. తిరిగి అదే చెయ్యి! చీకట్లో ఏమీ కనబడటం లేదు. భయకంపిత స్వరంతో శైవలిని-

"మీరెవరు? మనుషులా? దేవతలా? మనుషులైతే ఈ శైవలిని భయపడదు. దేవతలైతే శిక్షిస్తారని భయం" అంది.

సమాధానం రాలేదు.

కానీ దేవతలో, మనుషులో, ఎవరో తనను రెండు చేతులతో ఎత్తుకున్నట్లు గ్రహించింది శైవలిని. ఒక చెయ్యి ఆమె వీపు కింద వుంటే మరో చెయ్యి కాలిపిక్కల కింద వున్నట్లు తెలుసుకుంది. భుజంపై వేడి శ్వాస తగులుతోంది. శైవలిని అరవటం ప్రారంభించింది.. మనిషో మరెవరో ఆమెను ఒడిలో కెత్తుకుని జాగ్రత్తగా పర్వతం పైకి తీసుకుపోతున్నారు. వీళ్ళెవరైనా లారెన్స్ పాస్టర్ మాత్రం కాదు అనుకుంది.

★ ★ ★

ప్రతాప్‌రాయ్ జమీందారు.. బందిపోటు.. దోపిడిదారు. అసలు ఆ కాలంలో

## కొత్తగాలి...

**నీటి కొరత మీద**
**సమావేశాలకి**
**ఐదు లారీల నీళ్లు!**
**కోటి రూపాయల ఖర్చు!**

– ఆర్.ఎస్. హైమవతి,
చెన్నై

జమీందార్లందరు దోపిడి దారులే!

గజదొంగల వంశంలో జన్మించినందుకు సిగ్గుపడాల్సిన అవసరం లేదు. ఎందుకంటే చాలామంది దోపిడిదారులు ప్రపంచ ప్రఖ్యాతిపొందారు.

ఇంగ్లండ్‌లో ఎవరైతే తమ వంశగౌరవాన్ని చూసి గర్విస్తారో వారు నార్మన్, స్కాండేవియా, నావికాదొంగల పరిచయాన్ని ఉటంకిస్తారు. ప్రాచీనకాలంలో భారతదేశంలోని కురువంశం, దాని ప్రతిష్ఠ అతిశ్రేష్ఠమైంది. వాళ్ళు ఆవులను దొంగిలించేవాళ్ళు. విరాటరాజు గోశాలల నుండి దొంగతనం చేయడానికి వెళ్ళారు. ఒకటి, రెండు, బెంగాలీ జమీందార్ల వంశప్రతిష్ఠ కూడా అలాగే ఉంది.

ప్రాచీన జమీందార్లకు, ప్రతాప్‌రాయ్‌కు దోపిడిలో భేదముంది. తన సంపత్తి రక్షణకుగానీ, లేదా భయంకర శత్రువును నిర్జించటానికి గానీ ఈ దోపిడి తత్వాన్ని ప్రయోగిస్తాడు. ఇతరుల సంపదను దోచడానికో, లేక మరొకర్ని కష్టపెట్టడానికో అతడు దీన్ని ప్రయోగించడు. కొందరు బలహీనుల్ని రక్షించడానికి కూడా ఈతత్వాన్ని అన్వయిస్తుంటాడు. ప్రతాప్ ఈ మార్గంలో నడిచే దోపిడిదారు.

ఏ రాత్రి శైవలిని నావ విడిచి పారిపోయిందో, మర్నాడు ఉదయం మేల్కొన్న

ప్రతాప్ రామచరణ్ రావడాన్ని చూసి సంతోషించాడు. కానీ నావలో శైవలిని లేక పోవడం విచారం కలిగించింది. కొంత సమయం నిరీక్షించి తిరిగి ఆమెను వెదికే ప్రయత్నం ప్రారంభించాడు.

గంగాతీరం వెంట చాలాచోట్ల వెదికి చూశాడు. కనబడలేదు. చాలా సమయం గడిచింది. నిరాశపడిన ప్రతాప్ చివరికి ఆమె గంగలో ప్రాణత్యాగం చేసి వుంటుం దని భావించాడు. ఆమె వున్న పరిస్థితుల్లో అది అసాధ్యం కాదనుకున్నాడు.

మొదట శైవలిని మరణానికి తానే కార ణమనుకున్నాడు. తర్వాత ఆలోచించాడు. ఇందులో తన దోషమేముంది? తనేం అధర్మంగా ప్రవర్తించలేదు. శైవలిని మర ణానికి కారణం తను మాత్రం కాదు. తన పై ఆమె క్రోధం పూనలేదు. చంద్రశేఖర్‌పై కోపాన్ని చూపడానికి కారణం తోచలేదు. కానీ చంద్రశేఖర్ శైవలినిని వివాహం ఎందుకు చేసుకున్నాడు? రూపసిపై కూడ కోపం వచ్చింది. శైవలినితో కాక తనపెళ్ళి రూపసితో ఎందుకు జరిగింది?

సుందరిపై కూడ మరో కారణంతో కో పించాడు. ఒకవేళ సుందరిని శైవలిని కోసం పంపకపోతే తను శైవలినితో బాటు గంగలో ఎందుకు ఈదేవాడు? శైవలిని కూడ మరణించేది కాదు. అందరి కంటె లారెన్స్ పాస్టర్‌పై అధికంగా కోపం వచ్చింది. ఆ ఇంగ్లీషు పంది శైవలినిని చెర బట్టకుంటే ఇదంతా అసలు జరిగేదేకాదు. ఆంగ్లేయులు భారతదేశానికి రానటయ్యితే, శైవలిని పాస్టర్ చేతిలో పడేదికాదు. కోప మంతా ఇంగ్లీషువారిపైకి మళ్ళింది. ఈసారి పాస్టర్‌ను చంపి దహనం చెయ్యా లని నిర్ణయించుకున్నాడు.

ముఖ్యంగా అతను మరో నిర్ణయం తీసు కున్నాడు. బెంగాల్ నుండి ఆంగ్లేయుల్ని తన్ని తరిమేయడం తన ప్రథమ కర్తవ్యం. ఎందుకంటే వీరిలో చాలామంది పాస్టర్ వంటి మానసిక దౌర్భాగ్యులే.

ఈ విధంగా ఆలోచిస్తూనే ప్రతాప్‌రాయ్ ముంగేరి చేరుకున్నాడు. అతడు కోటలో ప్రవేశించేసరికి నవాబు ఇంగ్లీషువారిపై యుద్ధానికి సన్నద్ధమవుతున్నాడు. ప్రయ త్నాలు విరివిగా జరుగుతున్నాయి.

ప్రతాప్‌రాయ్ ఆనందించాడు. నవాబు ఆంగ్లేయుల్ని బెంగాల్ నుండి తరిమేయగ లడా? పాస్టర్‌ను బంధిస్తాడా? ప్రస్తుతం ప్రతివారూ శక్త్యానుసారం నవాబుకు సహ కరించడం కర్తవ్యం. కర్రపలకలు సము ద్రాన్ని నిలువరించగలవు గదా!

అతను ఇంకా ఆలోచించాడు. ఆయనకు తాను సాయపడగలడా? ఏం చేయగ లడు? తనకు సైన్యం లేదు. కర్రసాము వాళ్ళున్నారు, దోపిడి దొంగలున్నారు. వా ళ్లేం చేయగలరు? ఆంగ్లేయులకు సాయ పడే గ్రామాల్ని దోచుకోగలరు. సైనికుల కందే ఆహారాన్ని దోచెయ్యగలరు. ధన సహాయాన్ని దోచి అడ్డుకోగలరు.

ఈ విధంగా నవాబుకు సహాయం చే యొచ్చు. శత్రునాశనం జరిగితే విజయం లభిస్తుంది. ఈ రీతిన ప్రయత్నించి సైని కుల కందే సహాయాన్ని కొల్లగొడతాడు.

తనీవిధంగా ప్రవర్తించడానికనేక కారణా లున్నాయి. మొదటిది ఒక ఆంగ్లేయుడు చంద్రశేఖర్ కుటుంబాన్ని సర్వనాశనం చేశాడు. రెండోది శైవలిని మరణించింది. మూడోది తనను ఇంగ్లీషువారు బంధిం చారు. నాలుగోది ఈ రీతిన అనేక మందికి నష్టాన్ని, కష్టాన్ని కలిగించారు. ఇంకా కలిగిస్తారు. అయిదోది నవాబుకు సహకారమందిస్తే భవిష్యత్తులో ఒకటి, రెండు పరగణాలు(జిల్లాలు) బహుమతిగా లభించవచ్చు. తన ప్రతీకారం ఇలా తీర్చు కోవచ్చు.

ఈ నిర్ణయం ప్రకారం ప్రతాప్ మంత్రు లను ఆశ్రయించి నవాబును దర్శించాడు. అక్కడ జరిగిన విశేషాలు..

చాన్నాళ్ళ తర్వాత భర్త తిరిగి రావడంతో రూపసి సంతోషించింది. శైవలిని మరణవార్త ఆమెను దుఃఖితురాల్ని చేసింది. ప్రతాప్ రాక తెలిసి సుందరి వచ్చింది. శైవలిని మరణవార్తకు ఆమె చాలా దుఃఖించింది. ఏది జరగాలో అదే జరిగింది. ఇప్పుడు శైవలినికి సుఖం లభించింది. జీవించడం కంటే ఆమె మరణించడమే మేలు. ఇక ఆమెను నిందించాల్సిన అవసరంలేదు అనుకుంది..

రూపసి, సుందరిలను కలిసి ప్రతాప్ వెళ్ళిపోయాడు. శీఘ్రంగా సమాచారం దేశమంతా వ్యాపించింది. ముంగేరి నుండి కట్వా వరకు గల ప్రాంతంలో ప్రతాప్ కర్రసాము వాళ్ళను, దోపిడీ దొంగల్ని సమావేశపరుస్తున్నాడు.

ఈ వార్త విని గురుగన్‌ఖాన్ విచారంలో మునిగాడు,




పర్వతాలపై గాఢాంధకార గుహలో కఠినమైన శిలపై శైవలిని పడుకొని వుంది. విశాలకాయుడు ఆమెను ఆ రాతి శయ్యపై పడుకోబెట్టి వెళ్ళిపోయాడు. గాలి, వర్షం ఆగాయి. గుహలో కటికచీకటి, భయంకర నిశ్శబ్దం వ్యాపించి వుంది. కళ్ళు మూసినా, తెరిచినా ఒకేవిధమైన చీకటి.. భరించరానిదిగా వుంది. చీకటి నిండిన ఆ ప్రశాంత వాతావరణంలో అప్పుడప్పుడు గుహ పై భాగం నుండి ఏ సందు గుండానో టప్.. టప్ అంటూ నీటిచుక్కలు రాలుతున్నాయి. ఎవరో నిశ్శబ్ద సమయంలో శ్వాసించినట్టుంది.

శైవలిని భయాన్ని మరిచిపోయింది. మనిషి స్థిరబుద్ధికి ఓ హద్దుంటుంది. శైవలిని ఆ సరిహద్దు దాటిపోయింది. ఆమెకు ఏ విషయంలోను భయంలేదు. ఎందుకంటే? ఆమె జీవితం సహనయోగ్యం కాదు. జీవితంపై విరక్తివుంది. జీవితమంటేనే ఆమెకు అసహ్యమేర్పడింది. జీవితంలో మిగిలిందేమిలేదు. నీతి, ధర్మం, కులం, జాతి, సుఖం, దుఃఖం, మానం, మర్యాద అన్నీ పోయింతర్వాత ఇక భయందేనికి?

శైవలిని బాల్యం నుండి, ఏ విషయాన్నయితే జాగ్రత్తగా, అతి గోప్యంగా దాచి పెట్టుకుందో, నిన్నటితో అది కూడ ధ్వంసమైంది. దాని కోసం జీవితంలో అన్నింటిని త్యజించింది. ఈ సమయంలో అది కూడ దూరమైంది. రెండురోజుల ఉపవాసం, మార్గాయాసం, పర్వతంపైకెక్కిన ఆయాసం, గాలి వర్షాల బాధ, వీటన్నింటితో ఆమె శరీరం శక్తి హీనమైంది. పైగా భగవంతుని దయావిహీనతతో శరీరం కృశించింది, మనస్సు శిథిలమైంది.

శైవలిని మూర్ఛలో వుంది. సగం చేతన ..సగం అచేతనత్వం. పరున్న శిలా వేదిక సున్నితమైన ఆమె దేహాన్ని ఒత్తుకుని బాధిస్తోంది.

స్మృతి విహీనురాలు కావటంతో ఓ విధంగా అది స్వప్నదశ. ఆ స్వప్నంలో విశాలమైన నదిని తన ముందు గమనించింది. కానీ నదిలో నీటికి బదులు రక్తం ఇరు తటుల నొరుస్తూ ప్రవహిస్తోంది. విరిగిన మానవ కంకాళాలు ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయి. అవన్నీ మాంసరహితాలు.. పెద్దపెద్ద కనుగుడ్లుగల రెండు ఆకారాలు. ఎముకల్ని పట్టుకుని కరకర నములుతున్నాయి.

శైవలిని చూసింది. అతడు పర్వతాగ్రానికి చేర్చిన మహాకాయుడు. తనను నదీతీరంలో కూర్చోబెట్టాడు. అక్కడ ఎండ లేదు, వెన్నెల లేదు, నక్షత్రాల్లేవు, మేఘాలు లేవు, వెలుగు లేదు, చీకటి కూడా లేదు.. కానీ అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. నెత్తుటి నది, కరుగుతున్న శరీరాలు, కొట్టుకుపోతున్న అస్థిపంజరాలు, ఎముకల మొసళ్ళు అన్నీ కనిపిస్తున్నాయి. నదీతీరాన యిసుక తిన్నెలు లేవు. ఇనుప చువ్వలు పైకి మొనలు తేలి నిలుచున్నాయి.

ఆ విశాలకాయుడు ఆమెను నదిని దాటమన్నాడు. నది దాటడానికి సాధనమేదీ లేదు. నావ లేదు, వంతెన లేదు.

"ఈదుతూ వెళ్ళు! ఈదడం వచ్చుగదా! గంగలో ప్రతాప్‌తో చాలసార్లు ఈదావు కూడా" అంటూ ఆదేశిస్తున్నాడు.

శైవలిని ఆ రక్తపు నదిలో ఎలా ఈదగలుగుతుంది? కానీ ఆ మహాకాయుడు తానే చేతిలోని బెత్తంతో ఆమెని దండించడానికి లేచాడు. శైవలినికి అతని చేతిలో బెత్తం మండుతున్న యినుప చువ్వలా కనిపించింది. ఆమె ఆలస్యం చేయడంతో అతడు బెత్తంతో ఆమె వీపుపై బాదసాగాడు. దెబ్బలకు తాళలేక, గాయాలతో బాధపడుతూ నెత్తుటి నదిలో దూకింది. అక్కడ వున్న ఎముకల మొసలి ఆమెను పట్టుకోవడానికి వచ్చింది. కానీ పట్టుకోలేదు. ఆమె ఈదుతూ వెళ్ళింది. నోటిలోకి నెత్తురు పోతోంది. ఆ విశాలకాయుడు ఆమెతో బాటు నెత్తురుపై నడుస్తున్నాడు. కానీ అతడు మునగడంలేదు. కుళ్ళిపోయిన దుర్గంధపూరిత శవాలు ఆమెను తాకుతూ పోతున్నాయి ప్రవాహంలో.

శైవలిని ఆవలి తీరం చేరింది. ఒడ్డుపై కెక్కి నలువైపులా చూస్తు "రక్షించండి.. రక్షించండి.." అంటూ అరవసాగింది. ఆశ్చర్యకరంగా ఆమె ఎదుట రంగు, ఆకారం, ఏమిలేని పలుచని వెలుతురు. ఆ వెలుతురు మండుతూ ఆమె కళ్ళకు తగిలి కనుగుడ్లు చిట్లినంత బాధ. అవి విషపు మంటలైవుంటాయి. అవి ఆమెను చుట్టుముట్టాయి. దుర్గంధం నాసికాపుటాల్లో ప్రవేశించింది.. ముక్కు మూసినా భరింపలేని దుర్వాసనకు ఆమె పిచ్చిదైంది. చెవుల్లో భయంకర, కఠోర, కర్కశ శబ్దాలు.. హృదయాల్ని చీలుస్తున్న దుఃఖితుల ఆక్రందనలు.. రాక్షస వికృత వికటాట్టహాసాలు.. భయంకర హుంకారాలు.. పర్వతాలు పగిలిన శబ్దాలు.. పిడుగులు కురిసిన, రాళ్ళు వర్షించిన, నీళ్ళుపోటెత్తిన, అగ్నిశిఖల విస్ఫోటనాలు.. చావుకేకలు, వంటి రకరకాల ఘోషలతో ఆమె చెవులు తూట్లు పడుతున్నాయి.

ఎదుటి నుండి నిరంతరం ప్రళయఘోషతో గర్జిస్తూ గాలి వీస్తోంది. అగ్నిశిఖల్లా ఆమె శరీరాన్ని మంటలెత్తిస్తున్నాయి. అప్పుడప్పుడు వందల, వేల చురకత్తులు శరీరంలో దిగి శరీరాన్ని ముక్కలు ముక్కలు చేస్తున్న అనుభూతి.

శైవలిని అరిచింది "ప్రాణాలు పోతున్నాయి! రక్షించండి!" అంటూ.

అప్పుడు ఓ దుర్గంధ క్రిమి ఆమె నోటిలోకి దూరింది. శైవలిని అరుస్తూనే వుంది. "రక్షించండి.. రక్షించండి.." ఈ ఘోర నరకం నుండి.. నన్ను రక్షించండి.. నాకు తప్పించుకునే మార్గం లేదా? "

గుహాంతర్భాగం నుండి వినిపించింది. "వుంది" అని.

మోహ నిద్ర నుండి మేల్కొందామె. కానీ భ్రమ దూరం కాలేదు. వీపు అడుగున రాయి గుచ్చుకుంటోంది. శైవలిని భ్రమకు లోనై "ఇప్పుడు ఏం జరుగుతోంది? నాకు రక్షణ దొరకదా? " అంది.

గుహ నుండి గంభీరస్వరం మళ్లీ వినిపించింది "వుంది" అని.

"ఇదేమిటి? నేను నిజంగా నరకంలో వున్నానా? బయటపడే ఉపాయం లేదా? "

అంటూ భయంగా అడిగింది.

"పన్నెండు సంవత్సరాల వ్రతం చెయ్యి" గుహ నుండి సమాధానం వచ్చింది.

శైవలిని అది దైవవాణి అనుకుంది. "ఆ వ్రతమేమిటి? ఎలా చేయాలి? నాకెవరు నేర్పిస్తారు? " కాతర స్వరంతో అడిగింది.

"నేను నేర్పించగలను" సమాధానం.

"మీరెవరు? "

"నువ్వు వ్రతం స్వీకరించు"

"నేనేం చేయాలి? "

"నీ శరీరంపైని వస్త్రాలు తొలగించుకుని, నేనిచ్చిన వస్త్రాలు ధరించు. నీ చేయి చాపు.." వినిపించింది.

శైవలిని చేతిని చాపింది. చాపిన చేతిలో వస్త్రం పడింది. తన శరీరంపైని దుస్తులు తొలగించి దానిని ధరించిందామె.

తర్వాత "ఇప్పుడేం చేయాలి? " అడిగింది శైవలిని.

"నీ అత్తారిలెక్కడ? "

"వేదగ్రామం, అక్కడికి వెళ్ళాలా? "

"వెళ్ళు! గ్రామం బయట కుటీరం ఏర్పాటు చేసుకో!"

"ఇంకేం చేయాలి? "

"భూ శయనం చేయాలి"

"పిదప? "

"ఫలాలు, కందమూలాలు, ఆకులు మాత్రమే భుజించాలి"

"ఇంకేం చేయాలి? "

"తలపై శిఖ ధరించాలి"

"ఆ తర్వాత? "

"ప్రతిరోజు సాయంకాలం భిక్షకు వెళ్ళాలి. భిక్ష అడుగుతూ చేసిన పాపం చెప్పుకోవాలి"

"నా పాపం చెప్పుకోదగింది కాదు, మరే ప్రాయశ్చిత్తం లేదా? "

"వుంది"

"ఏమిటది? "

"మరణం"

"వ్రతాన్ని స్వీకరించా! మీరెవరు? "

గుహనుండి సమాధానం లేదు.

## జులై - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **టి. రాంకిషన్**
   - కొత్తపేట, హైదరాబాద్
2. **ఈ. కృష్ణకుమారి**
   - పటమట, విజయవాడ
3. **కె. హిమబిందు**
   - ఎమ్మిగనూరు, కర్నూలు జిల్లా
4. **గుర్రపు పురుషోత్తం**
   - నయీంనగర్, హనుమకొండ
5. **ఎస్. మణిమేగలై**
   - బైరాగిపట్టెడ, తిరుపతి

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. నందకిషోర్ | 6. హాలోవీన్ |
| 2. తులసీరామ్ | 7. నందన్ |
| 3. గౌరీ | 8. చీర |
| 4. సుమతీ, ప్రతాప్‌రెడ్డి | 9. కె.ఎస్.వై. పతంజలి |
| 5. టోనీ మారిసన్ | 10. వల్లభాయ్‌పటేల్ |

తిరిగి శైవలిని దీనంగా ప్రార్థించి "మీరెవరైనా కావచ్చు! మళ్ళీ అడగను. పర్వత స్వామిగా మీకు ప్రణమిల్లుతున్నాను. ఒక్క ప్రశ్నకు మాత్రం సమాధానమివ్వండి. నా స్వామి(భర్త) ఎక్కడున్నారు? " అడిగింది.

"ఎందుకు? "

"నేను ఆయన దర్శనాన్ని ఎప్పుడూ పొందలేనా? "

"నీ ప్రాయశ్చిత్తం పూర్తయిం తర్వాత దర్శించగలవు"

"పన్నెండు సంవత్సరాల పిదపనా? "

"అవును పన్నెండేళ్ళ తర్వాతే"

"ఈ కఠోర నియమ వ్రత దీక్షతో నేను ఎంతకాలం జీవించగలను? ఒకవేళ నేను మధ్యలోనే చనిపోతే!"

"అప్పుడు మరణసమయంలో దర్శనం"

"అంతకు పూర్వమే పొందలేనా? మీరు దేవతలు! మీకు తప్పకుండ తెలుస్తుంది"

"వెంటనే నీ స్వామి దర్శనం కావాలనుకుంటే, వారం రోజులు గుహలో ఒంటరిగా వుండి.. సదా నీ స్వామి నామస్మరణ చెయ్యి. మరే విషయం గురించి ఆలోచించకు. ప్రతిరోజు సాయంకాలం మాత్రం గుహ నుండి బయటకు వెళ్ళు. పండ్లు, ఫలాలు తెచ్చుకో! కడుపు నిండా తినకు, ఆకలి మాత్రం తీరాలి. ఏ వ్యక్తి వద్దకూ వెళ్ళకు. ఎదురుపడినా సంభాషించకు. వారం రోజులు ఈ రీతిన చీకటి గుహలో వసించి, నిర్మల చిత్తంతో నీ స్వామిని ధ్యానించు. ఆయనను దర్శిస్తావు" అని గుహ నుండి వినిపించింది.

ఆ పర్వత స్వామి చెప్పినట్లు శైవలిని వారం రోజులు కఠోర నియమాలతో ప్ర తీక్షిస్తూ నిర్వహించింది. కేవలం సాయంకాలం గుహ బయటకు వెళ్ళేది. పండ్లు, కందమూలాలు తెచ్చుకునేది. అంధకారంలో తన స్వామిని స్మరిస్తూనే గడిపింది. శరీర, మనసా స్వామినే చింతించింది. చీకటి తప్ప, వెలుగు లేనేలేదు. రాత్రి, పగలు స్వామి రాకకై ప్రతీక్షిస్తూ గడిపింది. స్వామి ధ్యాసలో పరిపూర్ణమైన మనసు మరోశబ్దాన్ని వినలేదు.

ఆమె మనసు నిండా ఆయన ఆలోచనలే! ఆయన ప్రేమపూర్వక సంభాషణలు వింది. తను ఆయనకు సమకూర్చిన పూజాసుమాల సుగంధాల సువాసనల్ని శ్వాసించింది. శరీరం ఆయన స్పర్శ సుఖాన్ని ఆస్వాదించింది. మరో ఆలోచన, భావం లేదు. కేవలం ఆయన సందర్శనాభిలాషియై వేచివుంది.

ఆ అంధకారంలో, మూసిన కనురెప్పల కింద తన స్వామి ప్రతిబింబాన్ని తలచుకునేది. ప్రకాశించే ఆ ముఖకమలం.. విశాలం, ఉన్నతమైన లలాటం.. నుదుటిపై మెరిసే విభూతిరేఖలు.. పెదవులు కదపని చిరునవ్వు.. పుష్పాల మకరందం కోసం పరిభ్రమించే మధుపంలా ఆమె మనస్సు స్వామి చుట్టూ పరిభ్రమిస్తుండేది.

ఎవరైతే ఈ వ్రతాన్ని ఆదేశించారో, ఆయన తన మానసిక స్థితినెరిగినవాడు.

నిర్జన, నిశ్శబ్ద, అంధకార, మానవమాత్రుల సంచారంలేని ప్రదేశంలో వుండి నిద్ర, సుఖాలకు దూరంగా వ్రతాన్ని ఆచరించడం సామాన్యం కాదు. ఆ స్థితిలో చేసే చింతనలతో తన్మయులవుతారు.

అలసిన మనశ్శరీరాలతో శైవలిని పరిస్థితి వికార స్థితికి చేరింది. అది వికారమో, మరేమిటో కానీ ఆమె హృదయ చక్షువులు దర్శించాయి. ఎత్తయిన సాలవృక్షాన్ని అధిగమించి, విశాల భుజాలు కలిగి, సుకుమార శరీరం, విశాల లలాటం, మెరిసే విభూతి రేఖలతో, సరస్వతికి వేదికలా, ఇంద్రునికి యుద్ధభూమిలా, అనంగుని దివ్య ఆవాసంలా, లక్ష్మికి సింహాసనంలా, వున్న అతనితో ప్రతాప్‌కు పోలికా? ఛీఛీ..! సముద్రం ముందు గంగనా? ఆ కళ్ళు తేజోవంతం.. నవ్వుతాయి..చక్రాల్లా భ్రమణం చేస్తాయి, చమత్కరిస్తాయి, విశాలం, తీక్షణం, నిరంతరం స్నేహభావాన్ని ప్రతిఫలిస్తుంటాయి. ఆ చూపుల్లోని నైశిత్యం ఎదుటివారి తత్త్వాన్ని సంపూర్ణంగా గ్రహిస్తాయి. ఆ కళ్ళముందు ప్రతాప్ కళ్ళు ఏపాటి? నేనెందుకు నా స్వామిని మరిచాను? ఎందుకు మునిగాను? ఎందుకు మరణించాను?

ఆయనది సుందర బలిష్ఠదేహం, నవపల్లవ సాలవృక్షం. తాపస లతలు చుట్టుకొనిన దేవదారు వృక్షం. పూలతో పరివ్యాప్త

అక్షరం

ఒకరి కష్టాన్ని పోగొట్టడానికి ప్రయత్నించే ఏ ఒక్కరూ కూడా పనికిమాలిన వ్యక్తి కాదు.

– చార్లెస్ డికెన్స్



శైలం. అర్ధసౌందర్యం, అర్ధశక్తి, అర్ధసూర్యుడు, అర్ధచంద్రుడు, సగం గౌరి, సగం శంకరుడు, సగం రాధ, సగం కృష్ణుడు, సగం ఆశ, సగం భయం, సగం జ్యోతి, సగం నీడ, సగం అగ్ని, సగం పొగ అయిన ఆయన్ని నేనెందుకు తెలుసుకోలేదు.

స్పష్ట, పరిపూర్ణ, వంగ్య, స్నేహ, కోమల, మృదు, విదగ్ధ వాణి ఆయన సొంతం.

ఆయన నవ్వు పూలపాత్రలో అలంకరించిన సుగంధపుష్ప భరితం. మేఘమాలికల్లోని తటిల్లతల్లా, చెడుకాలాల్లో దుర్గామాత మహోత్సవంలా, నా సుఖస్వప్నం వంటిదని నేనెందుకు భావించలేదు?

ఆయన ప్రేమ ఎంతగొప్పది! సముద్రమంత గంభీరం, విశాలం, అగాధం! శక్తిలో ఆయనకు ఆయనే సాటి. స్థిరమైన శాంత స్వభావం ఆయనది. ఆయన అజేయుడు.. భీకరుడు. అలాంటి మహనీయుడ్ని అర్థం చేసుకోలేదు? ఆయనపై శ్రద్ధ ఎందుకు చూపలేదు? మేరుశిఖరం వం టి ఆయన ముందు ప్రతాప్ ఎంతటివాడు?

నేనెవరిని? నేనాయనకు తగినదాని నేనా? బాలికను, అజ్ఞానిని, నిరక్షరను, అసమర్థురాలిని. ఆయన ఎదుట నేనెంతటిదానను? సముద్రంలోని నత్తను, పువ్వులోని కీటకాన్ని, చంద్రునిలోని మచ్చను! నేనెంతటి హీనురాలిని! జీవితంలో దుస్స్వప్నాన్ని, హృదయంలో శూలాన్ని, సుఖంలో దుఃఖాన్ని, ఆశలో నిరాశను! ఆయన శక్తిలో తనెంత? అగ్నిలో శలభం! తనెందుకు మరణించలేదు?

పర్వతస్వామి చెప్పినట్లు నిరంతరం మనసా, వాచా శైవలిని తన స్వామిని ప్రార్థించింది. దీనికి సర్వాంతర్యామి భగవంతుడే సాక్షి. భగవంతునికి అంతా తెలుసు. అనుగ్రహిస్తాడు. వజ్రంతో పర్వతాలు ముక్కలవుతాయి. చాలాకాలం నుండి ఘనీభూతమైన బాధ, దుఃఖం, శైవలినిలో ఒక్కసారిగా విరుచుకుపడ్డాయి. ఆమె ప్రతాప్‌ను మరిచిపోయింది. చంద్రశేఖర్‌ను ప్రేమించడం ప్రారంభించింది. మనిషి ఇంద్రియాలను జయించాలి. ఇంద్రియాల్ని విలుప్తం జెయ్యాలి. మనస్సు కట్టడిజెయ్యాలి. రుజుమార్గంలో దాన్ని నడిపించాలి. రెండో మార్గం మూసేయాలి. మానసిక శక్తిని సంఘటితం జెయ్యాలి. అప్పుడు ఒకే మార్గాన పయనిస్తుంది. అందులోనే లీనమవుతుంది.

శైవలిని ఐదో రోజున తెచ్చిన ఫలాల్ని తినలేదు. ఆరోనాడు ఫలాలకు వెళ్ళనే లేదు. ఏడోరోజు ఉదయం ఆలోచించింది. స్వామి దర్శనం లభిస్తుందా? లభించకుంటే ఏంచెయ్యాలి? ప్రాణత్యాగం జేయాలి.

ఏడోరోజు రాత్రి హృదయంలో కమలం వికసించింది. దానిపై చంద్రశేఖర్ యోగాసనంలో ప్రతిష్ఠితుడైవున్నాడు. శైవలిని భ్రమరమై ఆయన పాదాల వద్ద ఝుంకారం చేస్తూ పరిభ్రమించసాగింది.

ఒకసారి భయంకర నరకంలో కూరుకుపోతోంది. వేల చేతుల పొడవైన భయానక సర్పసముదాయం నాలుకలు చాస్తూ చుట్టుకోబోయాయి. ఫణాల హుంకారం భీకర శబ్దంగా మారిపోతోంది. అప్పుడు చంద్రశేఖర్ వచ్చి విశాలమైన పడగపై

పాదముంచి నిలబడ్డాడు. మిగతా సర్పాలన్నీ పారిపోయాయి.

మరోసారి విశాలమైన అగ్నిగుండం జ్వలిస్తోంది. ఆకాశం వైపు అగ్నిశిఖలు వ్యాపిస్తున్నాయి. శైవలిని అందులో కాలిపోతోంది. చంద్రశేఖర్ వచ్చి కొన్ని నీళ్ళు చిలకరించాడు. మంటలు అంతరించాయి. చల్లటి గాలి వీచసాగింది. తీరంపై పూలు వికసించాయి. నదీజలాల్లో కమలాలు వికసించాయి. చంద్రశేఖర్ ఆ కమలాలపై నిలబడి సాగిపోతున్నాడు.

ఇంకోసారి భయంకరమైన పులి గర్జిస్తూ వచ్చి శైవలినిని నోటకరచుకుంది. చంద్రశేఖర్ ఓ పుష్పాన్ని పులిపై విసిరాడు. వెంటనే పులి తల తెగిపడింది.

ఆ రాత్రి శైవలిని మొదట తను మరణిస్తున్నట్లు భావించింది. నల్లటి విశాలమైన కారుమేఘాలు, మెరుపులతో కూడి శైవలిని కేశాలు బిగించిపట్టి ఈడ్చుకు పోసాగాయి. ఆకాశంలో విహరించే అప్సరసలు, కిన్నెరలు మేఘాల మాటు నుండి ముఖాలు పైకెత్తి శైవలినిని చూసి నవ్వసాగారు. ఆకాశంలో జ్యోతిర్మయి దేవతలు బంగారు మేఘాలనెక్కి, బంగారు మెరుపుల నగలు ధరించి, నల్లటి ముంగురులతో నిండిన ముఖాలతో విహరిస్తున్నారు. పాపిష్ఠురాలైన శైవలిని దేహాన్ని స్పృశించి కదిలిపోయే గాలి వారికి తగిలి వారి శరీర కాంతి ఆరిపోతోంది.

ఆకాశంలో విహరించే చీకటి వంటి శరీరధారులైన భైరవీలు, రాక్షసినులు, నల్లని మేఘాలపై నిలిచి, తుఫానులో కేళీ విలాసాలు సాగిస్తున్నారు. దుర్గంధపూరిత శైవలిని శవాన్ని చూసి వాళ్ల నోళ్ళనుండి లాలాజలం కారుతోంది. హుంకరిస్తూ ముందుకు వచ్చి ఆమెను పీక్కు తినటానికి ప్రయత్నిస్తున్నారు.

అక్కడ ఎన్నో దేవతా విమానాలు విహరిస్తున్నాయి. శైవలిని పాపపునీడ తమపై బడి ఆమె పాపం నశించి పోతుందేమోనన్నట్టు ఆమె శవాన్ని తప్పుకొని దూర దూరంగా వెళ్ళిపోతున్నాయి.

ఆమె ఇంకా చూసింది. నక్షత్ర సుందరీ మణులు తమ చిన్నచిన్న ముఖాల్ని బయటవుంచి ప్రకాశం వెదజల్లే చేతివేళ్లతో శైవలిని శవాన్ని చూపుతూ "సోదరీ చూడు! మనిషి అన్నిజీవుల కంటే పాపాత్ముడు" అంది. విన్న ఆ సుందరి కంపితురాలై కళ్ళు మూసుకుంది. మరో సుందరి "పాపిష్ఠి" శబ్దం విని భయంతో కాంతివిహీనురాలవుతోంది.

పిశాచాలు- శైవలినిని పైకి లాక్కుపోతున్నాయి. మేఘాల్ని, నక్షత్రాల్ని అతిక్రమించి పైపైకి పోతున్నాయి. అవి శైవలినిని తీసుకుపోయినచోట అంధకారంతో, చల్లదనంతో నిండివుంది. మేఘాలు లేవు. తారకలు లేవు. వెలుగులేదు. గాలిలేదు. శబ్దంలేదు. కానీ వెనక చాలాదూరం నుండి గరగరమనే భయంకర శబ్దం వినిపిస్తోంది. ఆ శబ్దం వేల సముద్రాలు ఘోషిస్తున్నట్లుగా వుంది.

పిశాచాలు "నరకలోక శబ్ద ఘోషలు వినిపిస్తున్నాయా? " అంటూ శైవలినిని ఒక్క తన్ను తన్ని అక్కడ్నుంచి కిందకు పడదోశాయి. శైవలిని చక్రంలా తిరుగుతూ, తిరుగుతూ కిందకు జారిపోతోంది. మెల్లగా తిరిగే ఆమె శరీరం వేగం పెంచుకుంది. ఆమె ముక్కు నుండి, నోటి నుండి రక్తం కారుతోంది. మెల్లమెల్లగా నరక ఘోషను సమీపించసాగింది.

హఠాత్తుగా స్మృతితో మరణించిన శైవలిని కళ్ళతో నరకాన్ని వీక్షించసాగింది. కొంతసేపటికి కళ్ళు కనబడకుండా, చెవులు వినబడకుండా అయ్యాయి.

మనస్సులో చంద్రశేఖర్‌ను ధ్యానిస్తూ పిలువసాగింది "ఓ స్వామీ! మీరెక్కడ? ఎక్కడున్నారు ప్రభూ! స్త్రీ జాతిని రక్షించే వారు, పూజనీయులు.. సర్వమంగళమ

యులైన ఓ స్వామీ! మీరెక్కడ? మీ శ్రీచరణాలకు లక్షల ప్రణతులు. కాపాడండి. మీరు రక్షించకపోతే ఏ దేవుడూ నన్ను కాపాడలేడు. కాపాడండి స్వామీ! మీరు ప్రసన్నులై నా శిరసుపై మీ దివ్యచరణాలుంచితే తప్ప నేనీ నరకం నుండి విముక్తురాలిని కాలేను" అని.

అప్పుడు ఆ తుపాను భీభత్సం.. అంతా పోయి శైవలినికి స్మృతి రాసాగింది. ఎవరో తనని ఒడిలోకి తీసుకున్నారు. ఆ శరీర స్పర్శ.. అందులోని.. సువాసనలు.. నలుదిశలా వ్యాపించాయి. భయంకర నరకఘోషలు అంతరించాయి. దుర్గంధం స్థానంలో మల్లెల సుగంధాలు వ్యాపించాయి. ఆమెలో వినికిడి శక్తి వచ్చింది. కళ్ళు ప్రకృతిని వీక్షించసాగాయి. అకస్మాత్తుగా యిది మరణం కాదు.. యథార్థం అనే భావన కలిగింది. ఆమెలోని అపస్మారకం దూరమైంది.

కళ్ళు తెరిచి చూసింది. గుహలోకి ప్రకాశమొస్తోంది. బయట పక్షుల కలరవాలు! కానీ ఇదేమిటి? ఎవరి ఒడిలో తన శిరస్సుంది? ఆమె తలపై ఎవరిదో ముఖముంది. ఆకాశంలో ఉదయించిన పూర్ణ చంద్రునిలా ప్రభాతవేళ వెలుగునిస్తోంది. శైవలిని అతనెవరో గుర్తించింది. బ్రహ్మచారి రూపంలో చంద్రశేఖర్ అనుకుంది.

★ ★ ★

"శైవలినీ!" పిలిచాడు చంద్రశేఖర్.

శైవలిని ఒడి నుండి లేచి కూర్చుని ఆయన ముఖం వైపు చూసింది. తర్వాత ఆయన చరణాలపై శిరస్సుంచింది. చంద్రశేఖర్ ఆమెను లేవనెత్తి కూర్చోబెట్టాడు.

శైవలిని ఏడుస్తోంది. ఏడుస్తూనే మళ్ళీ ఆయన పాదాలపై బడింది.

కొంతసేపటికి "స్వామీ! ఇప్పుడు నా పరిస్థితేమిటి? " అడిగింది.

"నువ్వెందుకు నన్ను చూడాలనుకున్నావు? " చంద్రశేఖర్ అడిగాడు.

శైవలిని కళ్ళుతుడుచుకుని స్వస్థతనొంది "నాకు తెలిసినంతవరకు నా జీవితం ఇక కొన్నిరోజులు మాత్రమే" అంది.

స్వప్నంలోని ఘటనలు స్మృతికొచ్చి భయంతో కొన్ని క్షణాలు మౌనం వహించి- "నేను కొన్నిరోజులే జీవిస్తాను. మరణించే ముందు మీ దర్శనం కావాలనుకున్నాను, దీన్నెవరు విశ్వసిస్తారు? పతితురాలై, భర్తను పరిత్యజించి వెళ్ళినదానికి తిరిగి పతిని దర్శించే అవసరమేముంటుంది? " అని దీనంగా నవ్వింది.

"శైవలినీ! నీ మాటపై నాకెప్పుడూ అవిశ్వాసం లేదు. నాకు తెలుసు ఆ ఇంగ్లీషువాడు నిన్ను బలవంతంగా చెరబట్టాడని" అన్నాడు చంద్రశేఖర్.

"అదసత్యం. నా యిష్టప్రకారమే పాస్టర్‌తో వెళ్ళాను. అతడు నన్ను లేవనెత్తుకుపోకపూర్వమే నా దగ్గరకు మనిషిని పంపాడు" అంది శైవలిని.

చంద్రశేఖర్ తలొంచుకున్నాడు. మెల్లగా ఆమెను పడుకోబెట్టి- శిరసెత్తి ఆకాశంవైపు చూస్తూ కోమలస్వరంతో "శైవలినీ! పన్నెండేళ్ల దీక్ష వహించి ప్రాయశ్చిత్తం చేసుకో! జీవించి వుంటే తిరిగి కలుసుకుందాం! ఇప్పటికింతే" అంటూ లేవబోయాడు.

శైవలిని చేతులు జోడించి "స్వామీ! కొద్దిసేపు కూర్చోండి. నా భాగ్యంలో ప్రాయశ్చిత్తం లేదు" అంది. మళ్ళీ అదే స్వప్నం ఆమెకు గుర్తు రాసాగింది.

చంద్రశేఖర్ కూర్చున్నాడు.

"ఆత్మహత్య పాపమెందుకు? " ఏకదీక్షగా ఆయన్నే చూస్తూ అడిగింది.

ఆయన ముఖం వాడినట్లయింది.

"మరణించ తలచావా? "

శైవలిని వణికిపోతూ "లేకపోతే, ఆ ఘోర నరకంలో పడిపోతా" అంది.

"ప్రాయశ్చిత్తం నరక విముక్తికే కదా!"

"ఈ మానసిక నరకం నుండి ముక్తి ఎలా లభిస్తుంది? "

## కొత్తగాలి...

**'కో' అంటే**
**కొండమీది కోతి కూడా దిగదు!**
**'ఓ' అంటే మాత్రం**
**కొండా, కోనా పలుకుతుంది!**

– కె. ఎన్నార్ నమ్మి,
మార్టేరు, ప.గో. జిల్లా

"అదేమిటి? "

"ఈ పర్వతం పైకి దేవతలు వస్తారు. వాళ్ళు నన్నేంచేశారో చెప్పలేను. కానీ నేను రాత్రింబవళ్ళు నరకాన్ని చవిచూశాను" గుహలోకి చూస్తూ అందామె.

శైవలిని గుహలోకి చూస్తుండటాన్ని చంద్రశేఖర్ గమనించాడు. ఆమె చూపులు చాలాదూరం చూస్తున్నాయి. ఆమె ముఖం వాడిపోయింది. కళ్ళు విశాలమవుతున్నాయి. శరీరం వణుకుతోంది.

"శైవలినీ! తదేకంగా గుహలో ఏం చూస్తున్నావు? "

శైవలిని సమాధానం చెప్పలేదు. అలాగే చూస్తోంది. ఏమీ అర్థం కాలేదు.

అకస్మాత్తుగా ఆమె అరవటం మొదలెట్టింది. "స్వామీ! కాపాడు! మీరు కాకపోతే నన్నెవరు కరుణిస్తారు? " అంటూ మూర్ఛితురాలై నేలకు ఒరిగిపోయింది.

చంద్రశేఖర్ గుహ బయటవున్న కాలువ నుండి నీరు తెచ్చి ఆమె ముఖంపై చిలకరించి, తన ఉత్తరీయంతో విసర సాగాడు.

కొంత సమయానికి తెలివి వచ్చి లేచి కూర్చుందామె.. కానీ రోదించసాగింది.

"ఏం చూశావు? " చంద్రశేఖర్ అడిగాడు.

"అదే నరకాన్ని" ఏడుస్తూనే చెప్పింది.

ఆమె జీవించి వుండి నరకాన్ని చూస్తోందని గ్రహించాడు చంద్రశేఖర్.

ఓ క్షణం తరువాత శైవలిని దుఃఖమాపి "నేను చావలేను. భయంకర నరకభయం పట్టుకుంది. చస్తే నరకానికి పోతాను. కనుక ఎలాగైనా బతకాలి. కానీ ఒంటరిని. పన్నెండేళ్ళు ఎలా జీవించాలి? స్మృతిలో, విస్మృతిలో కూడా నాకు నరకమే గోచరమవుతోంది" అంది.

"భయంలేదు. ఉపవాసం, మానసిక చింత వలన ఈ స్థితి వుంది. వైద్యుల పరిభాషలో ఇది వాయురోగం. వేదగ్రామం వెళ్ళి ఊరిబయట కుటీరం ఏర్పాటు చేసుకో! సుందరి నీకు కావాలిసిన ఏర్పాట్లు చేస్తుంది" అన్నాడు చంద్రశేఖర్.

శైవలిని కళ్ళు మూసుకుంది. గుహలో సుందరి కనిపించింది. ఆమె ఆకారం చాల పెద్దదిగా వుంది. చూస్తుండగానే తాటిచెట్టంత పెరిగింది. భయంకరంగా వుంది. ఆ గుహే మళ్ళీ నరకంగా మారిపోయింది. అదే దుర్గంధం.. భయంకర అగ్నిజ్వాలలు.. అదే వేడి.. అవే ఘోషలు.. అవే కీటకాలు! ఆకాశమంతా అదే అంధకారం.. ఆమె చూసింది.. పిశాచాలు యినుప కీలలతో కూడిన తాళ్ళను మెలిపెట్టి.. తేళ్ళతో కూడిన లాఠీలు ధరించి.. ఆమెను హింసిస్తూ తీసుకుపోతున్నారు. తాళ ప్రమాణ సుందరి అంటోంది "నేనీమెను వారించాను. అయినా వినలేదు. అందుకే మీ శక్తి కొద్దీ కొట్టండి. ఈమె పాపానికి నేనే సాక్షిని! కొట్టండి.. బాగా కొట్టండి"

శైవలిని శిరసెత్తి చేతులు జోడించి.. కన్నీళ్ళు కారుతుండగా.. సుందరిని ప్రార్థిస్తోంది. కానీ సుందరి వినడం లేదు. పైగా "కొట్టండి.. కొట్టండి" అంటోంది.

శైవలిని చూపు గుహలోనే స్తంభించిపోయింది. చంద్రశేఖర్ విచారగ్రస్తుడయ్యాడు. ఆమె లక్షణాలు ఆరోగ్యకరంగా లేవనుకున్నాడు.

"శైవలినీ! నా వెంట రా!" అన్నాడు ఆయన లేచి.

శైవలిని వినిపించుకోలేదు. చంద్రశేఖర్ ఆమె భుజం తడుతూ..."శైవలినీ! శైవలినీ!" అంటూ బిగ్గరగా పిలిచాడు.

శైవలిని "ఊ!" అంది.

"లే.. లేచి నాతో రా!" అన్నాడు.

శైవలిని లేచి నిలబడింది. అత్యంత భయంతో "పదండి! పదండి! ఇక్కడ నుండి పోదాం!" అంటూ ఆలస్యం చేయకుండా గుహ బయటకు పరుగెత్తింది. చంద్రశేఖర్ వస్తున్నాడా? లేడా? అని కూడా చూడకుండా పోతూ మసకచీకట్లో రాయి తగిలి పడిపోయింది.

ఆమె మళ్ళీ మూర్ఛితురాలైనట్లు చంద్రశేఖర్ గ్రహించాడు. మెల్లగా ఆమె నెత్తుకుని కిందకు దిగుతూ ఓ జలపాతం వద్దకు తెచ్చి చల్లని నీరు ఆమె ముఖంపై చల్లాడు. బయటి వాతావరణం.. స్వచ్ఛమైన గాలి తగలడంతో ఆమె కళ్ళు విప్పింది. "నేనెక్కడున్నాను? " అడిగింది

"నిన్ను గుహ బయటకు తీసుకొచ్చా"

శైవలిని భయంగా "మీరెవరు? " అంది.

చంద్రశేఖర్ భీతిల్లాడు.

"ఎందుకు ఈ విధంగా ప్రవర్తిస్తున్నావు? నేను నీ భర్తను గుర్తించలేదా? "

శైవలిని "అవును! గుర్తించా!" నవ్వుతూ "నా భర్త స్వర్ణభృంగుడు. స్వర్ణకుసుమాల పై విహరిస్తాడు. నువ్వు నన్ను కాటువేయడానికి వచ్చావు. మార్గం తప్పి వచ్చావు. నువ్వు లారెన్స్ పాస్టర్‌వు" అంది.

చంద్రశేఖర్ అనుకున్నాడు. 'ఏ దేవీ కటాక్షంతో ఈమె దేహం ఇంత అందంగా ఉందో? అయితే ఈమె శరీరం త్యజించబోతోంది. భయంకర ఉన్మాదం ఈమె పై ప్రభావం చూపుతోంది' కొంత సమయం పిదప మృదుస్వరంతో ప్రేమగా " శైవలినీ!" అంటూ పిలిచాడు.

శైవలిని నవ్వుతూ "శైవలిని ఎవరు? అవును! శైవలిని అనే ఓ బాలిక వుండేది. అవును మరో బాలుడు. అతని పేరు ప్రతాప్. ఓ రోజు రాత్రి అతడు సర్పమై అడివిలోకి పోయాడు. బాలిక కప్పగా మారి అడివిలోకి పోయింది. ఆ సర్పం కప్పను మింగేసింది. నేను నా కళ్ళతో చూస్తున్నాను. అవును మీరు లారెన్స్ పాస్టరా? " అంది.

చంద్రశేఖర్ ఏడుపు గొంతుతో దీనంగా "గురుదేవా! ఇదేం గతి? " అని అరిచాడు.

శైవలిని పాటందుకుంది.

"ఓ నెచ్చెలీ! ఓ ప్రాణసఖీ!
మానసచోరుడ్ని పట్టుకున్నావు..
ప్రేమ సముద్రంలో మునకవేశావు..
ఇరు తటులు నిండి పోయావు"
పాట ఆపేసింది.

మళ్లీ ఆమే "హృదయ చోరుడెవరు? చంద్రశేఖరా? పట్టుకున్న దెవరిని? చంద్రశేఖర్‌నా? మునిగిందెవరు? చంద్రశేఖర్‌రా? రెండు తీరాలెవరు? నాకు తెలియదు.. తెలియదు" అంటూ ఒకటికొకటి పొంతన లేకుండా మాట్లాడుతూనే శైవలిని చిరుతలా లంఘించి చంద్రశేఖర్ మెడను పట్టుకు వేలాడుతూ ఏడవసాగింది. ఆమె కన్నీళ్ళలో అతని వీపు.. వక్షస్థలం.. భుజాలు.. దుస్తులు.. చేతులు.. అన్నీ తడిశాయి. చంద్రశేఖర్ ఆమెతో బాటు రోదించసాగాడు.

శైవలిని ఏడుస్తూనే.. "నేను మీతో వస్తాను" అంది.

చంద్రశేఖర్ "పద" అన్నాడు నడుస్తూ.

"నన్ను కొట్టవు కదూ? " హృదయవిదారకంగా అడిగింది.

"లేదు నిన్నేమనను!" అంటూ నిట్టూర్పు విడిచి, చంద్రశేఖర్ నడిచాడు.

పిచ్చి శైవలిని.. నవ్వుతూ.. రోదిస్తూ.. పాడుతూ.. అనుసరించింది అతన్ని.

★ ★ ★

ఆంగ్లేయుల పడవలన్నీ ముర్షీదాబాదు చేరుకున్నాయి. మీర్‌ఖాసీం ఆజ్ఞాపించిన అధికారి మహ్మద్‌తకీకి పడవలో అమి

యట్ చేరుకున్న సమాచారం అందింది.

మహ్మద్‌తకీ శిష్ట మండలితో వెళ్ళి అమియట్‌ను దర్శించాడు. అమియట్ సంతృప్తి చెందాడు. అమియట్‌ను తన నివాసానికి విందుకు ఆహ్వానించాడు తకీ.

ఆ ఆహ్వానాన్ని అమియట్ అప్రసన్నంగానే స్వీకరించాడు. మహ్మద్‌తకీ ఆంగ్లేయుల పడవలు తీరం వదిలి వెళ్ళకుండా రక్షణ దళాల్ని కాపలా వుంచాడు.

మహ్మద్‌తకీ వెళ్ళిపోయింతర్వాత అతని ఆహ్వానంపై ఆంగ్లేయాధికారులు వెళ్ళాలా? వద్దా? అని ఆలోచించారు.

గ్లాస్టన్, జాన్సన్‌లిద్దరూ "భయమంటే ఏమిటో ఆంగ్లేయులకు తెలియదు. తప్పకుండా మనం వెళ్ళాల్సిందే" అంటూ తమ అభిప్రాయం చెప్పారు.

అమియట్ "మనం వీళ్ళతో యుద్ధం చేయబోతూ కూడా ఆతిథ్యానికి వెళ్ళి తినడం, తాగడం ఎందుకు? " అనుకుని ఆతిథ్యానికి వెళ్ళకూడదని నిర్ణయించాడు.

ఓ నావపైన దలినీ బేగం, కులుసూమ్‌లను బంధించి సురక్షితంగా వుంచారు ఆంగ్లేయులు. ఆ నావలో వారికి కూడా విందు ఆహ్వానం సంగతి తెలిసింది. దలినీ, కులుసూమ్ లిద్దరూ చెవుల్లో గుసగుసలాడుకోసాగారు.

"కులుసూమ్! విన్నావా? మన విడుదల వేళ సమీపించింది" అంది దలినీ.

"ఎట్లా? "

"నీకేమీ అర్థమే కాదు. ఎవరైతే నవాబు భార్యను బంధించి తెచ్చారో వాళ్లకు గౌరవంగా నవాబు నుండి విందు ఇవ్వబోతున్నారట. దీని వెనక పెద్ద రహస్యమే ఉంటుంది. ఈ రోజు ఆంగ్లేయులు మరణించారనుకో.." అంది దలినీ.

"దానివల్ల నీకు సంతోషం కలుగుతోందా? " అడిగింది కులుసూమ్.

"అవును! రక్తం ప్రవహించడమే మంచిది. మనల్ని కారణం లేకుండా బంధించారు. వారి మరణంతో మన విడుదల జరుగుతుంటే సంతోషం కలగదా? "

"విడుదల గురించి మీరెందుకు తల్లడిల్లుతున్నారు? మనల్ని ఆపటం తప్ప వారే మీ యితరత్రా ఆలోచించటం లేదు. మనపై అత్యాచారం చెయ్యలేదు. కేవలం ఆపారు. మనం స్త్రీలం. ఎక్కడైనా మనల్ని ఆపేస్తారు" అంది కులుసూమ్.

ఆమె మాటలు దలినీకి నచ్చలేదు.

"నా రాణివాసంలో ఉంటే నేను రాణిని. ఇక్కడ ఆంగ్లేయుల నౌకపైన నేను దాసీదాన్నే. వాళ్లతో సంభాషించడం నాకిష్టం లేదు. వాళ్లెందుకు మనల్ని బంధించారో చెప్పగలవా? " అడిగింది దలినీ.

"ఇదివరకే చెప్పాను. ముంగేరీలో నవాబు ఆంగ్లేయుల్ని నిరోధించాడు. మనం నవాబుగారి మనుషులం కాబట్టి వాళ్లు ఆపారు. ఒకవేళ అక్కడ ఆంగ్లేయులకు బాధ కలిగితే, వీళ్లు మనల్ని బాధిస్తారు. భయమెందుకు? "

దలినీ ఆమెపై మండిపడుతూ "మీ నవాబుగారు నాకనవసరం, ఈ ఆంగ్లేయుల గొప్పతనం వినవలసిన అవసరం నాకు లేదు. మనను విడిచిపెట్టినా, నువ్వు వీళ్లని వదలి వచ్చేలా లేవు" అంది.

కులుసూమ్ వ్యంగ్యంగా నవ్వి "రాకపోతే నన్ను విడిచి వెళ్తావా? " అడిగింది.

దలినీలో క్రోధం పెరిగింది.

"అయితే నీ ఇష్టం అదేనా!" అంది.

కులుసూమ్ గంభీరంగా "అదృష్టం ఎలా ఉందో నేనెట్లా చెప్పగలను? " అంది.

"సరే అమియట్ నిన్ను రెండు రోజులు ఎందుకు పిలిపించాడో నిజం చెప్పు"

"సత్యమే చెబుతున్నాను. 'మీకేం కష్టం కలగడం లేదు కదా? ఎన్ని రోజులున్నా స్వేచ్ఛగా, హాయిగా ఉండండి' అని చెప్పడానికే! అయినా దేవుడిదయ ఉంటే ఆంగ్లేయులు మనల్ని వదలిపెట్టరు" అంది కులుసూమ్.

కులుసూమ్ చెవిపైని ముసుగును దలినీ పైకి జరిపి "దేవుడు దయతలిస్తే త్వరలో మరణించడం మంచిది" అంది.

"ఆంగ్లేయులు వదిలిపెడితే, మనం నవాబు చేతుల్లో పడిపోతాం. నిన్ను నవాబు క్షమించగలరేమో కానీ నన్ను మాత్రం క్షమించరు. నాకు కచ్చితంగా తెలుసు. అందుకే నాకెక్కడైనా ఆశ్రయం లభిస్తే నేను నవాబు సేవకు రానేరాను" అంది కులుసూమ్.

దలినీ కోపం వదలి ప్రేమతో "నేనెక్కడికీ వెళ్లను. చావదలచుకుంటే, నవాబు పాదాలపై పడతాను" అంది.

★ ★ ★

అమియట్ సైనికులను సిద్ధం చేశాడు.

జాన్సన్ అన్నాడు "రాజధానిలో మనం శక్తిమంతులం కాము. నావల్ని మనం రాజధాని వరకు తీసుకుపోలేం"

"ఏ రోజైనా ఒక్క ఆంగ్లేయుడు దేశం విడిచి దేశీయులకు భయపడి పారిపోతే, ఆ రోజు హిందుస్థాన్‌లో ఆంగ్లేయుల పాలన నిలుస్తుందని భావించలేం. ఇక్కడ నావను విప్పితే, ముస్లింలు మనం భయపడి పారిపోయాం అనుకుంటారు. మరణిస్తే మరణించాం.. నిలబడి కొట్లాడి మరణిద్దాం! అది ఒకందుకు మంచిదవుతుంది. పారిపోవడం సరైందిగాదు. కానీ పాస్టర్ బాధలో ఉన్నాడు. చేత ఆయుధం పట్టలేడు. కొట్లాడి మరణించలేడు. కాబట్టి అతన్ని రెసిడెన్సీకి వెళ్లమని ఆదేశించు. నవాబు బేగం, ఆమె దాసిని అదే నావ ఎక్కించి, ఇద్దరు సిపాయిల్ని రక్షణగా ఇచ్చి పంపించు. యుద్ధం జరిగే స్థానంలో వాళ్లుండడం మంచిది కాదు" అమియట్ నిర్ణయించి జాన్సన్‌తో చెప్పాడు.

సిపాయిలు సిద్ధమై అమియట్ ఆదేశానుసారం అందరూ నావలో దాగి కూర్చున్నారు. యుద్ధపు నావకు రంధ్రాలుంటాయి. ప్రతి సైనికుడు ఒక్కో రంధ్రంలో తుపాకీ నుంచి కూర్చున్నారు.

అమియట్ ఆజ్ఞ వినిపించి జాన్సన్, పాస్టర్‌ను సిద్ధం చేశాడు. ఆ నావపైనే దలినీ, కులుసూమ్‌లను ఎక్కించి రక్షణగా ఇద్దరు సైనికులనిచ్చి నావను వదిలాడు.

నావ వెళ్లటం చూసి ముస్లీం సైనికులు మహ్మద్‌తకీని కలిసి సమాచారమిచ్చారు.

మహ్మద్‌తకీ విషయం విన్నాడు. ఆంగ్లేయుల్ని విందుకు ఆహ్వానించిన సమయం దాటిపోయింది. ఆంగ్లేయుల్ని తీసుకురమ్మని దూతను పంపించాడు.

అమియట్ ఆ దూతతో "కొన్ని కారణాలవల్ల నావను వదిలి రాలేకపోతున్నాం" అని సమాధానం పంపాడు.

దూత నావ దిగి వెళ్లి ఈల వేశాడు.

వెంటనే తుపాకులు పేలాయి. తమ నావపై కాల్పులు జరుగుతున్నాయని అమియట్ గ్రహించాడు. తుపాకీ గుళ్ళు నావకు పలుచోట్ల రంధ్రాలు చేశాయి.

నావలోని సైనికులు రంధ్రాల ద్వారా కాల్పులు జరిపారు.

రెండువైపుల కాల్పులు మొదలయ్యాయి. తీరంపైనివాళ్లు ఇళ్లలోనుంచి కాల్పులు జరుపుతుంటే నావలోనివాళ్లు దాక్కొని జరుపుతున్నారు. మందు గుండు ఖర్చవుతోంది. కానీ ఫలితం ఉండటం లేదు.

అప్పుడు ముసల్మాను సైనికులు కత్తులు కటార్లు చేతబూని ఆంగ్లేయుల నావపై దాడికి పరుగులు తీశారు. నావలోని సైనికులు, అమియట్, జాన్సన్, గ్లాస్టన్ ఒక్కొక్క సైనికుడ్ని గురి చూసి కాలుస్తూ ఇసుకపై పడుకోబెట్టసాగారు.

అల వెనక అల పోటెత్తినట్లు, ముస్లీం సైనికులు ఒకరి వెనుక ఒకరు దాడి చేయసాగారు. నావలోని వారికి చావు తప్ప మరో మార్గం లేకపోవడంతో చావో, రేవో అంటూ తలపడ్డారు.

ముస్లీం సైనికులు నావపైకి ఎక్కసాగారు. ముగ్గురు ఇంగ్లీష్ అధికారులు



రణనాదం చేస్తూ సైనికుల్ని ఎదుర్కొన్నారు. సైనికుల శవాలు ఖండఖండాలుగా తెగి నీటిలో పడుతున్నాయి. నావపై ఎక్కేవారు ఎక్కుతుంటే, కొందరు నావను కింద పగలగొడుతున్నారు. అడుగు భాగం ముక్కలై గలగల మంటూ నావలో నీరు చేరసాగింది.

అమియట్ తనవాళ్లను హెచ్చరిస్తూ "మేకలు, గొర్రెల్లా ఎందుకు మునిగి చావాలి? చేతిలో కత్తి పట్టండి! పోరాడుతూ మరణించండి!" అంటూ ముందుకు నడుపుతున్నాడు.

ముగ్గురూ కత్తులు చేతబట్టి ముస్లీం సైనికుల్ని ఎదిరించారు.

ముస్లీం సైనికులు వారికి అభివాదం చేస్తూ.. "ఎందుకు మరణిస్తారు? మాతో రండి!" అన్నారు.

అమియట్ "పోరాడుతూనే మరణిస్తాం! మా మరణం రేపటికి హిందుస్థాన్‌లో అగ్నిగుండంగా మారుతుంది. ఆ మంటల్లో ముస్లీం రాజ్యాలు మండిపోతాయి. మా రక్తంతో తడిసిన ఈ నేలపై మూడో జార్జి రాజ్యపతాకం రెపరెపలాడుతుంది" అన్నాడు.

"అయితే చావు" అంటూ పఠాన్ సైనికుడు, అమియట్ తలను తెగనరికాడు. అదిచూసి గ్లాస్టన్ తన తలవార్‌తో పఠాన్ శిరస్సు నరికాడు.



పాస్టర్ మూర్ఛితుడై ఉన్నాడు. ప్రాణం పోలేదు. మెదడు గాయపడటంతో అత నికి తెలివి లేదు. చావుబతులకు మధ్య ఉన్నాడు. అమియ ట్‌కు వైద్యం తెలుసు. చికిత్స ప్రారంభిం చాడు. బకావుల్లా చెప్పినట్లు పాస్టర్ నావను రేవుకు తెప్పించి పాస్టర్‌ను ముంగేరి చేర్చాడు అమియట్.

పాస్టర్ ఆయుష్షు గట్టిది. చికిత్స అంద డంతో బతికిపో యాడు. ముర్షీదాబా దులో ముసల్మాను సైనికుల నుండి రక్షిం పబడ్డాడు. కానీ అత డు రోగిగా మిగిలా డు. బలహీనంగా, నిస్తేజంగా ఉన్నాడు. పూర్వపు అహంకారం, బలదర్పాలు లేవు. ప్రాణభయం పట్టుకుంది. మెదడు గాయ పడడంతో బుద్ధినైశిత్యమూ కో ల్పో యాడు.

అమియట్ నుండి సెలవు పొందిన పాస్టర్ వేగంగా నావతో ప్రయాణిస్తు న్నాడు. అతన్ని ముసల్మాను సైనికులు వెం బడిస్తున్నారు. మొద ట కాశింబజార్ రెసిడెన్సీలో ఆశ్రయం పొందాలనుకు న్నారు. కానీ ముస్లీం సైన్యం ముట్టడిస్తే ఎలా? అనుకొని ఆ ఆలోచన మానుకు న్నాడు. అతని ఆలోచన నిజమైంది. ముస్లీం సైనికులు కాశింబజార్ రెసిడెన్సీపై

పదిమంది పఠాన్ సైనికులు గ్లాస్టన్, జాన్సన్‌లను ముట్టడించి గాయపరిచారు. వారి కత్తి దెబ్బలను ఎదిరించలేక గాయ పడి మరణించారు గ్లాస్టన్, జాన్సన్‌లిద్దరు.

అంతకు ముందే పాస్టర్ నావ తాడు విప్పాడు. నావ సాగిపోయింది.

★ ★ ★

రామచరణ్ తుపాకి గుండు తగిలి పాస్టర్ నదిలో పడక ముందే ప్రతాప్ నావ తాడు విప్పుకుని ముందుకు సాగిపో యాడు. వెంటనే ఆయుధ నావలోని సరం గులు కొందరు నీటిలో దూకి పాస్టర్‌ను వెతికి పట్టుకుని నావపైకి తెచ్చాడు. సమా చారం అమియట్‌కు పంపించారు.

అమియట్ వచ్చి చూసేసరికి లారెన్స్

దాడిచేసి దోచుకున్నారు.

పాస్టర్ వెంట వెంటనే కాసింబజార్, పావాస్‌దాంగా, సైదాబాద్, రాంగామాటి ప్రదేశాలను మారుస్తూ వస్తున్నాడు. అయినా ప్రాణభయం అతన్ని వదలడం లేదు. తన వెనక ఏ నావ వచ్చినా అది ముసల్మాన్ సైనికులదని భయపడుతున్నాడు. ఒక చిన్న నావ మాత్రం అతన్ని విడవకుండా వెన్నంటి వస్తోంది.

తన్ను రక్షించుకునే ఉపాయం ఆలోచించసాగాడతను. బుద్ధిభ్రాంతి వల్ల అనేక రకాల ఆలోచనలు చుట్టుముడుతున్నాయి. ఒకసారి నావ విడిచి తీరంపై పారిపోదామనుకున్నాడు. మళ్లీ శక్తిహీనుడ్ని పరుగెత్తగలనా? అనుకున్నాడు. ఒకసారి నీటిలో మునిగి కనిపించకుండా ఈదుతూ పారిపోదాం అనుకున్నాడు. కానీ నీళ్లలో మునిగి ఈదటం తనకు సాధ్యం కాదు. ఈ ఇరువురు స్త్రీలను నీటిలో తోసి నావ బరువు తగ్గించాలనుకున్నాడు. అప్పుడు నావ వేగంగా వెళ్తుందనుకున్నాడు.

అకస్మాత్తుగా అతనిలో ఓ దుర్బుద్ధి పుట్టింది. 'ఈ స్త్రీల గురించే ముసల్మాను సైనికులు వెన్నంటి వస్తున్నారేమో? అవును అదే సత్యం! ఎందుకంటే ఈ దలినీబేగం నవాబుగారి భార్య అని వినియున్నాడు. బేగం కోసమే నవాబు సైనికులు నావపై దాడికి పూనుకున్నారు. ఈమెను వదిలేస్తే ఏ సమస్య ఉండదు' అని ఆలోచించి దలినీని పిలిపించాడు.

పాస్టర్ దలినీతో "అమ్మా! ఓ చిన్న పడవ మన నావ వెనక వెనక వస్తోంది చూశావా? " అడిగాడు.

"అవును..! " అంది దలినీ.

"అది మీ మనుషుల పడవ అయి ఉంటుంది. మిమ్మల్ని విడిపించాలని వెంబడిస్తోంది" అన్నాడు పాస్టర్. ఈ విధంగా ఆలోచించడంలో పాస్టర్‌కు మరో కారణమేమీ లేదు. అతని బుద్ధి దెబ్బ తింది. అతడు రజ్జు సర్పభ్రాంతుడైనాడు.

దలినీ కూడా ఆలోచించలేదు. ఆలోచిస్తే విషయం తెలిసేది. ఆశలో గుడ్డివారై యథార్థం ఆలోచించరు. దలినీ ఆ దశలో అతడు చెప్పింది నిజమే అనుకుంది.

"మమ్మల్ని ఆ నావ ఎక్కించండి. మీకు చాలా ధనమిస్తా" అంది దలినీ.

"అది నావల్ల కాదు. నా నావ వాళ్లకు చిక్కితే నన్ను చంపేస్తారు"

"నేను వారిని వారిస్తాను"

"అమ్మా! వారు నీ మాట వినరు. మీ దేశంలో స్త్రీల మాటల్ని లెక్కచేయరు. పట్టించుకోరు కూడా" అన్నాడు పాస్టర్.

దలినీ వ్యాకులతతో బుద్ధిని పోగొట్టుకుంది. మంచి చెడ్డలు ఆలోచించలేదు. అది తమ పడవ కాకపోతే? అనే ఆలోచనే ఆమెకు రాలేదు. వ్యాకులతతో తనను తాను ఆపదలోకి నెట్టుకుంది.

"మమ్మల్ని తీరంపై దించి మీరు వెళ్ళిపోండి" అంది దలినీ.

పాస్టర్ సంతోషంగా అంగీకరించాడు. నావను ఒడ్డుకు చేర్చమని ఆదేశించాడు.

"నేను నావ దిగను. నవాబు చేతికి చిక్కితే, నాగతి ఏమవుతుందో తెలియదు. నేను ఈ ఆంగ్లేయుని వెంట కలకత్తా వెళ్ళిపోతాను. అక్కడ నాకు తెలిసినవాళ్ళున్నారు. నేను రాను" అంది కులుసూమ్.

"నీకొచ్చే కష్టం ఏమీలేదు. నేను బతికుంటే నిన్ను బతికిస్తాను" దిగమని బతిమిలాడింది దలినీ.

కులుసూమ్ ససేమిరా అంగీకరించలేదు. దలినీ చాలారకాలుగా చెప్పింది. అయినా ఆమె రాజీకి రాలేదు.

"ఎవరికి తెలుసు? నీ కోసం ఆ నావ మళ్ళీ మా వెంటపడితే? దిగు దిగు..!" అన్నాడు పాస్టర్.

"ఒకవేళ ఆ నావ మీ వెంట వస్తే అప్పుడే దిగిపోతాను" వేడుకుంది కులుసూమ్.

పాస్టర్ మరేం చెప్పలేకపోయాడు.

కులుసూమ్ రానందుకు దలినీ దుఃఖిస్తూ ఒక్కతే నావ దిగింది. పాస్టర్ నావను వేగంగా ముందుకు నడుపుకు పోయాడు.

అప్పుడు సూర్యాస్తమయానికి సమయం తక్కువగా వుంది. పాస్టర్ నావ దృష్టి నుండి దూరమైంది. పాస్టర్‌నావ ముస్లీం సైనికుల నావ అనుకున్న చిన్ననావ దగ్గరకు వచ్చింది. దలినీ తనను తీసుకువెళ్ళటానికి నావ తీరం చేరుతుందని ఆశిస్తోంది. కానీ అది తీరంవైపు రానే లేదు.

వాళ్ళు తనను గమనించలేదని చీరకొంగు పైకి లేపి ఊపసాగింది. అయినా ఆ నావ తీరంవైపు రాకుండానే సాగిపోయింది. అప్పుడు ఆమెపై వజ్రాఘాతమైంది.

అది ముస్లీం సైనికుల పడవని తనెందుకు అనుకున్నట్లు? అది ఇతరులది ఎందుకు కాకూడదు? అది గ్రహింపునకు వచ్చాక ఆమె బిగ్గరగా అరుస్తూ నావవాళ్లని పిలువసాగింది. నావ నిలువలేదు. అయినా ఆమె తీరం వెంట నావ కోసం పరుగులు తీసింది. చాలాదూరం పరుగెత్తినా నావను అందుకోలేకపోయింది.

చీకట్లు ముసురుకోసాగాయి. గంగానదిపై ఏమీ కనబడటంలేదు. కొత్త వరదతో గలగల శబ్దంతో నది ప్రవహిస్తోంది. పెకిలించిన తరువులా నిరాశతో అక్కడే కూలబడిందామె. కొంతసేపు తర్వాత ఇక్కడ కూర్చుంటే లాభమేముంది? అనుకొని మెల్లమెల్లగా పైకి లేచింది. చీకట్లో దారి తెన్ను కానరాక ఒకటి రెండు మార్లు కింద బడి లేచింది కూడా. నక్షత్రకాంతిలో కళ్ళు పొడుచుకు చుట్టూరా పరికించి చూసింది. ఎక్కడా వెలుగు జాడలేదు. దగ్గరలో గ్రామమేదీ ఉన్నట్లు తోచడంలేదు. ఎదురుగా విశాలంగా మైదానముంది. దూరంగా గలగల పారుతున్న నది తప్ప మరేంలేదు. మనుషుల జాడ అసలే లేదు. చెట్లు, చేమ కూడా లేవు. కుక్కల, నక్కల అరుపులు అప్పుడప్పుడు వినిపిస్తున్నాయి. నదిలో ఆకాశంలోని చుక్కలు మెరుస్తున్నాయి.

దలినీ మరణించాలనుకొంది.

నిర్జన మైదానంలో, నదికి దూరంగా కూర్చుండిపోయింది. మిడతల సంగీతం వినిపిస్తోంది. రాత్రి పెరిగిపోతూ చీకటి దట్టమవుతోంది. రెండో యామం ప్రవేశించింది. దలినీ భయంభయంగా మైదానం వైపు చూస్తోంది.

ఎవరో మనిషి నడిచి వస్తున్నట్లు ముందు అస్పష్టంగా కనిపించింది. కొద్ది సమయంలో ఓ ఆజానుబాహువు వచ్చి ఏకంగా దలినీకి సమీపంలో కూర్చున్నాడు.

అతడే ఆ అజానుబాహువే శైవలినిని రెండు చేతులా ఎత్తుకొని గిరిశిఖరంపైకి చేర్చినవాడు.




**ముం**గేరి ప్రాంతంలోని అతి సుందరమైన ఓ భవనంలో రూప్‌చంద్, మహితాబ్ చుడ్ (జగత్‌సేఠ్) అనే ఇద్దరు సోదరులు నివాసముంటున్నారు.

ఆ రోజురాత్రి వారి భవనమంతా వేల దీపకాంతులతో శోభాయమానంగా వుంది. పాలరాయితో నిర్మించిన శీతల మండపం.. దానికి పొదిగిన మణిమాణిక్యాలపై దీపకాంతులు ప్రసరించి మెరుస్తున్నాయి.

వజ్రాలు పొదిగిన కంఠహారాలు, ముత్యాల సరాలు నర్తకుల మెడల్లో తళుకు లీనుతున్నాయి. వారి మధ్య శరీరమంతా రకరకాల నగలు ధరించిన ఓ నర్తకి

## కొత్తగాలి...

**రాత్రిపూట**
**ఆకాశంలో కనిపించేవి**
**తారలు కావు**
**ఆమె నవ్వులు!**

– అలజంగి మురళీధరరావు,
పాడేరు, విశాఖ జిల్లా

వుంది. ఆమె గాయని కూడా. మధురమైన గానం చేస్తోంది. కానీ ఆ గానం సేఠ్‌జీల హృదయాల్లో ప్రవేశించటం లేదు.

ఆ సమయంలో బెంగాల్‌లో యుద్ధమేఘాలు కమ్ముకున్నాయి. కలకత్తా నుండి ఆదేశం పొందటానికి పూర్వమే పాట్నాలోని గిడ్డంగి కంపెనీ అధికారి ఎలీసా సాహెబ్ పాట్నాఖిల్లాపై దాడిచేసి ఖిల్లాను స్వాధీనపరచుకున్నాడు. అయితే ముంగేరిలోని ముస్లీం సైన్యం, పాట్నాలోని ముస్లీం సేనకు తోడుగా నిలిచి పాట్నాఖిల్లాను తిరిగి స్వాధీనం చేసుకొని నవాబు మీర్‌ఖాశింకు అప్పగించారు. పాట్నాలోని ఆంగ్లేయాధికారుల్ని బంధించి ముంగేరీ కోటకు తీసుకువచ్చారు.

పైన పేర్కొన్న గానాబజానా గురుగన్‌ఖాన్‌తో చర్చలు జరపటానికి రూపచంద్, మహతాబ్‌చంద్ సేఠ్లు ఏర్పాటుచేసిందే! పార్టీ కేవలం సాకు మాత్రమే! అందులో పాల్గొంటున్న వారెవ్వరూ, ఆ గాయని పాటల్ని, సంగీతాన్ని వినడం లేదు. కేవలం వాటి కోసమే సంగీత కార్యక్రమాలు ఎవరేర్పాటు చేసుకుంటారు?

గురుగన్‌ఖాన్ కోరిక నెరవేరింది. రెండుపక్షాలు యుద్ధం చేసి బలహీనమైతే, వాళ్లిద్దర్ని తాను జయిస్తాడు. బెంగాల్‌కు నవాబు కాగలుగుతాడు. ఈ కోరిక నెరవేరడానికి మొదటిమెట్టు సైన్యం మొత్తం తన చేతిలో వుండాలి! ధనం లేకుండా సైన్యం చేతిలో వుండదు. అందుకే సేఠ్‌జీలతో మంత్రాంగం నడుపుతున్నాడు.

ఈ విషయంలో నవాబు ఖాశింఖాన్ కూడా తెలివిగలవాడే. రూప్‌చంద్, మహతాబ్‌చంద్‌లు అపర కుబేరులు. వీరు ఏ పక్షం వహిస్తే ఆ పక్షానికే విజయం!

మహతాబ్‌చంద్ (జగత్‌సేఠ్) మనసులో వ్యవహారం బాగుండాలనుకుంటాడు. కానీ నవాబు వ్యవహారం బాగుండలేదు. అనుమానంతో ఈ వర్తకులను ముంగేరీలో గృహబందీలను చేశాడు. అవకాశం దొరికితే వారు శత్రువులతో చేతులు కలుపుతారు. సేఠ్లకు ఈ విషయాలన్నీ అవగతమే. భయంతో వారు మీర్‌ఖాశింకు వ్యతిరేకంగా మెలగడంలేదు. తప్పించుకునేందుకే ప్రస్తుతం గురుగన్‌ఖాన్‌తో చేయి కలిపారు. అందరి వుద్దేశం ఒకటే మీర్‌ఖాశిం నాశనం కావాలి.

కారణం లేకుండా గురుగన్‌ఖాన్ జగత్‌సేఠ్‌తో కలిస్తే నవాబు సందేహిస్తాడు. అందుకే జగత్‌సేఠ్ ఈ గానాబజానా పెట్టాడు. రాజులు, అధికారులు, మంత్రులకు అందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి.

గురుగన్‌ఖాన్ కూడా నవాబు ఆజ్ఞతోనే పాల్గొంటున్నాడు. కానీ అందరితో కాక విడిగా ప్రత్యేకంగా కూర్చున్నాడు. జగత్‌సేఠ్ మిగతా అందరి వద్దకి వెళ్ళి ముచ్చటించినట్లే గురుగన్‌ఖాన్‌తో ముచ్చట ప్రారంభించాడు. కానీ ఆ సంభాషణ అంతా నర్మగర్భంగా సాగుతోంది.

"మీ అందరితో కలిసి నేను ఓ కంపెనీ ఏర్పాటు చేయాలనుకుంటున్నా. మీరు భాగస్వాములు కాగలరా? " గురుగన్‌ఖాన్ సంభాషణ ప్రారంభిస్తూ అడిగాడు.

"ఎందుకోసం? " మహతాబ్‌చంద్ ఉత్సుకతతో అడిగాడు.

"ముంగేరీ పెద్దకంపెనీ మూసేందుకు"

"ఒప్పుకుంటున్నాం. కొత్తగా ప్రయత్నం

చేయకపోతే ఇతరత్రా మార్గం ఉండదు"

"మీరొప్పుకుంటే, కంపెనీ ఏర్పాటుకు కావలిసిన ధనసహాయం మీరే అందించాలి. శారీరక వనరులు నేను చూసుకుంటాను" అన్నాడు గురుగన్‌ఖాన్.

ఇంతలో నాట్యకత్తె మనియాబాయి సేఠ్ దగ్గరికి వచ్చి "ఏం పాట పాడమంటారు? " అని అడిగింది.

"నీ యిష్టం! నీకు నచ్చింది పాడు" ఆదేశించాడు సేఠ్ నవ్వుతూ.

మనియాబాయి వెళ్ళి కేదార్, హమీర్, రాగాలాపనలో గానం ప్రారంభించింది.

జగత్‌సేఠ్ గురుగన్‌ఖాన్‌తో "మా ధనం అసలు, వడ్డీ తిరిగి రాకున్నా ఫర్వాలేదు. కార్యసాధన కావాలి" అన్నాడు.

అటు బాయిజీ రాగాలాపనతో మునిగి తేలుతుంటే ఇటు జగత్‌సేఠ్, గురుగన్‌ఖాన్‌లు రూపాయలు, వడ్డీలు, అసలు, ఫాయిదాల సంభాషణలో తమతమ అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు.

చివరకు నిర్ణయం పక్కా అయ్యింది.

మళ్ళీ గురుగన్‌ఖాన్ "మీకు తెలుసా? మరో కొత్తవ్యాపారి మరో కంపెనీ ఏర్పాటు చేస్తున్నారు" అన్నాడు.

"దేశీయుడా? విదేశీయుడా? " మహతాబ్‌చంద్ అడిగాడు.

"దేశీయుడే"

"ఎక్కడ? "

"ముంగేరీ నుండి ముర్షీదాబాద్ వరకు. పర్వతాలు, అడవులు, మైదానాలు వున్న అన్ని ప్రదేశాల్లో"

"పెట్టుబడి ఎంత? " మహతాబ్‌చంద్ అడిగాడు.

"ఎక్కువ ధనం అవసరంలేదు. కానీ అతని వద్ద ఏముంది? ఏం లేదు? తెలియడం లేదు" గురుగన్‌ఖాన్ జవాబిచ్చాడు.

"అతనితో బాటు మరెవరెవరున్నారు? "

"ముంగేరీలోని పెద్దకంపెనీ"

"అతడు హిందువా? ముస్లీమా? "

"హిందువు"

"అతని పేరు తెలుసా? "

'ప్రతాప్‌రాయ్'

"గృహ మెక్కడుంది? "

"ముర్షీదాబాద్ సమీపంలో"

"పేరు తెలుసు. అతను సాధారణ వ్యక్తి అని విన్నాం" అన్నాడు జగత్‌సేఠ్.

"సాధారణం కాదు. చాలా భయంకరమైన వ్యక్తి" గురుగన్‌ఖాన్.

"ఎందుకట అతని ప్రయత్నం? "

"కలకత్తాలోని పెద్దకంపెనీపై ఆగ్రహం ఉందతనికి"

"అతన్ని మనం చేజిక్కించుకోవాలి. అతడు ఎవరి అధీనంలో వున్నాడు? " అడిగాడు మహతాబ్‌చంద్.

"అతనెందుకీ ప్రయత్నంలో వున్నాడు. విషయం పూర్తిగా తెలుసుకోకుండా ఏమీ చెప్పలేం. డబ్బుకాశపడి ఇలా చేస్తే పట్టుకోవటం సులభమే. కానీ విషయం వేరైతే సాధ్యం కాదు"

"మరో కారణం ఏదో అయి వుంటుంది. ప్రతాప్‌రాయ్ అంత పిచ్చివాడా? "

బాయిజీ ఆ సమయంలో పాడుతోంది.. "ఎర్రెర్రని ముఖంపై.. ముక్కెర మెరుస్తోంది.." అంటూ.

"అదేమిటి? ఎవరిదా ఎర్రముఖం? " అన్నాడు మహతాబ్‌చంద్.

★ ★ ★

మహాకాయుడైన ఆ వ్యక్తి వచ్చి దలినీకి సమీపంలో కూర్చున్నాడు. దలినీ దుఃఖిస్తోంది. భయంతో అతన్ని చూస్తూ దుఃఖమాపి కూర్చుండిపోయింది.

అతను కూడ మౌనంగానే వున్నాడు.

గంగా తీరంలో ఇది జరుగుతున్న సమయంలోనే మరోచోట దలినీ సర్వనాశనమయ్యే ప్రయత్నం జరుగుతోంది.

నవాబు నుండి మహమ్మద్ తకీకి రహస్య ఆదేశం చేరింది. ఆంగ్లేయుల పడవలోవున్న దలినీ బేగాన్ని బంధించి ముం

గేరీ కోటకు పంపించాలి.

మహమ్మద్ తకీ ఆలోచించాడు.

నావపైన ఆంగ్లేయులు బందీలైనా, చని పోయినా, నావలోవున్న బేగం తనకు స్వయంగా చిక్కుతుంది. అందువలన సేవకులకు ఆమెను గురించి ప్రత్యేక సమాచారం ఇవ్వాల్సిన అవసరం లేదనుకున్నాడు. కానీ నావపైన వున్న ఆంగ్లేయుల్ని చంపిన తర్వాత నావలో ఎక్కడా బేగం జాడ కనబడలేదు. పెద్ద ఆపదలో చిక్కాననుకున్నాడు. తన అశ్రద్ధ కారణంగానే ఇలా జరిగిందని నవాబు కోపిస్తే? అని మొదట భయపడినా, తర్వాత మనసు స్థిమితపడి నవాబును ఏమార్చాలనుకున్నాడు. ఉపాయం ఆలోచించాడు.

ప్రజల్లో వున్న వదంతుల ప్రకారం, యుద్ధం ప్రారంభంకాగానే ఆంగ్లేయులు మీర్ జాఫర్‌ను జైలు నుండి విడుదల చేసి నవాబు పీఠంపై కూర్చోబెడతారు. ఆంగ్లేయులు గెలిచినా, మీర్‌ఖాశిం తర్వాత మోసం తెలుసుకున్నా తనకు నష్టంలేదు. బతికిపోతే లాభం వుంటుంది. ఒకవేళ మీర్‌ఖాశిం జయించినా, నిజం మాత్రం అతనికి తెలియదు. అని నిశ్చయించుకున్న తకీ, నవాబుకు పంపటానికి ఆ రాత్రే ఓ లేఖ సిద్ధం చేశాడు ఉత్తరంలో అంశాలు, ఇలా వున్నాయి.

"బేగాన్ని అమియట్ నావపైన చూశాను. ఆమెను మర్యాద పూర్వకంగా తెచ్చి కోటలో వుంచాను. నవాబుగారి ఆదేశం ప్రకారం ఆమెను పంపటం జరుగుతుంది. నావపైన బతికి వున్నవారి ద్వారా విన్న విషయమేమంటే ఇంతకాలం బేగం అమియట్ వద్ద సానిగా వుంది. ఇద్దరూ ఒకే పడకపై శయనించేవారు. ఆ విషయం బేగం స్వయంగా అంగీకరించింది. ప్రస్తుతం ఆమె క్రైస్తవ మతం స్వీకరించింది. ముంగేరీ రావడానికి యిష్టపడడంలేదు. వదిలేయమంటోంది. కలకత్తా వెళ్ళి అమియట్ స్నేహితుల వద్ద వుంటాననంటోంది. బలవంతంగా ముంగేరి పంపిస్తే ఆత్మహత్య చేసుకుంటాననంటోంది. ఈ పరిస్థితుల్లో నేనేం చేయాలో ఆదేశించండి.. వేచి చూస్తుంటాను"

అశ్వారోహకుడు అదేరోజు రాత్రి నవాబు గారికి అందించడానికి జాబు తీసుకుని ముంగేరి ప్రయాణమై వెళ్ళాడు.

త్వరలో జరగబోయే అశుభఘటన మనస్సుకు తెలుస్తోంది. ఇది సత్యమో? అసత్యమో? కానీ ఏ రాత్రి అశ్వారోహకుడు, ఉత్తరంతో వెళ్తున్నాడో ఆ సమయంలో దలినీబేగం శరీరం రోమాంచితమైంది.

అదే సమయంలో ఆమె వద్ద కూర్చున్న వ్యక్తి ప్రథమ సంభాషణ ప్రారంభించాడు.

"నీవు నాకు తెలుసు! నీపేరు దలినీ బేగం" అన్నాడు.

దలినీ వణికిపోయింది.

అతడే మళ్ళీ "ఈ నిర్మానుష్య ప్రదేశంలో ఆ దుర్మార్గ ఆంగ్లేయుడు నిన్ను వదిలిపెట్టి వెళ్ళాడు" అన్నాడు.

దలినీ బేగం కళ్ళు జలపాతాలయ్యాయి.

అతడు మళ్ళీ "ప్రస్తుతం నీవెక్కడికి వెళ్ళదలచావు? " అంటూ అడిగాడు.

ఆమె భయం దూరమయింది.

"ఎక్కడికి వెళ్ళను? నాకెక్కడా స్థానం లేదు. ఒకే ఒక్క స్థానం! చాలాదూరంలో వుంది. నన్నెవరు తీసుకెళ్తారు? " అంది.

"నువ్వు ప్రస్తుతం నవాబు దగ్గరకు వెళ్ళే ఆలోచన మానుకో!"

దలినీ ఆశ్చర్యంగా "ఎందుకని? " అంది.

"నీకది అమంగళం కాగలదు" అన్నాడు.

దలినీ వణికిపోతూ "అయితే కానివ్వండి! అక్కడ కాక మరెక్కడా నాకు చోటు లేదు. ఇతరత్రా శుభం జరిగిందాని కంటే, భర్తవద్ద అమర్యాద, అశుభం జరిగినా ఫర్వాలేదు" అంది.

"అయితే నిన్ను ముర్షీదాబాదులో మహ్మద్‌తకీ వద్దకు చేరుస్తా! అతడు

నవాబు వద్దకు పంపిస్తాడు. కానీ నా మాట విను. యుద్ధం ప్రారంభమైంది. నవాబు తన పట్టణంలోని వారిని 'సహిదాస్' కోటకు పంపిస్తున్నాడు. నువ్వు ముంగేరి వెళ్ళకు!" అన్నాడు ఆ వ్యక్తి ఆమెను అనునయిస్తూ.

"నా అదృష్టంలో ఏది జరగాలనుంటే అది జరుగుతుంది" అంది దలినీబేగం.

"బేగంజీ! నీ అదృష్టంలో ముంగేరి చూసే అవకాశం లేదు" అన్నాడు.

దలినీ విచారించింది. ముందేం జరుగుతుందో ఎవరికి తెలుసు?

"పదండి! మీతో బాటు ముర్శీదాబాదు వస్తా! ప్రాణమున్నంత వరకు నవాబును చూడటానికి ప్రయత్నిస్తా!"

"అది నాకు తెలుసు. సరే పద!" అంటూ అతడు లేచాడు. చీకట్లో ఇద్దరూ ముర్శీదాబాదు పయనమయ్యారు.

'దలినీ' అనే శలభం అగ్నిని చేరే ప్రయత్నం చేస్తోంది.

**పూర్వకథ**

మొదట చెప్పని ఒక విషయం సంక్షిప్తంగా ఇక్కడ ప్రస్తావిస్తాను. చంద్రశేఖరే మొదట చెప్పిన బ్రహ్మచారి, ఆజానుబాహువు అని పాఠకులు గ్రహించి వుంటారు.

ఏ రోజైతే పాస్టర్, అమియట్ కలిసి ముంగేరీ వెళ్ళారో, అదే రోజు స్వామిరామానందుడు పరిశోధించి పాస్టర్, దలినీ బేగం సహా అందరూ అమియట్‌తో బాటు వెళ్ళారని తెలుసుకున్నాడు.

ఆయనే చంద్రశేఖర్‌ను గంగానది తీరంపైన చూశాడు. ఆయనే చంద్రశేఖర్‌కు ఆ విషయం తెలియజేశాడు. ఇంక "నువ్వు ఇక్కడ వుండవలిసిన అవసరం లేదు. స్వగ్రామం వెళ్ళు. శైవలినిని నేను కాశీ పంపిస్తాను. నువ్వెదైతే పరోపకారదీక్ష తీసుకున్నావో ఈ రోజు నుండే ప్రారంభించు. ఈ కన్య ధర్మపరాయణురాలు. ప్రస్తుతం ఆపదలో చిక్కుకుంది. నువ్వీమెను అనుసరించు. అవకాశం వచ్చినప్పుడు ఆమెకు మేలు చేయి. ప్రతాప్‌రాయ్ నీ ఆత్మీయుడు, అపకారి కూడ. నీ గురించే అతను విపత్తులో చిక్కాడు. అతన్ని విడిచిపెట్టకు. అందరినీ అనుసరిస్తూ ముందుకు వెళ్ళు" అంటూ సూచించాడు.

చంద్రశేఖర్ నవాబుకు సమాచారం ఇవ్వాలనుకున్నాడు. రామానందుడు అంగీకరించలేదు. తనే చెబుతానన్నాడు.

చంద్రశేఖర్ గుర్వాజ్ఞపై చిన్ననావ తీసుకుని అమియట్ నావను వెంబడించాడు.

స్వామి రామానందుడు శైవలినిని కాశీ పంపటానికి తగిన శిష్యుడ్ని వెదకసాగాడు. అదే సమయంలో శైవలిని మరోనావతో అమియట్‌ను అనుసరిస్తున్నట్లు తెలియవచ్చింది. ఆయన అనుమానంలో పడిపోయాడు. ఈ పాపాత్మురాలు ఎవరిననుసరించి వెళుతోంది? పాస్టర్‌నా? లేక చంద్రశేఖర్‌నా?

రామానందుడు చంద్రశేఖర్‌ను తిరిగి కుటుంబ జీవితంలోకి తేవాలనుకున్నాడు.

రామానందుడు కాలి నడకన దేశవిదేశాలన్నీ పరిభ్రమణం చేశాడు. ఉచ్ఛకోటికి చెందిన పరివ్రాజకుడు ఆయన. గంగా తీరం వెంట శీఘ్రంగా శైవలిని నావను దాటి ముందుకు వెళ్ళాడు. ఆయనకు ఆహార, నిద్ర, విశ్రాంతి సమస్యలు లేవు.

**కొత్తగాలి...**

**ఆమె గదిలోకి ప్రవేశం**
**గుప్పుమంది పరిమళం**
**నా మనసు గదిలో!!**

– గుగోక్స,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

అన్నింటికీ అతీతుడు. అభ్యాసంతో అన్నింటినీ జయించాడు.

వేగంగా వెళ్ళి చంద్రశేఖర్‌ను కలిశాడు.

నదీ తీరంపై గురుదేవుడ్ని చూసిన చంద్రశేఖర్ ప్రణమిల్లాడు.

రామానందుడు "ఒకసారి నవద్వీపంలోని అధ్యాపకులతో ముచ్చటించటానికి వంగ దేశం వెళ్ళాల్సిన పనిపడింది. పద, నీతోబాటే ప్రయాణిస్తా" అంటూ చంద్రశేఖర్ నావపై అధిరోహించాడు.

ఆంగ్లేయుల నావను చూసి తమ నావను చాటున దాచి అక్కడ్నుంచే చంద్రశేఖర్, రామానందులు పరిశీలించసాగారు. శైవలిని నావ వచ్చి అక్కడే ఆగిపోయింది. శైవలిని, ప్రతాప్‌రాయ్‌లు ఈదుతూ పారిపోవటం చూశారు. తర్వాత నావపై వెళ్ళటం చూశారు. వాళ్ళు కూడ నావనెక్కి శైవలిని, ప్రతాప్‌లను అనుసరించారు.

వాళ్ళనావ తీరం వద్ద ఆగడం చూసి తమ నావను ఒడ్డుకు పట్టించారు.

రామానందుడు తెలివిగలవాడు. అతడు చంద్రశేఖర్‌ను "శైవలిని, ప్రతాప్‌లు ఈదుతూ సాగించిన సంభాషణ గ్రహించావా? " అడిగాడు.

చంద్రశేఖర్ లేదన్నాడు.

రామానందుడు "నువ్వు ఈ రోజు రాత్రి నిద్రించకు, వాళ్ళిద్దరిపై దృష్టి కేంద్రీకరించి వుండు" అన్నాడు.

ఇద్దరూ వారిని గమనిస్తూ రాత్రంతా జాగారం చేశారు. రాత్రి చివరి యామంలో ప్రవేశించిన తర్వాత శైవలిని నావ దిగి తీరం వెంట సాగి చెట్లలో అదృశ్యమైంది.

అప్పుడు రామానందుడు చంద్రశేఖర్‌తో "అర్థం కావడం లేదు. ఆమె మనస్సులో ఏముంది? పద ఆమెననుసరిద్దాం!" అనగానే ఇద్దరూ ముందుకు నడిచారు.

సాయం సంధ్య.. మబ్బులు కమ్ముకోవడంతో "చంద్రశేఖర్! నీ భుజాల్లో ఎంత శక్తివుంది? " అడిగాడు రామానందుడు.



చంద్రశేఖర్ నవ్వి ఓ పెద్దరాయిని ఒంటి చేత్తో ఎత్తి చాలాదూరం విసిరాడు.

రామానందుడు "వెళ్ళు! శైవలినికి దగ్గ రగా వెళ్ళి ఆమెకు కానరాకుండా దాక్కో! ఇప్పుడు వచ్చే గాలి, వాన తాకిడికి ఆమెకు సహాయం అవసరం. లేకపోతే స్త్రీహత్య జరిగిపోతుంది. దగ్గరలోనే కొండపైన గుహ ఉంది. దాని మార్గం నాకు తెలుసు. నేను చెప్పినప్పుడు నువ్వు శైవలినిని భుజా నికెత్తుకుని నాతో రా!" అని చెప్పాడు.

"ఇప్పుడే అంధకారం అవుతోంది. ఇంకా చీకటి ముదిరితే మార్గం ఎలా గమనించ గలను? " అడిగాడు చంద్రశేఖర్.

"నేను సమీపంలోనే వుంటాను. నా చేతిలో దండం ఒక చివర నీకందిస్తాను. రెండో చివర నా చేతిలో వుంటుంది"

శైవలినిని గుహలో వుంచి బయటకు వచ్చిన చంద్రశేఖర్‌ను చూసి రామానం దుడు మనసులో 'నేనింతకాలం చాలా శాస్త్రాల్ని అధ్యయనం చేశాను. భిన్నభిన్న మనస్తత్వాల వ్యక్తులతో సంభాషించాను. కానీ అంతా వ్యర్థమే! ఈమె మనస్సు మాత్రం చదవలేకపోయాను. ఈమె మనో సముద్రం అగాధమా? ' అనుకున్నాడు. చంద్రశేఖర్‌తో మాత్రం "నాయనా! దగ్గరి లోని మరో కొండపైన ఓ మఠం వుంది. ఈ రోజు అక్కడికి వెళ్ళి విశ్రాంతి తీసుకో! శైవలిని గురించిన కర్తవ్యం పూర్తయింత ర్వాత తిరిగి ఆ యవన కన్యను అనుస రించు. పరోపకారం తప్ప మరోభావం నీ దీక్ష కాదు. శైవలిని గురించి విచారించకు. నేను ఈ ప్రదేశంలోనే వుంటాను. నా ఆజ్ఞ లేకుండా ఆమెను మాత్రం కలువబోకు. నా ఆదేశాన్ననుసరించి నడుచుకుంటే శైవ లినికి మేలు జరుగుతుంది" అంటూ చేయాల్సింది చెప్పాడు.

ఆ మాట విని చంద్రశేఖర్ సెలవు తీసు కొని వెళ్ళిపోయాడు. రామనందుడు చీక ట్లో ప్రతీక్షిస్తూ ఆ గుహలో వుండిపో యాడు. ఆ తర్వాత జరిగిన కథంతా పాఠ కులు గతంలో తెలుసుకున్నారు.

★ ★ ★

పిచ్చిపిచ్చిగా వ్యవహరించే శైవలినిని చంద్రశేఖర్ కొండపై మఠంలోని రామా నందుని వద్దకు తీసుకువెళ్ళాడు. "గురు దేవా! ఇలా ఎందుకు జరుగుతోంది? " అం



టూ దుఃఖిస్తూ రామానందుడ్ని అడిగాడు.

రామానందుడు ఆమెను నిశితంగా పరిశీలించి నవ్వుతూ "మంచికే జరిగింది. విచారించకు! ఒకటి రెండు రోజులు ఇక్కడే విశ్రాంతి తీసుకో! పిదప ఈమెను తీసుకుని వేదగ్రామం వెళ్ళు! ఏ గృహంలో గతంలో వుండేదో అక్కడే నివాసముంచు! ఆమె స్నేహితురాళ్లను సదా వెన్నంటే ఉండమను! నేను కూడ త్వరలో అక్కడికి వస్తా!" అన్నాడు.

చంద్రశేఖర్ గురువు ఆదేశానుసారం శైవలినిని వేదగ్రామం చేర్చాడు.

★ ★ ★

నవాబుకు ఆంగ్లేయులతో యుద్ధం ప్రారంభమైంది. కాశింఖాన్ పతనం మొదలైంది. కథియార్ యుద్ధంలో మీర్‌ఖాశిం పరాజితుడయ్యారు. దాని తర్వాత గురుగన్‌ఖాన్ విశ్వాస ఘాతుకం బయటపడసాగింది. విజయంపై విశ్వాసం సన్నగిల్లసాగింది. ఆయన బుద్ధి కూడా మందగించింది. బందీలైన ఆంగ్లేయాధికారుల్ని చంపించాలనుకున్నారు. అందరితో ఆయన వ్యవహారశైలి అసమంజసంగా మారింది.

అదే సమయంలో మహ్మద్‌తకీ దలినీ బేగంపై పంపిన సమాచారం ఆయనకు మండే మంటలో నెయ్యిలా మారింది. ఆంగ్లేయులు అవిశ్వాసులయ్యారు. సేనాపతి అవిశ్వాసుడయ్యాడు. రాజ్యలక్ష్మి అవిశ్వాసి అయింది. రాణీ దలినీబేగం కూడా అవిశ్వాసి అయ్యిందా? ఓర్పు నశించింది.

మీర్‌ఖాశింఖాన్, మహ్మద్‌తకీకి "ఆమెకి అక్కడే విషమిచ్చి చంప" మంటూ ఆదేశం పంపించారు.

మహ్మద్‌తకీ తన చేతిలో విషపాత్రతో దలినీ బేగం వద్దకు వెళ్ళాడు. అతడు తన వద్దకు రావడం చూసి ఆశ్చర్యపడింది. క్రోధంతో "ఇదేంటి? ఖాన్‌సాబ్! నన్నవమాన పరుస్తున్నారు" అంది.

మహ్మద్‌తకీ చేత్తో నుదురు బాదుకుంటూ "అదృష్టం! అమ్మా! అదృష్టం! నవాబుగారు మీపై దయావిహీనులయ్యారు" అన్నాడు.

దలినీ "మీతో ఎవరన్నారు? " అడిగింది.

మహమ్మద్‌తకీ "నమ్మకం కలగటంలేదా? అయితే ఈ ఆజ్ఞాపత్రం చూడండి" అన్నాడు చేతిలో పత్రం చూపుతూ.

"మీరు ఆజ్ఞాపత్రం చదవలేదా? "

మహమ్మద్‌తకీ నవాబు రాజముద్ర వేసిన పత్రం ఆమెకందించాడు. దలినీ చదివి దాన్ని విసిరికొట్టి "ఇది అబద్ధపు, మోసపు పత్రం. నాతో ఈ దాగుడుమూతలెందుకు? " అడిగింది.

"మరణం.. అందుకే!"

"ఆహాఁ! ఇందులో కొంత మీ ప్రమేయముందన్నమాట. దొంగపత్రం తెచ్చి నన్ను భయపెట్టాలనుకుంటున్నారా? "

"అయితే వినండి! అమియట్ నావపై మీరు ఆయనకు ఉంపుడుగత్తెగా వుంటున్నారని నవాబుకు లేఖరాశాను. దానికి ప్రతిగా నవాబుగారు ఈ ఆజ్ఞా పత్రం పంపించారు" కుటిలంగా నవ్వుతూ చెప్పాడు తకీ.

వింటూనే దలినీ బేగం కనుబొమలు ముడిపడినాయి.

నిశ్చలమైన గంగాజలంలో అలలు లేచినట్లు, కనుబొమల రూపమైన ధనుస్సుపై చింతాక్రాంత శరం సంధించినట్లు గమనించి తకీ విషయం అర్థం చేసుకున్నాడు.

"ఎందుకలా రాశావు? " ప్రశ్నించింది.

మహ్మద్‌తకీ విషయమంతా చెప్పాడు.

తకీ ఆజ్ఞాపత్రం తిరిగి దలినీ బేగానికందించాడు. దలినీ శ్రద్ధగా పరిశీలించి చూసింది. అది దొంగ పత్రం కాదనుకొని "విషం ఎక్కడుంది? " అడిగింది దలినీ.

మహ్మద్‌తకీ ఆశ్చర్యంతో "విషమెందుకు? " అడిగాడు.

"ఆజ్ఞాపత్రంలో ఏం ఆదేశముంది? "

"మీకు విషమివ్వమని"

"మరి విషం ఏదీ? "
"మీరు విషం స్వీకరిస్తారా? "
"భర్త ఆజ్ఞ ఎందుకు పాటించను? "
మహమ్మద్‌తకీ సిగ్గుతో చచ్చినట్లయి "బేగంజీ! జరిగిందేదో జరిగింది. మీరు విషం తాగాల్సిన అవసరంలేదు. నేను దీని కుపాయం ఆలోచిస్తాను" అన్నాడు.

దలినీ కళ్ళు విస్ఫులింగాలు వర్షించాయి. క్రోధంగా తన చిన్న శరీరాన్ని నిటారుగా చేస్తూ "నీ వంటి పాపాత్ముల నుండి ప్రాణభిక్ష పొందాలా? నీ కంటె ఎక్కువ పాపాత్మురాలినవుతాను. పో! తీసుకురా! నాకు విషమివ్వు!" అంది ఆజ్ఞాపించినట్లు.

మహమ్మద్ తకీ ఆమెను పరిశీలనగా చూడసాగాడు. అందమైన యువతి, ప్రత్యంగంలో యవ్వనం వర్షం కురిసిన నదిలా నిండుగా ప్రవహిస్తోంది. నిండు వసంతంలో సర్వాంగాల మొగ్గలు పరిపూర్ణంగా వికసించాయి. వర్షం, వసంతం రెండు ఒకేచోట కలిసిపోయాయి. ఆమెను చూస్తే దుఃఖం బీటలు వారిపోతోంది. ఆమె పరిస్థితి చూస్తే దుఃఖమొస్తోంది.

'ఓ భగవంతుడా! దుఃఖానికి నీవింతందం ఎందుకిచ్చావయ్యా? ఆపదలో చిక్కుకున్న ఈ యువతి.. వర్షభీభత్సంలో చిక్కిన ఈ పుష్పం, అలలు కొడుతున్న ఈ నావ, దీన్ని పొంది ఏం చేయగలను? ఈ దుఃఖసౌందర్యాన్ని ఎక్కడ దాచిపెట్టగలను? ' అని ఆలోచిస్తున్న తకీ చెవుల్లో సైతాను 'హృదయంలో దాచుకో' అంటూ గుసగుసలాడింది.

వెంటనే తకీ "ఓ సుందరీ! నన్ను స్వీకరించు! విషం తాగనక్కరలేదు" అన్నాడు.

అది విని దలినీ కాలితో మహమ్మద్ తకీని ఓ తన్ను తన్నింది.

అతడు ఆమెకు విషమివ్వలేదు. ఆమె వైపు వంకర చూపులు చూస్తూ మెల్లమెల్లగా అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

అప్పుడు దలినీ భూమిపై బడి పొర్లి.. పొర్లి ఏడవసాగింది.

## కొత్తగాలి...

**మాట**
**తూటా కాకూడదు!**
**ముత్యాల మూట**
**కావాలి!!**

– జి. విజయశ్రీ,
శ్రీకాకుళం

"హే ప్రభూ! ఓ చక్రవర్తీ! ఈ అమాయకురాలికి ఏం శిక్ష విధించావు? ఏం ఆజ్ఞాపించావు? విషం తినమన్నావు. నువ్వాజ్ఞాపించావు. నేను తినకుండా వుండగలనా? నా శీలం దక్కించుకోవటమే నాకు ముఖ్యం. మీ కోపమే నాకు విషం. మీ కోపం కంటే మించిన శిక్ష ఏముంటుంది? ఆ విషం నన్ను బాధిస్తుందా? ఓ రాజా! ఓ చక్రవర్తీ! ఓ అనాథనాథా! దయా సముద్రుడా! మీ ఆజ్ఞను నవ్వుతూ స్వీకరిస్తాను. మీరు ఎదురుగా వుండి చూడలేరా? ఇది నాకు చాలాబాధగా వుంది స్వామి!" అంటూ ఆమె పరిపరివిధాల వాపోయింది.

దలినీని చూడటానికి కరీమన్ అనే సేవికను నియమించారు. దలినీ ఆమెను పిలిచి, తన వద్ద మిగిలిన నగలన్నింటినీ తీసి ఆమెకిచ్చి "రహస్యంగా వైద్యుని వద్ద విషం తీసుకురా! అది తిన్న వెంటనే శాశ్వత నిద్ర రావాలి. ఈ నగలను అమ్మెయి. వైద్యునికివ్వగా మిగిలింది నువ్వు తీసుకో" అంది.

కరీమన్ ఆమె దుఃఖాన్ని చూసింది. మొదట అంగీకరించలేదు. కానీ దలినీ అనేకసార్లు అడగటంతో, మూర్ఖురాలై ధనంపై ఆశతో ఒప్పుకుంది.

వైద్యుడు మందిచ్చాడు. గుప్తచరుడు మహమ్మద్‌తకీ వద్దకు వెళ్ళి "కరీమన్ ఈ

రోజు మీర్జాహబీబ్ వైద్యుడి నుండి విషం తీసుకువచ్చింది" అంటూ చెప్పాడు.

మహమ్మద్‌తకీ కరీమన్‌ను పట్టుకు న్నాడు. కరీమన్ ఒప్పుకుంది. "విషం దలినీ బేగాని కందించాను" అని చెప్పింది.

వెంటనే మహమ్మద్‌తకీ దలినీ బేగం వద్దకు వచ్చాడు.

దలినీ బేగం ఆసనంపై కూర్చొని ముఖం పైకెత్తి రెండు చేతులు జోడిం చింది. కళ్ళ నుండి ధారాపాతంగా కన్నీళ్ళు ప్రవహిస్తున్నాయి. ఎదురుగా ఖాళీ పాత్ర పడివుంది. దలినీ విషపానం చేసింది.

"ఈ పాత్ర ఏమిటి? " తకీ అడిగాడు.

"అది విషపుపాత్ర. నేను నీ రీతిగా న మ్మకద్రోహిని కాను. నా యజమాని ఆజ్ఞ ను స్వీకరిస్తున్నా. నీకిష్టమైతే మిగిలిన విషం తాగి నాకు తోడుగా రా!" హేళనగా నవ్వుతూ అంది దలినీ బేగం.

మహమ్మద్ తకీ మౌనం వహించాడు.

దలినీ బేగం నెమ్మదిగా ఆసనం నుండి కిందకు జారిపోయింది. కళ్ళు మూతలు పడినాయి. అంతా చీకటయింది. ఆమె శాశ్వతంగా లోకం నుండి వెళ్ళిపోయింది.

★ ★ ★

మీర్‌ఖాశిం సైన్యం కథియార్ యుద్ధ క్షేత్రం నుండి పరాజితయై వెనక్కి వస్తోం ది. యవన సైన్యం ఆంగ్లేయుల భుజ బలం ముందు ఛిన్నాభిన్నమైంది.. గాలి ముందు, దుమ్ముధూళి చెల్లా చెదరైనట్లు. నష్టపోగా మిగిలిన యవనసైన్యం ఉదయ నాలా వద్ద ఆగింది. అక్కడ నలువైపులా లోతైన కందకాలు తవ్వి ఆంగ్లేయ సేనల్ని నిరోధిస్తోంది.

మీర్‌ఖాశిం స్వయంగా అక్కడకు చేరుకు న్నారు. ఆయనతో సయ్యద్ అమర్ హసన్ అనే ఓ అధికారి "మహరాజ్! ఒక ఖైదీ మిమ్మల్ని కలవాలని ఆశపడుతున్నా డు. అతడు ప్రత్యేకంగా వినతి చేసుకోదల చుకున్నాడు. మీతో తప్ప మరెవరితో చె ప్పదలచుకోలేదు" అంటూ విన్నవించాడు.

మీర్‌ఖాశిం "అతడెవరు? " అడిగాడు.

అమర్‌హసన్ "ఒక స్త్రీ ప్రభూ! ఆమె కలకత్తా నుండి వచ్చింది. వారన్ హేస్టిం గ్స్ జాబుతో ఆమెను పంపించాడు. నిజం గా ఆమె ఖైదీ గాదు. యుద్ధం కంటే పూర్వపు ఉత్తరం కాబట్టి నేను తీసుకు న్నాను. ఒకవేళ తప్పయితే శిక్షించండి" అంటూ ఆ పత్రాన్ని చదివి వినిపించాడు.

వారన్ హేస్టింగ్స్ లేఖలో ఇలా ఉంది.

"ఈ మహిళ ఎవరో నాకు తెలియదు. అభిమానంతో నా వద్దకు వచ్చి మనవి చేసుకుంది. 'కలకత్తాలో నాకెవరు సహా య పడేవారు లేరు. దయచేసి నన్ను నవాబుగారి వద్దకు పంపించండి. బతికిపో తాను' అంటోంది. మీతో మాకు త్వరలో యుద్ధం ప్రారంభం కానుంది. మా జాతి స్త్రీలతో యుద్ధం జెయ్యదు. కాబట్టి ఈమెను మీ వద్దకు పంపిస్తున్నాను, మంచి చెడ్డలు నాకు తెలియవు"

నవాబు ఉత్తరం ఆసాంతం విని ఆమెను తన ముందు ప్రవేశపెట్టమ న్నారు. అమర్ హసన్ వెళ్ళి ఆ మహిళను వెంటబెట్టుకు వచ్చాడు.

నవాబు ఆమెను చూశారు. ఆమె కులు సూమ్. కులుసూమ్ నవాబును ఏక దీక్షగా చూస్తూ "నవాబ్‌గారూ! మీ దలినీ బేగం ఎక్కడుంది? " అడిగింది.

ఆమె వ్యవహారం చూసి సయ్యద్ హసన్ భీతిల్లి నవాబ్‌కు సలామ్ చేసి బయటకు వెళ్ళిపోయాడు.

"ఆ పాపిష్ఠిది ఎక్కడుందో అక్కడికే త్వరలో నువ్వు కూడా చేరుకుంటావు" అన్నారు నవాబ్ కోపంతో.

"నేనే కాదు మీరు కూడా చేరుకుంటారు నవాబ్‌గారూ! అందుకే మీ వద్దకు వచ్చాను. దారిలో విన్నాను.. ప్రజలు దలినీ బేగం స్వయంగా ఆత్మహత్య చేసు కుని మరణించిందని అనుకుంటున్నారు.

అ
క్ష
రం

తప్పులు చేయడం కూడా
స్వేచ్ఛ అనేట్లయితే
అలాంటి స్వేచ్ఛకు విలువే లేదు.

– మహాత్మాగాంధీ



ఇది సత్యమా?" అడిగింది కులుసూమ్.

"ఆత్మహత్య? నవాబ్ ఆదేశంతో ఆమె మరణించింది. ఆమె పాపకార్యాల్లో నువ్వు భాగస్వామివే కనుక నిన్ను కుక్కల చేత చంపిస్తా" కఠినంగా అన్నారు నవాబు.

కులుసూమ్ విభ్రాంతురాలై దీనంగా దుఃఖిస్తూ, నవాబును నోటికొచ్చినట్లుగా తిట్టసాగింది. అది విని కావలివారు, అధికారులు, రక్షకులు, పరుగెత్తుకు వచ్చారు. ఓ అధికారి ఆమె సిగబట్టి లాగబోయాడు.

నవాబు అతన్ని వారించారు. అతడు తెల్లమొహం వేశాడు.

అప్పుడు కులుసూమ్ "మీరందరూ వచ్చారు. బాగుంది. నేను విచిత్రమైన వృత్తాంతం వినిపిస్తాను. నాకు మరణశిక్ష విధిస్తారు. నేను మరణిస్తే ఆ విషయం ఎవరికీ తెలియదు. ఇప్పుడే అందరూ వినండి! సుబా బెంగాల్, బిహార్, ఒడిశాలను ఓ బుద్ధిహీనుడైన నవాబు పరిపాలిస్తున్నాడు. దలినీ (దౌలతున్నీసా) అనే మహిళ ఆయన భార్య. ఆమె నవాబు సర్వసైన్యాధిపతి గురుగన్‌ఖాన్‌కు స్వయాన సోదరి.."

ఆ చెప్పేది వింటూ ఆమెను చంపడానికి ఎవరూ ముందుకు రాలేదు. అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకోసాగారు. అందరిలో ఉత్సుకత పెరిగిపోతోంది.

నవాబు మౌనం వహించారు.

కులుసూమ్ చెబుతూ పోయింది..

"గురుగన్‌ఖాన్, దౌలతున్నీసాలు ఇరువురు ఇఫ్ఫహాన్ సలహాపై జీవిక వెతుకుతూ బెంగాల్ చేరుకున్నారు. దలినీ దాసిగా మీర్‌ఖాశిం మహల్ చేరుకుంది. ఆ తర్వాత అన్నాచెల్లెలు ఓ ఒప్పందం చేసుకున్నారు. ఒకరికొకరు సహాయంగా వుండాలని"

దలినీ తనను తీసుకుని ఆ రోజు రాత్రి గురుగన్‌ఖాన్ వద్దకు వెళ్లిన విషయం, అక్కడ జరిగిందంతా విస్తారంగా వివరించింది. దలినీ, గురుగన్‌ఖాన్‌ల మధ్య జరిగిన సంభాషణ ఆమె వింది. ఆ సంభాషణ చెప్పింది. తిరిగి వస్తూ దలినీ అంతఃపురానికి వెళ్ళనని చెప్పడం, బ్రహ్మచారి చేసిన సాయం, ప్రతాప్‌రాయ్ ఇంటిలో వుండడం, శైవలినిని అపహరించటానికి బదులుగా, బేగాన్ని, తనను అపహరించటం, నావలో బంధించడం, అమియట్ మొదలైనవాళ్ళ మరణం.. పాస్టర్‌తోబాటు తాము పారిపోవడం, చివరకు పాస్టర్ దలినీ బేగాన్ని గంగాతీరంలో వదిలేయడం తాను కలకత్తా చేరడం.. అంతా వివరంగా చెప్పింది. చివరగా "అప్పుడు నా భుజాలపై సైతాను కూర్చునుందనడంలో అసత్యం ఏ మాత్రం లేదు. ఎందుకంటే అంతకాలం ఆమెకు సహాయంగా వున్న నేను ఎలా ఒంటరిగా వదిలిపెడతాను? దానికి తగిన శిక్ష నేననుభవించాను. బేగంగారిని వదిలిన తర్వాత పాస్టరుతో నన్ను వదిలేయమని ప్రార్థించాను. కానీ అతడు నన్ను నావ దించలేదు. కలకత్తా వెళ్ళింతర్వాత నన్ను ముంగేరి పంపించమని చాలామందిని ప్రార్థించాను. ఎవరూ సాయపడలేదు. వారన్ హేస్టింగ్స్ సాహెబ్ దయాళువు అని విని ఆయన వద్ద నా

గోడు వినిపించుకున్నాను. ఆయన పాదాలు పట్టుకుని నన్ను నవాబుగారి దగ్గరకు పంపమని వేడుకున్నాను. ఆయన దయ వలన నేనిక్కడికి చేరుకోగలిగాను. విషయమంతా చెప్పాను. ఇప్పుడు మీరు నన్ను చంపించండి! దలినీబేగం చనిపోయిం తర్వాత నాకు జీవించాలని ఏ కోశానాలేదు. దయచేసి నాకు మరణశిక్ష విధించండి" అంటూ కులుసూమ్ బోరుమంది.

కోట్ల విలువగల మణులు, మాణిక్యాలు, వజ్రాలు పొదిగి ప్రకాశించే బహుమూల్య సింహాసనాసీనుడైన నవాబు తలవంచుకున్నారు. విశాల సామ్రాజ్య రాజదండం ఆయన చేతి నుండి జారిపోతోంది. ఎంత ప్రయత్నించినా తనను తాను నిబ్బరం చేసుకోలేకపోతున్నారు. అజేయమైన రాజ్యం ప్రయత్నం లేకుండానే నిలబడగలుగుతుంది. ఆయన పూలను విడిచిపెట్టి కంటకాల్ని రక్షించే ప్రయత్నం జేశారు. కులుసూమ్ సత్యమే చెప్పింది. బెంగాల్ నవాబు నిజంగా బుద్ధిహీనుడే!

నవాబు అక్కడ చేరినవాళ్ళందర్ని సంబోధిస్తూ "మీరంతా వినండి! ఈ బెంగాల్ రాజ్యాన్ని రక్షించలేను. దీన్ని కాపాడదలచుకుంటే మీరే ప్రయత్నించండి. నేను పీఠం వదులుకుంటున్నాను. నేను రోహతాస్ కోటలో స్త్రీల మధ్య దాక్కుంటాను. లేదా ఫకీరునైపోతాను" అన్నారు. అలా చెబుతుండగానే అతడి దృఢమైన శరీరం వణికిపోసాగింది, నీటి ప్రవాహ వేగంలో నిలిచిన కట్టడంలా!

ధారలుగా ప్రవహిస్తున్న కన్నీటిని ఆపుకుంటూ- "సోదరులారా! వినండి! ఒకవేళ ఆంగ్లేయులు లేదా వారి సైనికులు నన్ను సిరాజుద్దౌలాలా చంపితే, మిమ్మల్ని ప్రార్థించేదొక్కటే! దలినీ బేగం సమాధి పక్కనే నన్ను సమాధి చేయండి! నేనెక్కువ సంభాషించలేక పోతున్నాను. మీరు వెళ్ళండి. చివరగా నాది ఒక్కమాట. నేనొక్కసారి మహమ్మద్ ఆలీని చూడాలి" అంటూ పెద్దగా "ఆలీ ఇబ్రహీంఖాన్!" అంటూ పిలిచారు.

ఆలీ ఇబ్రహీంఖాన్ ముందుకొచ్చి, నేలనంటి సలాం చేశాడు.

నవాబు అతనితో "నీ వంటి సోదరుడు నాకు మరొకరు లేరు. నీతో ప్రార్థన ఒక్కటే! మహమ్మద్ తకీని వెంటనే నా ముందు ప్రవేశపెట్టు" అన్నారు.

ఇబ్రహీం మళ్ళీ సలాం చేసి డేరా బయటకు వెళ్ళి అశ్వమెక్కాడు.

మళ్ళీ నవాబు "ఇంకా ఎవరైనా నాకు సహాయపడతారా? " అడిగారు.

అందరూ వినమ్రంగా నిలిచారు ఆయన ముందు. నవాబు "ఎవరైనా ఆ పాస్టర్‌ను తీసుకురాగలరా? " అడిగారు.

అమీర్‌హసన్ ముందుకొచ్చి "అతన్ని వెదకడానికి నేనిప్పుడే కలకత్తా వెళతాను! హుజూర్!" అన్నాడు.

నవాబు కొద్దిగా ఆలోచించి "ఆ శైవలినిని ఎవరైనా తీసుకురండి" అన్నారు.

మహ్మద్ ఇరఫాన్ అనే సరదారు ముందుకొచ్చి "తప్పకుండా! ఆమె యిప్పటికే యిల్లుచేరి వుండవచ్చు! నేనామెను తీసుకువస్తా" అంటూ మనవి చేశాడు.

మళ్ళీ నవాబు "బేగంగారికి సహాయం చేసిన బ్రహ్మచారిని ఎవరు వెదికి తీసుకురాగలరు? " అడిగారు.

మహమ్మద్ ఇరఫానే "హుజూర్! ఆదేశిస్తే శైవలినిని వెదికి తెచ్చింతర్వాత, ముంగేరి వెళ్ళి బ్రహ్మచారిని కూడా తీసుకురాగలను" అన్నాడు.

చివరగా నవాబు "గురుగన్‌ఖాన్ ఎంత దూరంలో వున్నాడు? " అంటూ అడిగారు.

"విన్న సమాచారం ప్రకారం అతడు సైన్యంతో ఉదయ నాలా వద్దకు చేరుకుంటాడని తెలిసింది. కానీ ఇంతవరకు రాలేదు" ఓ మంత్రి మనవి చేశాడు.

"సైన్యమా? ఎవరి సైన్యం? "

మరో మంత్రి "ఇంకెవరిది? అతని సైన్యమే! ప్రభూ!" మెల్లగా చెప్పాడు.

మంత్రులు.. అధికారులు.. అందరూ నవాబును ఒంటరిగా వదిలివెళ్ళిపోయారు. నవాబు సింహాసనం దిగి నిలబడ్డారు. ముత్యాలు, రత్నాలు కూర్చిన తలపాగా తీసి దూరంగా విసిరారు. మెడలోని హారాల్ని తెంపివేశారు. స్వర్ణంతో తయారు చేసిన రాజోచిత దుస్తుల్ని తొలగించి భూమిపై పడి దొర్లుతూ.. "దలినీ! దలినీ!" అంటూ దుఃఖించసాగారు.

ఈ జగతిలో రాజుల, మహారాజుల జీవితాలు చాలావరకు ఇలాగే వుంటాయి.




**చా**లా ప్రయాసతో చంద్రశేఖర్ శైవలినిని గృహం చేర్చాడు. చాలారోజుల తర్వాత అతడు యిల్లు చేరుకున్నాడు. ఇల్లు అడివి కంటే భయంకరంగా వుంది. ఇంటి మీది గడ్డి నామరూపాల్లేకుండా లేచిపోయింది. బహుశా గాలిదుమారాల ప్రభావంతో కావచ్చు! చెట్లు పెరిగి వాకిలి చిట్టడవిలా తయారయింది. పాములు కూడ ఆవాసముండవచ్చు.

ఇంటి కిటికీలన్నీ ఎవరో ఎత్తుకెళ్లారు. వాకిలి ద్వారం కూడ తెరిచే వుంది. ఇంట్లో ఒక్క వస్తువూ లేదు. అవీ దొంగలెత్తుకుపోయుంటారు. కొన్నింటిని సుందరి తమ యింట్లో దాచి వుంచింది.

వర్షపు నీటితో యిల్లు నీటి మడుగులుగా మారిపోయింది. అక్కడక్కడ ఎండిపోయివుంది. ఉడుతలు, ఎలుకలు, గబ్బిలాలు నిరభ్యంతరంగా తిరుగుతున్నాయి. చంద్రశేఖర్ శైవలిని చేయి పట్టుకుని ఆ యింటికే తీసుకువచ్చాడు.

తాను గ్రంథాలన్నీ భస్మం చేసిన చోట నిలబడి "శైవలినీ!" అంటూ పిలిచాడు.

శైవలిని జవాబివ్వలేదు. ఇంటిద్వారం వద్ద కూర్చొని 'కనేర్' వృక్షంవైపు చూడసాగింది. చంద్రశేఖర్ అడిగిన ఏ ఒక్కదానికి ఆమె నుండి సమాధానం రాలేదు. కళ్ళు పెద్దవి చేస్తూ నలువైపులా దీక్షగా చూడసాగింది. అప్పుడప్పుడు మెల్లగా నవ్వుతోంది. తర్వాత ఒక్కసారి పెద్దగా నవ్వి దేనినో వేలెత్తిచూపింది.

చంద్రశేఖర్ శైవలినితో వచ్చిన వార్త గ్రామమంతా వ్యాపించింది. చాలామంది చూడటానికి వస్తున్నారు. అందరికంటే ముందుగా సుందరి వచ్చింది. సుందరి శైవలిని స్థితి గమనించకుండానే చంద్రశేఖర్‌కు ప్రణమిల్లింది. ఆయన బ్రహ్మచారి వేషాన్ని చూసింది.

శైవలిని వైపు చూసి "అన్నా! ఈమెను తీసుకొచ్చి మంచిపని చేశావు. ఈమెకు ప్రాయశ్చిత్తం చేయాల్సిన అవసరముంది" అని శైవలినిని ఆశ్చర్యంగా చూసింది. చంద్రశేఖర్ వున్నా ఆమె అక్కడ్నుండి కదలకపోవడం, ముసుగు వేసుకోకపోవడం ఆమెకు వింతగా అనిపించింది.

సుందరిని చూసి శైవలిని నవ్వింది.

శైవలిని ఆంగ్లేయుల సాహచర్యంలో ఇలాంటివి నేర్చుకుని వచ్చివుంటుందనుకుంది సుందరి. అలా అనుకుని ఆమె వద్దకు వెళ్ళి కూర్చుంది. దుస్తులకు దుస్తులు తగలకుండ దూరం పాటించింది. నవ్వుతూ శైవలినితో "నన్ను గుర్తించావా? " అడిగింది.

"గుర్తించా! పార్వతివి!" అంది శైవలిని.

సుందరి "చచ్చాం! ఇంకేముంది? అప్పు

డే మరిచిపోయావు" అంది.

శైవలిని "ఎందుకు మరిచిపోతాను? నువ్వు నా అన్నాన్ని ముట్టుకున్నావు కదా? అప్పుడు నిన్ను కొట్టాను కూడా! అక్కా! పార్వతీ! ఒక పాట పాడవా? " అంటూ స్వయంగా తానే పాటందుకుంది..

'నా మనసు మాట చూడు!
అదే అదే వున్నది.
నా కృష్ణుని పక్కన ఎవరున్నారు?
నా మేఘాల ఒడిలో ఎవరు చంద్రుడు?
విసురుతున్నాను చూడు!
నీపై ప్రేమవల..!'
"పార్వతీదీదీ! బాగా పాడుతున్నానా? "
ఎవరూ ఎవరిలా లేరు?
ఎవరనుకున్నాను?
అతడు అతడు కాదు.
అతడు ఎవరిలా రాగలడు?

ఎవరు ఎవరిలా రాలేదు! ఎక్కడి నుండి వస్తున్నాను? అక్కడ నుండి అలా రాలేదు. ఎవరిని వెదుకుతున్నాడు! అతనిని అతనిలా తెలుసుకోలేకున్నాను" అంటూ అర్థం లేకుండా వదరసాగింది.

సుందరి ఆశ్చర్యపోయి చంద్రశేఖర్ ముఖంవైపు చూసింది. అతడు ఆమెను దగ్గరకు రమ్మన్నాడు. రాగానే ఆమె చెవిలో "పిచ్చిదయింది" అన్నాడు.

సుందరికర్థమైంది. కొద్దిసేపు మౌనంగా వుంది. ఆమె కళ్ళ నుండి నీళ్ళు కారసాగాయి. రోదన పెరిగింది.

స్త్రీజాతి ప్రపంచానికి రత్నం వంటిది. ఇదే సుందరి ఆ రోజు నావలో మనసా, వాచా శైవలిని నావతో సహా మునిగి చనిపోవాలని కోరింది. కానీ ఈ రోజు శైవలిని స్థితి చూసి దుఃఖిస్తోంది.

సుందరి నెమ్మదిగా కళ్ళొత్తుకుని శైవలిని వద్దకు వెళ్ళి కూర్చుని మెల్లగా సంభాషించసాగింది. పాత విషయాలన్నీ జ్ఞాపకం చేయసాగింది. కానీ ఏదీ శైవలిని స్మృతికి రావటం లేదు. అసలు ఆమె సుందరిని గుర్తించనే లేదు.

సుందరి చంద్రశేఖర్‌ను తన యింటికి స్నానపానాలకు పంపి తను ఇంటిని వాసయోగ్యంగా మార్చే యత్నంలో పడింది.

ఇక్కడ ప్రతాప్ ముంగేరి చేరుకున్నాతర్వాత తన లాఠీసైనికుల్ని తగిన స్థానాల్లో నియమించి ఇల్లు చేరుకున్నారు.

అతనికి చంద్రశేఖర్ యిల్లు చేరుకున్న సమాచారం అందింది. వెంటనే ఆయన్ని చూడటానికి వేదగ్రామం వెళ్ళాడు.

అదేరోజు స్వామి రామానందుడు కూడా వేదగ్రామం చేరాడు. ఆయన సూచనపై చంద్రశేఖర్ శైవలినికి చికిత్స ప్రారంభిస్తాడని తెలిసి సుందరి సంతోషించింది. చికిత్స ప్రారంభదినం కూడా నిశ్చయమైంది.

★ ★ ★

మందేమిటి? అది చెప్పలేం! అది సేవింపజేయడానికి చంద్రశేఖర్ ఆత్మపరిశుద్ధిని పొందాడు. అతడు సహజంగా జితేంద్రియుడు. ఆహారం, నిద్ర వంటి వాటన్నింటిని వశపరచుకున్నవాడు. ఇప్పుడు ప్రత్యేకంగా ఉపవాసదీక్షను కూడా పూర్తిచేశాడు. మనస్సును కొన్నిరోజులుగా ఈశ్వర ధ్యానంలో నిమగ్నం చేశాడు. పరోపకార భావన తప్పించి మరో వికారంలేదు.

నిర్ణీత శుభసమయంలో ఔషధ సేవనం చేయించటానికి అతను సిద్ధమవుతున్నాడు. శైవలిని కోసం పడక సిద్ధం చేయమన్నాడు. సుందరి నియమించిన సేవకురాలు శయ్యా సిద్ధం చేయసాగింది.

ఆ శయ్యపై శైవలినిని పడుకో బెట్టమన్నాడు. సుందరి ఆమెను బలవంతంగా పడుకోబెట్టింది. శైవలిని ఏది చెప్పినా సామాన్యంగా వినదు. కానీ ప్రతిరోజు తప్పకుండ సుందరి యింటికి వెళ్ళి స్నానం చేసి వస్తోంది.

చంద్రశేఖర్ అందరిని బయటకు పంపించాడు. "నేను పిలిచే వరకు ఎవరూ లోనికి రాకూడదు" అని కూడా చెప్పాడు.

అందరూ వెళ్ళిన తర్వాత ఔషధ పాత్ర పడక వద్ద వుంచి "లేచి కూర్చో"అన్నాడు.

శైవలిని పాటందుకుని పాడసాగింది తప్ప లేవలేదు. చంద్రశేఖర్ స్థిరదృష్టితో ఆమె కళ్ళలోకి చూస్తూ ఔషధపాత్రలోని జలాన్ని ఆమెచే తాగించాడు. ఔషధం మరేమీ కాదు కమండలంలోని జలమే!

చంద్రశేఖర్ గురుదేవుల్ని స్వామీ! దీని వల్ల ఏం జరుగుతుంది? అని అడిగాడు.

రామానందుడు "ఆమె యోగబలాన్ని పొందుతుంది" అని సమాధానమిచ్చారు.

జలం తాగించిన చంద్రశేఖర్ ఆమె నుదురు, కళ్ళు, ముఖం పైన తన అర చేత్తో వంకరటింకరగా, రకరకాలుగా స్పృశిస్తూ వుండిపోయాడు, కొంతసమయం అలా చేయడంతో.. శైవలిని కళ్ళు నెమ్మదిగా మూతలు పడ్డాయి. శీఘ్రంగా గాఢ నిద్రలోకి జారుకుంది.

చంద్రశేఖర్ "శైవలినీ!" పిలిచాడు.

శైవలిని అదేస్థితిలో "చెప్పండి? " అంటూ అతడడిగిన వాటికి సమాధానాలు చెప్పసాగింది.

"నేనెవరిని? "

"నా పతిదేవులు"

"నువ్వెవరు? "

"నేను శైవలినిని"

"మన మెకడున్నాం? "

"వేదగ్రామం.. మన స్వగృహంలో"

"బయట ఎవరున్నారు?

"ప్రతాప్, సుందరి ఇంకా ఇతరులు"

"నువ్విక్కడి నుండి ఎందుకెళ్ళావు? "

"లారెన్స్ పాస్టర్ తీసుకెళ్ళాడు"

"ఎందుకు? '

"నేను పిచ్చిదాన్నయ్యాను"

"నిజమా? లేక మోసం చేస్తున్నావా? "

"నిజమే! మోసం చెయ్యడం లేదు"

"మరిప్పుడు? "

"ఇప్పుడు స్వప్నం. మీ గుణాలతో బుద్ధి కలిగింది"

"నిజం చెబుతావా? "



**కొత్తగాలి...**

**జీవితం**
**ఆనందంగా గడపడానికి!**
**జీతం**
**అందుకు ఖర్చు పెట్టడానికి!!**

– శ్రీదాస్యం లక్ష్మయ్య,
హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా

"చెబుతాను"

"నువ్వు పాస్టర్ వెంట ఎందుకెళ్లావు? "

"ప్రతాప్ గురించి"

చంద్రశేఖర్ అదిరిపడ్డాడు. వేల కళ్ళతో జరిగిన సంఘటనలన్నింటిని క్షుణ్ణంగా పరిశీలించి మళ్ళీ ప్రశ్నించాడు.

"ప్రతాప్ నీకు ఉపపతియా? "

"ఛీఛీ"

"మరి అతనెవరు? "

మేం ఒక్క కొమ్మ పూవులం. ఒకే వనంలో పుష్పించాం. మమ్మల్ని తెంపి మీరెందుకు వేరుచేశారు?

చంద్రశేఖర్ సుదీర్ఘంగా నిట్టూర్చాడు. అతని అనంత జ్ఞానంలో ఏదీ దాగి లేదు.

చంద్రశేఖర్ మళ్ళీ శైవలినిని ప్రశ్నించాడు.

"ఆ రోజు ఆంగ్లేయుల నావ నుండి ప్రతాప్ పారిపోయాడు. అప్పుడు మీరిద్దరూ నదిలో ఈదారు! జ్ఞాపకమేనా? "

"ఆ! జ్ఞాపకముంది"

"మీరేమి సంభాషించారు? "

శైవలిని సంక్షిప్తంగా ఇరువురి మధ్య జరిగిన సంభాషణ వివరాలు తెలిపింది.

చంద్రశేఖర్ మనసులో ప్రతాప్‌ను ప్రశంసించి, మళ్ళీ శైవలినిని అడిగాడు.

"మరి పాస్టర్ వెంట ఎందుకున్నావు? "

"కేవలం వున్నాను. పురందరపురం వెళ్ళి

## కొత్తగాలి...

**పెద్దబాలశిక్ష, శతకాలు**
**పలకదిద్దుడు ఆనాడు!**
**వేలికొనల విన్యాసాలు**
**తెలుగక్షరం పలకని**
**నోళ్లు ఈనాడు!**

– గిడుగు లక్ష్మీదత్,
హైదరాబాద్

ప్రతాప్‌ను కలవాలనుకున్నాను. ఆ ఆశ తోనే వున్నాను"

"కేవలం వున్నావు. పవిత్రురాలివేగా? "

"ప్రతాప్‌కు మనసులో ఆత్మసమర్పణ చేశాను. గొప్ప పాపిని"

"కానట్లయితే? "

"పరిపూర్ణ సతీత్వం గల దానిని"

"పాస్టర్ విషయంలో? "

"శరీర, మనసా, వాచా పవిత్రురాలిని"

చంద్రశేఖర్ ఆమెను నిశితంగా చూస్తూ ముఖంపై చేతినాడించి ప్రశ్నించాడు.

"నిజం చెప్పు? "

నిద్రలో వున్న శైవలిని భ్రుకుటి ముడివ డింది. "సత్యమే చెబుతున్నా" అంది.

చంద్రశేఖర్ మళ్ళీ నిట్టూర్చి- "బ్రాహ్మణ స్త్రీవయ్యుండీ జాతి భ్రష్ఠురాలివయ్యేందుకు ఎందుకు వెళ్ళావు? " అడిగాడు.

"మీ అందరికీ సకలశాస్త్రాలు తెలుసు. నేను జాతిభ్రష్ఠురాలినా? అతని చేతి పదార్థం తినలేదు. నీరు తాగలేదు. నేను నా చేతివంట తిన్నా. నా వెంట హిందూ సేవిక వుంది. ఒక్క నావలో మాత్రం వున్నాం.. అదీ పవిత్ర గంగానదిలో మాత్రమే" అంది గట్టిగా.

చంద్రశేఖర్ తల వంచుకుని చాలాసేపు ఆలోచించాడు. 'ఛీఛీ ఎంత తప్పుజేశాను. స్త్రీహత్య చేయబూనాను' అనుకుని ఆమెను మళ్ళీ ప్రశ్నించాడు.

"ఇవన్నీ ఎవరికెందుకు చెప్పలేదు? "

"నాపై విశ్వాసమెవరుంచగలరు? "

"ఈ విషయాలెవరికి తెలుసు? "

"పాస్టర్‌కు, పార్వతికి"

"పార్వతి ఎక్కడుంది? "

"నెలక్రితం ముంగేరీలో మరణించింది"

"మరి పాస్టర్? "

"ఉదయనాలావద్ద సైనిక గుడారంలో!"

చంద్రశేఖర్ కొంత సమయం ఆలోచిస్తూ గడిపి మళ్ళీ ప్రశ్నించాడు.

"నీ దుఃఖమెలా పోతుందో తెలుసా? "

"మీ యోగ బలాన్ని నాకందించారు. దాని ప్రభావంతో తెలుసుకున్నాను. మీ శ్రీ చరణాల కృపతో, మీరిచ్చే ఔషధంతో నాకు స్వస్థత చేకూరుతుంది"

"స్వస్థత తర్వాత ఎక్కడికి వెళ్తావు? "

"ఒకవేళ విషం లభిస్తే సేవిస్తాను. కానీ నరకలోక భయం పీడిస్తోంది"

"మరణించడమెందుకు? "

ఈ ప్రపంచంలో నాకేది చోటు? "

"నా గృహం లేదా? "

"మీరు నన్ను స్వీకరిస్తారా? "

"స్వీకరిస్తే? "

"మనోవాక్కాయ కర్మలచే మీ శ్రీచరణ సేవ చేసుకుంటా. కానీ మీకు కళంకం వస్తుంది"

అప్పుడు బయట గుర్రపు డెక్కల శబ్దం వినిపించింది.

చంద్రశేఖర్ "నిన్ను ప్రభావితురాల్ని చేసింది నా యోగబలం కాదు. స్వామీ రామానందుల నుండి నేను పొందిన యోగబలం. బయట వినిపిస్తున్న శబ్దం ఏమిటి? " అడిగాడు.

"గుర్రం డెక్కల చప్పుడు"

"ఎవరొస్తున్నారు? "

"మహమ్మద్ ఇరఫాన్ సైనికాధికారి. నవాబు నన్ను చూడదలచుకున్నారు"

"పాస్టర్ అక్కడకెళ్ళిన తర్వాతనా? లేక మొదలే నిన్ను చూడాలనుకున్నారా? "

"లేదు. ఇద్దరినీ తీసుకురమ్మని మొదటే ఆదేశించారు"

"విచారించకు. హాయిగా నిద్రపో" అని చెప్పి చంద్రశేఖర్ బయటి వాళ్లందరినీ లోనికి పిలిచి- "ప్రసుత్తం ఈమె నిద్రి స్తోంది. మెలకువ వచ్చిన వెంటనే ఈ పాత్రలోని ఔషధాన్ని తాగించండి. ఇప్పుడు నవాబు నుండి పిలుపు వస్తోంది. రేపు ఈమెను తీసుకువెళతారు. మీరంద రూ వెంట వెళ్లండి" వాళ్లతో అన్నాడు చంద్రశేఖర్.

అందరూ ఆశ్చర్యపోయి భయభ్రాంతుల య్యారు. అందరూ ఒకేసారి "సిపాయిలు ఈమెను నవాబు వద్దకు ఎందుకు తీసుకు వెళ్తున్నారు? " అడిగాడు.

"ఇప్పుడే వింటారు. భయమేమీ లేదు" అంటూ చంద్రశేఖర్ వాళ్లకి సాంత్వన కలి గించాడు.

విషయమంతా స్వామిరామానందుడికి రహస్యంగా చంద్రశేఖర్ తెలియబరచాడు.

రామానందస్వామి చంద్రశేఖర్‌తో "రేపు మనిద్దరం కూడ నవాబుగారి దర్బారులో వుండాల్సి వుంటుంది" అన్నాడు.

★ ★ ★

విశాలమైన, ధృఢమైన గుడ్డతో పరదా ఉన్న గుడారంలో బెంగాల్ చివరి నవాబు ఆసీనుడై వున్నారు. అలీజహా మీర్‌ఖాశిం ఖాన్ తర్వాత ఎవరైతే బెంగాల్ నవాబు గా నియామకమయ్యారో వాళ్లంతా పేరుకు మాత్రమే నవాబులు. పరిపాల నాధికారాలు వాళ్ల చేతుల్లో లేవు.

ముత్యాలు, రత్నాలు, మణులు పొదిగి బంగారు పూత పూసిన సింహాసనంపై నవాబు కొలువుదీరారు. ముత్యాలు రత్నాలు కూర్చిన మకుటం శిరస్సున ధరిం చారు. కిరీటంలోని వజ్రం ప్రకాశవంత మైన కాంతులీనుతోంది.

పక్కన నౌకర్లంతా వరుసగా చేతులు జోడించి నిలబడివున్నారు. ఎదురుగా మంత్రులు, అధికారులు ఆనవాయితీ ప్ర కారం మోకాళ్లపై వంగి మౌనంగా కూర్చు న్నారు. అంతా నిశ్శబ్దం వ్యాపించి వుంది.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ నవాబు "ఖైదీ లంతా హాజరుగా వున్నారా? " అడిగారు.

మహమ్మద్ ఇర్‌ఫాన్ "హుజూర్! హాజ రుగా వున్నారు" మనవి చేశాడు.

నవాబు ముందుగా లారెన్స్ పాస్టర్‌ను ప్రవేశపెట్టమన్నారు.

లారెన్స్ పాస్టర్‌ను తెచ్చి నవాబు ముందు నిలబెట్టాడు.

నవాబు "నువ్వెవరు? " ప్రశ్నించారు.

లారెన్స్ పాస్టర్‌కు అర్థమయింది.. ఈసారి పాపం పండిందని. ఇన్నాళ్ల తర్వాత అతడికి తెలిసివచ్చింది. ఇంత కాలం అతడు ఆంగ్లేయుల పేరుపై కళం కం అంకితపరిచాడు. 'ఇప్పుడు ఆంగ్లేయు డుగా మరణిస్తాను' అనుకున్నాడు.

"నా పేరు లారెన్స్ పాస్టర్"

"నీ జాతి ఏమిటి? "

"ఆంగ్లేయులం"

"ఆంగ్లేయులు మాకు శత్రువులు. ను వ్వు శత్రువువైై కూడా మా సైన్యంలో ఎందుకు చేరావు? "

"చేరాను! ఇప్పుడు మీ ఇష్టం వచ్చిన శిక్ష విధించండి! మీ బందీని! ఎందుకు చేరానో అడగాల్సిన అవసరం లేదు. అడిగినా నా నుంచి జవాబు రాదు"

ఆ జవాబుకు నవాబు అప్రసన్నుడు కాలేదు. పైగా నవ్వి "అర్థమైంది. నీవు భయపడటం లేదు. సత్యం చెబుతావా? " ప్రశ్నించారు.

"ఆంగ్లేయుడెప్పుడూ అసత్యం చెప్పడు"

"సరే! పరీక్ష జరుగుతుంది" అని చంద్ర శేఖర్‌ను ప్రవేశపెట్టమన్నారు.

నవాబు చంద్రశేఖర్‌ను లారెన్స్‌కు చూ పి "ఇతన్ని గుర్తించగలవా? " అడిగారు.

"పేరు విన్నాను. కానీ చూడలేదు"

నవాబు "కులుసూమ్ దాసిని ప్రవేశపె

## కొత్తగాలి...

**తప్పులు**
**జీవితమనే గోడకు**
**కొట్టిన మేకులు!**
**మేకులు తీసేసినా**
**మచ్చ మాసిపోదు!**

– ముదిగొండ అరుణరేఖ,
ఎల్. బి. నగర్, హైదరాబాద్

ట్టండి" ఆదేశించారు.

కులుసూమ్ ప్రవేశించింది.

నవాబు ఆమెను చూపుతూ పాస్టర్‌తో "ఈమెను గుర్తించగలవా? " ప్రశ్నించారు.

"తెలుసు"

"ఈమె ఎవరు? "

"మీ సేవకురాలు"

అప్పుడు ఇరఫాన్ మహమ్మద్ తకీని తెచ్చి నవాబు ముందు నిలబెట్టాడు.

మహమ్మద్‌తకీ ఈ చిక్కు నుండి తప్పించుకోవటానికి అనేక ప్రయత్నాలు చేశాడు. శత్రువులతో చేతులు కలపాలను కున్నాడు. కానీ అతడి ఎత్తులు పారలేదు. అతడు మోసగాడని అతడిపై నవాబు సైనికులు దృష్టిపెట్టి ఉంచారు. మహ మ్మద్ అలీ ఇబ్రహీం ఖాన్ అతన్ని సునా యాసంగా బంధించి తెచ్చాడు.

నవాబు మహమ్మద్‌తకీ వైపు చూడకుం డానే కులుసూమ్‌తో "కులుసూమ్! నీవు ముంగేరీ నుండి కలకత్తా ఎలా చేరుకు న్నావో చెప్పు" అన్నారు.

కులుసూమ్ పొల్లు పోకుండా విషయ మంతా మనవి చేసింది. దలినీ బేగం వి షయం కూడా వివరించింది. తర్వాత చే తులు జోడించి, కళ్ల నుండి కన్నీరు ప్రవ హిస్తుండగా కంఠం హెచ్చించి "జహాపనా! సభా సదులందరి ముందు మనవి చేస్తు న్నాను. ఈ మహమ్మద్ తకీ మహా పా పాత్ముడు. దలినీ బేగాన్ని చంపిన స్త్రీ హం తకుడు. నా యజమాని భార్యను అవమా నించాడు. యజమానిని మోసం చేశాడు. మహిళల్లో మణివంటి దలినీబేగాన్ని భయం, భక్తి లేకుండా చీమలా నలిపేశా డు. ప్రభూ! ఈ తుచ్ఛుడ్ని చీమలా నలిపి చంపించండి" అంటూ మనవి చేసింది.

తకీ రుద్ధ కంఠంతో "ఇది అబద్ధం. నీ మాటకు సాక్ష్యమేముంది? " అడిగాడు.

కులుసూమ్ కళ్లు పెద్దవి చేస్తూ "నా మాటకు సాక్ష్యమా? " అంటూ పైకి చూసి "నా మాటకు భగవంతుడే సాక్ష్యం. నీ గుండెపై చేయుంచుకుని చెప్పు! నువ్వే సాక్ష్యం. ఇంకా అవసరమైతే ఈ ఆంగ్లే యుణ్ని అడుగు" అంది.

నవాబు "పాస్టర్! ఈ సేవకురాలు చెప్పిందంతా సత్యమేనా? నువ్వు కూడా అమియట్ వెంట వున్నావు. ఆంగ్లేయులు అసత్యమాడరని చెప్పావు. ఇప్పుడు చెప్పు" ఆదేశించారు.

లారెన్స్ పాస్టర్ తనకు తెలిసిన విషయం అంతా తెలిపాడు.

అందరికీ దలినీ పరిశుద్ధురాలని, ఆమె ఏ తప్పూ చేయలేదని తెలిసింది. మహ మ్మద్ తకీ తలవంచుకున్నాడు.

అప్పుడు చంద్రశేఖర్ ముందుకు వచ్చి "మహారాజా! ఈమె.. కులుసూమ్ చెప్పిం దంతా సత్యమే. దీనికి నేను సాక్షిని. నేనే ఆ బ్రహ్మచారిని" అని చెప్పి "నవాబు గారూ! నాదొక మనవి. సత్యవాది అయిన ఆ ఆంగ్లేయుడిని ఒకటి రెండు ప్రశ్నలు అడగండి" మనవి చేశాడు.

నవాబుకు అర్థమయింది. చంద్రశేఖ ర్‌తో "మీరే అడగండి. దుబాసి అర్థం చేయించగలడు" ఆజ్ఞ ఇచ్చారు.

చంద్రశేఖర్ పాస్టర్‌తో "ఎప్పుడైనా చంద్రశేఖర్ పేరు విన్నావా? నేనే ఆ చంద్రశేఖర్‌ను. నువ్వు ఆయన..."

చంద్రశేఖర్ మాట పూర్తి కాకుండానే..

"మీరు కష్టపడాల్సిన అవసరం లేదు. నేను స్వతంత్రుడ్ని. మరణానికి భయపడను. ఇక్కడ ఏ ప్రశ్నకైనా జవాబివ్వడం నా ఇష్టంపై ఆధారపడి ఉంది. మీ ప్రశ్నలకు జవాబివ్వను" అన్నాడు.

నవాబు శైవలినిని ప్రవేశపెట్టమని ఆజ్ఞాపించారు.

శైవలినిని తీసుకు వచ్చారు.

పాస్టర్ మొదట ఆమెను గుర్తించలేకపోయాడు. ప్రస్తుతం ఆమె రోగిష్టి. చిక్కిపోయింది. చిరిగిన దుస్తుల్లో ఉంది. ఎండిపోయిన తలనీలాలు, శరీరంపై దుమ్ము ధూళి.. ముఖంపై పిచ్చి నవ్వు.. కళ్లలో పిచ్చిచూపులు..

పాస్టర్ వణికిపోయాడు.

నవాబు "ఈమె తెలుసా? " పాస్టర్‌ను ప్రశ్నించారు.

"గుర్తించాను"

"ఈమె ఎవరు? "

"శైవలిని. చంద్రశేఖర్ భార్య"

"నీవెట్లా గుర్తించావు ఆమెను? "

"మీరు ఏ శిక్ష విధించినా అనుభవిస్తా కానీ ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేను" అన్నాడు పాస్టర్.

నవాబు "నేను నిన్ను కుక్కలతో కరిపించి చంపించాలనుకుంటున్నా" అన్నారు.

పాస్టర్ ముఖం వాడిపోయింది. కాళ్లు చేతులు వణకసాగాయి. కొద్ది సేపటికి ధైర్యం తెచ్చుకుని "మహారాజా! నాకు మరణదండనే మీ నిర్ణయమైతే మరోవిధంగా శిక్షించండి" అన్నాడు పాస్టర్.

నవాబు "నీ వంటి పాపాత్ములకు ఇది మా దేశంలో విధించే ఒక ప్రాచీన శిక్ష. నేరగాణ్ని నడుం వరకు గుంతలో పాతిపెట్టి అతని పైకి, శిక్షణ ఇచ్చిన జాగిలాల్ని కరవడానికి విడిచి పెడతారు. అవి కరిచిన గాయాలపై ఉప్పు, కారం చల్లుతారు. కుక్కలు అతని శరీరాన్ని పీక్కుని మాంసం తిని వెళ్లిపోతాయి. సగం తిని మిగిలిపోయిన మనిషి గుంతలో అలాగే ఉంటాడు. ఆ కుక్కలు మళ్లీ ఆకలైనప్పుడు వచ్చి తిని పోతుంటాయి. నీకూ ఈ మహమ్మద్ తకీకి కూడా ఇదే శిక్ష" అంటూ వివరంగా చెప్పారు.

అది విని, బంధితుడైన మహమ్మద్ తకీ బాధిత పశువులా అరవసాగాడు.

పాస్టర్ మోకాళ్లపై కూర్చొని పైకి చూస్తూ చేతులు జోడించి భగవంతుని మనసులో ప్రార్థిస్తూ..

'ఓ భగవంతుడా! నేనెప్పుడూ నిన్ను పిలువ లేదు. నీ గురించి ఆలోచించలేదు. పాపాలే చేస్తూ వచ్చాను. నువ్వెవరో నా మనసెప్పుడు తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు. నేను ప్రస్తుతం నిస్సహాయ స్థితిలో నిన్ను వేడుకుంటున్నాను. దయామయా! నన్ను కాపాడు' అనుకున్నాడు.

ఎవరికీ ఆశ్చర్యం కలుగలేదు. భగవంతుడ్ని నమ్మనివాడు కూడా ఆపత్కాలంలో అతని శరణు వేడుతాడు. భక్తితో పిలుస్తాడు. పాస్టర్ కూడా అదే చేశాడు.

కళ్లు కిందకు వాల్చిన పాస్టర్ దృష్టి డేరా బయటకు వెళ్లింది. అకస్మాత్తుగా అక్కడ జటాజూట ధారి, కాషాయాంబరధారి, తెల్లని గడ్డం, ప్రసన్న వదనంతో ప్రకాశిస్తున్న వ్యక్తి పాస్టర్‌నే చూడసాగాడు. పాస్టర్ అతని కళ్లవైపు చూస్తుండిపోయాడు. నెమ్మదిగా పాస్టర్ అతనికి వశీభూతుడయ్యాడు.

అతని కళ్లు నెమ్మదిగా మూతలు పడసాగాయి. నిద్రమత్తుకు గురయ్యాయి. శరీరం శైథిల్యం చెందసాగింది. ఆ జటాజూటధారి పెదవులు కదలసాగాయి.

గంభీరమైన వాక్కులు పాస్టర్ చెవులకు చేరసాగాయి.

"నిన్ను కుక్కల మృత్యుదండన నుండి రక్షిస్తాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పు!" ఆదేశించింది

"నువ్వు శైవలినికి ఉపపతివా? "

పాస్టర్ శైవలిని వైపు ఒకసారి చూసి "కాదు" అరిచాడు.

అందరూ "కాదు! నేను శైవలినికి ఉప పతినే కాదు" అన్న పాస్టర్ మాటలు విన్నారు.

అదే వజ్రపాతం వంటి గంభీర ధ్వని పాస్టర్‌ను ప్రశ్నించింది. అది నవాబా? చంద్రశేఖరా? లేక మరో కంఠమా? పాస్టర్ అర్థం చేసుకోలేదు. కేవలం గంభీర ధ్వనితో ప్రశ్న వెలువడింది.

"శైవలిని నీ నావలో ఎందుకుంది? "

పాస్టర్ పెద్ద కంఠంతో "నేను శైవలిని సుందర రూపానికి ముగ్ధుడనయ్యాను. ఆమెను గృహం నుండి అపహరించుకు వచ్చాను. నా మనసులో ఆమె నాయందు ఆసక్తురాలని భావించాను. కానీ అది నా భ్రమ మాత్రమే. ఆమెకు అలాంటి భావం కలగలేదని గ్రహించాను. ఆమె నా శత్రువు. మొదటిసారి నావ పైన నన్ను చూసి కైజారు తీసింది. నాతో 'నీవు నా గదిలో ప్రశించినట్లైతే, ఇద్దరం చస్తాం జాగ్రత్త. నేను నీ తల్లిలాంటి దాన్ని' అంటూ హెచ్చరించింది. అప్పట్నుండి నేనామెను సమీపించలేదు. చివరకు నేనామెను స్పృశించను కూడా లేదు" అరచినట్లుగా చెప్పాడు.

అందరూ ఆ మాటల్ని విన్నారు.

చంద్రశేఖర్ "నువ్వామెకు నీ భోజనం ఎలా తినిపించావు? " ప్రశ్నించాడు.

"ఒక్కరోజు కూడా ఆమె నా అన్నం తినలేదు. స్వయంగా వండుకుని తినేది" జవాబు చెప్పాడు పాస్టర్.

"ఏం వండుకునేది? "

"కేవలం అన్నం మాత్రమే! పాలతోనే దాన్ని భుజించేది"

"మరి నీళ్లు? "

"గంగానది నుండి తీసుకునేది"

అదే సమయంలో బయట భీకరంగా.. దడం.. దడం... దం.. దం.. శబ్దం..

నవాబు "అదేం శబ్దం? " అడిగారు.

ఇరఫాన్ బాధిత కంఠంతో "ఇంకేముంది సరకార్! అది ఫిరంగుల మోత-ఆంగ్లేయుల సైన్యం మన సైన్యంపై దాడికి దిగింది" చెప్పాడు.

ఒకేసారి గుడారంలోని వారందరూ ఒకర్నొకరు తోసుకుంటూ బయటకు పరుగులు తీశారు.

దుడుం.. దుడుం.. దుం.. దుం.." మళ్లీ శబ్ద ఘోష అనేక వైపుల నుండి వినిపించసాగింది. ఫిరంగుల మోత.. భేరీల మోత.. చుట్టూ కోలాహల వాతావరణం.. అశ్వాల పదఘట్టనలు.. అస్త్రశస్త్రాల ప్రయోగ ధ్వనులు, సైనికుల జయఘోషలు.. సముద్రపు అలల ఘోషలా వ్యాపించాయి. ఆకాశమంతా పొగతో నిండిపోయింది. నిద్రించే స్థితిలో కడలి ఉవ్వెత్తున లేచిన అలల తాకిడిలా ఆ ప్రదేశమంతా దద్దరిల్లసాగింది.

అధికారులు, మంత్రులు, సేవకులు.. బయటికి వచ్చారు. కొందరు యుద్ధ క్షేత్రం వైపు పోతే మరికొందరు ప్రాణరక్షణ కోసం పరిగెత్తుతున్నారు. కులుసూమ్, చంద్రశేఖర్, శైవలిని, పాస్టర్ బయటకు వచ్చారు.

గుడారంలో కేవలం నవాబు, బంధిత మహమ్మద్ తకీ మిగిలిపోయారు. అదే సమయంలో ఫిరంగి నుండి వెలువడిన మండే గోళం వచ్చి డేరాపైన పడింది. అప్పుడే నవాబు లేచి నిలబడి తన కరవాలాన్ని ఒర నుండి లాగి మహమ్మద్ తకీ గుండెల్లో దించారు. క్షణంలో తకీ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిశాయి. నవాబు డేరా బయటకు వచ్చారు.

★ ★ ★

శైవలినితో డేరా బయటకొచ్చిన చంద్రశేఖర్ రామానందస్వామిని చూశాడు.

స్వామీజీ "నాయనా చంద్రశేఖర్! ఇప్పుడేం చేయదలిచావు? " అడిగాడు.

చంద్రశేఖర్ "ఈ స్థితిలో ఈమె ప్రాణాలు ఎలా కాపాడాలి? నలువైపుల్నుండి ఫిరంగి గుండ్లు వర్షిస్తున్నాయి. పొగతో అంతా అంధకారమయంగా వుంది. ఎక్కడికి వెళ్ళాలి? " అన్నాడు.

"విచారపడకు! చూస్తున్నావు కదా! యవన సేన ఏ దిక్కుగా పరుగెడుతోందో..! యుద్ధం ప్రారంభంలోనే యవనులు వెన్నుచూపి పారిపోతున్నారు. ఇక విజయం ఎలా లభిస్తుంది? ఆంగ్లేయ జాతి చాల అదృష్టజాతి. అంతేకాదు వాళ్ళ శక్తిసామర్థ్యాలతో బాటు బుద్ధి కుశలత గలవాళ్లు. ఒకరోజు మొత్తం భారత భూమిని ఆక్రమిస్తారు. మనం కూడ ఆ పరుగులు తీసే యవన సైనికుల వెనుకనే పరుగెడుదాం. నిన్ను, నన్ను గురించి చింతలేదు. ఈ యువతి గురించే చింత" అన్నాడు రామానందుడు.

ముగ్గురూ సైనికుల వెంట పరుగెట్టారు.

అకస్మాత్తుగా ఓ పర్వత గుహ నుండి సుశిక్షిత సేనావాహిని వెలువడి రణభూమిలో ఆంగ్లేయ సైన్యంతో పోరాడేందుకు ముందుకు సాగుతోంది. సైన్యం మధ్యలో అశ్వాన్నధిరోహించి సేనానాయకుడున్నాడు. అతన్ని గుర్తించారు రామానంద, చంద్రశేఖర్‌లు. అతడు ప్రతాప్‌రాయ్.

చంద్రశేఖర్ ప్రతాప్‌ను చూసి విచారగ్రస్తుడయ్యాడు. అతన్ని చేరి ప్రతాప్‌తో "అజేయమైన ఈ యుద్ధంలో నువ్వెందుకు నిలిచావు? పద వెనక్కు" అన్నాడు.

"నేను మిమ్మల్ని వెదకటానికే వచ్చాను. సురక్షిత ప్రదేశంలో మిమ్మల్ని వదలివస్తాను పదండి" అంటూ ఆ ముగ్గుర్నీ సైన్యం మధ్యలోకి చేర్చి వెనక్కి మళ్ళాడు.

ప్రతాప్‌కు అక్కడి పర్వత ప్రాంతాలన్నీ కొట్టినపిండి కావటంతో తక్కువ సమయంలోనే వారిని సురక్షిత ప్రదేశం చేర్చాడు. అదే సమయంలో నవాబు దర్బార్‌లో జరిగిన విషయం అంతా చంద్రశేఖర్ ద్వారా తెలుసుకున్నాడు.

చంద్రశేఖర్ ప్రతాప్‌తో "ప్రతాప్! నీవు ధన్యుడివి. నీకు తెలిసిన విషయమంతా నాకు విదితమే" అన్నాడు.

ప్రతాప్ ఆశ్చర్యంతో చంద్రశేఖర్ ముఖం చూస్తూండిపోయాడు.

చంద్రశేఖర్ దుఃఖస్వరంతో "ఈమె పవిత్రురాలని తెలుసుకున్నాను. లోకం కోసం ప్రాయశ్చిత్తమవసరమైతే చేయిస్తాను. ఈమెను ఇంటికి తీసుకుపోతాను. కానీ నేను సుఖాన్ని పొందలేను" అన్నాడు.

"ఎందుకు? స్వామీజీ దివ్య ఔషధంతో ఫలితం కలుగలేదా? "

"ఇప్పటివరకు ఫలితం కానరాలేదు"

ప్రతాప్ చింతాగ్రస్తుడయ్యాడు. అతని కళ్ళు నీటితో నిండిపోయాయి.

శైవలిని అలాగే చూడసాగింది. కొంత పక్కకు జరిగి చేతి సైగతో ప్రతాప్‌ను దగ్గరకు రమ్మంది.

ప్రతాప్ అశ్వందిగి దగ్గరకెళ్ళాడు.

శైవలిని లోగొంతుతో ఎవరూ వినకుండా "ప్రతాప్! నా ఒక్కమాట వింటావా? నేనేమీ చెడ్డ విషయం చెప్పను" అంది.

ప్రతాప్ విస్మితుడై అన్నాడు "నీ పిచ్చితనం అంతా బూటకమా? "

"ఇప్పుడు మాత్రం. ఈ రోజు ప్రాతఃకాలం శయ్య నుండి లేవగానే నాకన్ని విషయాలు తెలిసి వస్తున్నాయి. నేను నిజంగా పిచ్చిదాన్నయ్యానా? " అంది.

ప్రతాప్ ముఖం వికసించింది. శైవలిని అతని మనస్థితినర్థం చేసుకొని, వ్యగ్రతతో "ష్! ఇప్పుడేం మాట్లాడకు. నేనే స్వయంగా అన్నీ చెబుతా. అదీ నువ్వు ఆజ్ఞాపిస్తేనే" అంది.

"నా ఆజ్ఞ ఎందుకు? " అడిగాడతను.

"నా భర్త నన్ను తిరిగి స్వీకరిస్తే, నా పాపాన్ని దాచిపెట్టి ఆయన్ని సేవించడం ఉచితమా? "

"నువ్వేం చెప్పదలిచావు? "

"పాత విషయాలన్నీ చెప్పి క్షమాపణ వేడుతాను"

ప్రతాప్ ఆలోచించి "నిన్ను ఆశీర్వది స్తాను. ఈసారి నువ్వు సుఖంగా వుండా లని నిన్ను ఆశీర్వదించగలను" అంటూ అతను కన్నీరు కార్చాడు.

"నేను సుఖపడలేను. నువ్వుండగా నాకు సుఖం వుండదు"

"ఎందుకని? "

"నువ్వు ఈ భూమిపై జీవించినంత కాలం నన్ను చూడకు. స్త్రీ జాతిది చాలా చంచలమైన బుద్ధి. ఎంతకాలం వశంలో వుంచుకుంటానో చెప్పలేను. నీవు మాత్రం మళ్ళీ నన్ను ఈ జన్మలో చూడబోకు" అంది శైవలిని స్థిరంగా.

ప్రతాప్ మాటాడలేదు. అశ్వమెక్కి కాలితో తట్టి రణక్షేత్రం వైపు పరుగెత్తిం చాడు. సైన్యం అతన్ననుసరించింది.

వెళుతున్న అతన్ని చంద్రశేఖర్ "ఎక్కడికి వెళుతున్నావు? " అంటూ అడిగాడు.

"యుద్ధక్షేత్రానికి"

చంద్రశేఖర్ వ్యాకులపడుతూ పెద్దగా అరిచి చెప్పాడు. "వెళ్ళకు! వెళ్ళకు! ఆంగ్లే యులతో యుద్ధం మేలు చేయదు"

"పాస్టర్ ఇంకా జీవితుడే. అతన్ని చంపాల్సిన అవసరముంది"

చంద్రశేఖర్ వేగంగా పరుగెత్తి అతని అశ్వపు కళ్ళెం పట్టుకుని ఆపి "చూడు ప్రతాప్! పాస్టర్‌ను చంపాల్సిన అవసరమే ముంది? పాపాత్ముడిని భగవంతుడే శిక్షి స్తాడు. నువ్వు, నేను శిక్షించేవాళ్ళమా? నీచుడైనవాడు శత్రువును హింసిస్తాడు. ఉత్తముడు క్షమిస్తాడు" అన్నాడు.

ప్రతాప్ విస్మితుడై పులకించిపోయాడు. అలాంటి గొప్ప 'పలుకు' అతనెవరి ముఖతాః వినివుండలేదు. అశ్వం దిగి చంద్రశేఖర్ పాదధూళి శిరసున దాల్చి, "మీరు మనుష్యుల్లో ధన్యులు. నేను మాత్రం పాస్టర్‌ను విడిచిపెట్టను" అంటూ మళ్ళీ అశ్వమెక్కి రణక్షేత్రంవైపు మళ్ళాడు.

"మరి యుద్ధక్షేత్రం వైపు ఎందుకు వెళు తున్నావు? " చంద్రశేఖర్ అడిగాడు.

ప్రతాప్ ముఖం అతనివైపు తిప్పి నవ్వు తూ మృదుస్వరంతో "రణక్షేత్రంలో నా అవసరముంది" అంటూ నిలవకుండా గుర్రాన్నదిలించి వేగంగా సాగిపోయాడు.

అతని నవ్వు చూసి రామానందుడు వ్యాకులపడ్డాడు. ఆయన చంద్రశేఖర్‌తో "వత్సా! నీ భార్యను తీసుకుని వేదగ్రామం వెళ్ళు. నేను స్నానానికి గంగానదికి వెళుతు న్నాను. ఒకటి రెండు రోజుల తర్వాత వేదగ్రామంలో కలుస్తాను" అన్నాడు.

"స్వామీ! నాకు ప్రతాప్ గురించి చాలా బాధ కలుగుతోంది" అన్నాడు చంద్రశేఖర్.

"నువ్వు విచారించకు! నేను అతన్ని గురించి తెలుసుకుంటాను" అని చంద్రశే ఖర్, శైవలినిలకు వీడ్కోలు పలికి రామా నందుడు యుద్ధక్షేత్రం వైపు నడిచాడు.

అక్కడంతా హాహాకారాలు.. ఫిరంగి మోతలు.. పొగమేఘాలు.. సైనికుల ఖం డిత అంగాలు.. శవాల కుప్పలు.. చచ్చిన వారు కొందరు.. సగం చచ్చినవారు మరి కొందరు.. ఒకరిది గుండె పగిలివుంది.. ఒకచోట మంటలు మండుతున్నాయి.. మరోచోట నీటి కోసం అరుపులు.. ఏడు పులు.. బాధతో పెడబొబ్బలు.. కొందరు తల్లీ తండ్రి.. పిల్లలు.. భార్య.. స్నేహి తుల పేర్లు పిలుస్తూ అరుస్తున్నారు.. ఏడుస్తున్నారు.. అంతా బీభత్సం.. అందు లో రామానందుడు ప్రతాప్ కోసం వెదుకు తున్నాడు. ఎక్కడా కనబడలేదు.

ఎందరో అశ్వసైనికులు మరణించారు. శరీరాలు రక్తంతో తడిసిపోయివున్నాయి. క్షతగాత్రులు కొందరు గుర్రాల కళ్ళాలు పట్టుకుని పారిపోతున్నారు. వాళ్లలో ప్రతా ప్‌ను వెదుకుతున్నాడు రామానందుడు.

అలిసిపోయిన స్వామి- ఓ చెట్టుకింద వేళ్ళపై కూర్చున్నాడు. అతడి ముందు

# పుస్తకావిష్కరణ



చిత్తూరు జిల్లా చౌడేపల్లిలోని విజయవాణి రెసిడెన్షియల్ స్కూల్ ఆవరణలో జూన్ 19న జరిగిన 'జయమ్' ఆవిష్కరణ సందర్భంగా రచయిత నాయుని కృష్ణమూర్తి దంపతులను సత్కరిస్తున్న భానుమూర్తి దంపతులు. గంటా మోహన్, మేపల్లి అబ్దుల్ ఖాదర్, అరుణకుమారి, సహదేవ నాయుడు, బాలకృష్ణారెడ్డి దంపతుల్ని చిత్రంలో చూడవచ్చు.

నుండి ఓ సైనికుడు పారిపోతున్నాడు. రామానందుడు అతన్ని ఆపి "మీరంతా పారిపోతున్నారు.. యుద్ధం ఎవరు చేశారు? అడిగాడు.

"ఎవరూ చెయ్యలేదు. ఒక హిందూవ్యక్తి మాత్రమే భయంకరంగా యుద్ధం చేస్తూ చాలామంది ఆంగ్లేయుల్ని చంపాడు" అన్నాడు ఆ సైనికుడు.

"అతడెక్కడున్నాడు? "

"రణరంగంలో అటు చూడండి" అంటూ అతడు పరుగెత్తుకుపోయాడు.

స్వామీజీ... ఆ వైపు నడిచాడు.

అక్కడ అప్పుడు యుద్ధం జరగడం లేదు. చాలామంది హిందువుల, ఆంగ్లేయుల శవాలు కుప్పలు.. కుప్పలుగా పడున్నాయి. వాళ్లలో ప్రతాప్‌ను రామానందుడు వెదుకుతున్నాడు. ఒకచోట శవాల కింద నుండి మూలుగులు వినిపించాయి. రామానందుడు మూలిగే అతన్ని బయటకు లాగాడు.

అతను ప్రతాప్!

అతడు బాగా గాయపడ్డాడు.. మరణాసన్నుడు.. కానీ ప్రాణముంది.

రామానందుడు నీళ్ళు తెచ్చి అతనికి తాగించాడు. ప్రతాప్ అతన్ని గుర్తించి ప్రణామం చేయడానికి చేతులెత్తబోయాడు.. కానీ ఎత్తలేకపోయాడు.

రామానందుడు, అతడి శిరస్సున చేయుంచి "నువ్వు స్వస్థుడవు కావాలని నిన్ను ఆశీర్వదిస్తున్నాను" అన్నాడు.

ప్రతాప్ చాలా కష్టంగా "స్వస్థతా? స్వస్థత పొందడంలో ఆలస్యం లేదు. మీ చరణ ధూళి నా శిరస్సున వుంచండి చాలు" అన్నాడు.

"మేం నిన్ను వారించాం. విజయావకాశంలేని, ఈ యుద్ధరంగంలో ఎందుకు ప్రవేశించావు? శైవలిని చెప్పటం వల్ల ఇలా చేశావా? " ప్రశ్నించాడు.

"మీరెందుకలా భావిస్తున్నారు? "

"నువ్వు శైవలినితో సంభాషించినప్పుడు- నీ ముఖంలోని భావాల్లో నాకలా కన్పించింది. ఆమె పిచ్చిది కాదు. స్వస్థురాలైంది. పూర్తిగా నిన్ను పరిత్యజించలేదు" అన్నాడు రామానందుడు.

"ఆమె నన్ను మరెప్పుడు తన ముఖం చూడవద్దంది. నేను బతికి వున్నంతవరకు ఆమె దాంపత్యం సుఖమయం కాదని గ్రహించాను. ఆమె నన్ను మరిచిపోదు. ఆమె నాకు కూడ చాలా ప్రియమైంది. అందరికంటె అధికంగా నా మేలు కోరేది ఆమే! వాళ్ల జీవితాల్లో నేను కంటకంగా బతికివుండటం సరైంది కాదని భావిం

చాను. మీరు వారించినా వినకుండా రణ భూమికి వచ్చాను. ఇక్కడ ప్రాణత్యాగం చేయడానికే వచ్చాను. నేను బతికి వుంటే శైవలిని చిత్తం ఎప్పుడైనా చంచలం కావచ్చని ఈ నిర్ణయానికి వచ్చాను" అంటూ చెప్పాడు ప్రతాప్.

రామానందుని కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. గతంలో ఆయన కన్నీళ్ళు కారుస్తుండగా చూచినవాళ్ళు లేరు.

ఆయనే ప్రతాప్‌తో "ఈ ప్రపంచంలో నీవు మాత్రమే పరోపకారివి. మేం మోసగాళ్ళం. నీకు పరలోకంలో అనంత, అక్షయ, సుఖం లభిస్తుంది. కించిత్ సందేహం లేదు. కుమారా! విను. నేను నీ హృదయాన్ని గ్రహించాను. భూమండలాన్ని జయించిందానికంటె నీ యింద్రియ నిగ్రహం మహత్తరమైనట్టిది. నీవు శైవలినిని ప్రేమించావా? " అంటూ అడిగాడు.

నిద్రించిన సింహం మేల్కొన్నట్లు, మరణోన్ముఖుడైన ప్రతాప్ బలవంతుడై.. చంచలుడై.. పిచ్చివాడై.. హుంకరిస్తూ.. "ఓ సన్యాసీ! నీకేం తెలుసు? ఈ సర్వ జగత్తులో నా ప్రేమను అర్థం చేసుకునే వ్యక్తివున్నాడా? ఎవరికర్థమవుతుంది? పదహారు సంవత్సరాలుగా నేను శైవలినిని ఎంతగా ప్రేమించాను? నా హృదయంలో ప్రేమతప్ప ఆమెపై చెడు భావన నామమాత్రంగా కూడా లేదు. నా ప్రేమ కోసం ప్రాణత్యాగం చేస్తున్నాను. నరనరాన, ప్రతి రక్తకణంలో, ప్రతి ఎముకలో నాలో ప్రేమ ప్రవహిస్తోంది. ఏ మనిషీ దాన్ని గుర్తించలేదు. ఈ మరణ సమయంలో ఆ విషయాన్నెందుకు ప్రస్తావించారు? ఈ జీవితంలో ఆ ప్రేమకు క్షేమం లేదు. అందుకే నా శరీరాన్ని త్యజిస్తున్నాను. నా మనస్సు అపవిత్రమైంది. శైవలిని హృదయం ఏమవుతుందో? నేను మరణించటం కంటె మరో మార్గం లేదు. అందుకే మరణిస్తున్నాను. మరణాన్ని ఆహ్వానించాను. నాలో దాగున్న రహస్యాన్ని మీరు విన్నారు. మీరు జ్ఞానవంతులు. మీరు సర్వశాస్త్ర దర్శనీయులు. మీరే చెప్పండి నా పాపానికి ప్రాయశ్చిత్తమేముంది? నేను ఆ భగవంతుని ముందు నేరగాణ్ణా? ఒకవేళ తప్పుచేసి వుంటే ప్రాయశ్చిత్తంతో దూరం గాదా? " అంటూ వ్యధ, బాధ, దుఃఖం అన్నీ కూడిన కంఠంతో అడిగాడు.

రామానందుడు "అదేమిటో నాకు తెలియదు. మనుష్యుని జ్ఞానం ఇక్కడ వ్యర్థం. శాస్త్రాలు ఇక్కడ మౌనంగా వుంటాయి. నువ్వేలోకానికి వెళ్ళుతున్నావో ఆ లోకంలో వున్న ఈశ్వరునికి తప్ప మరెవరికీ తెలియదు. ఇంద్రియ నిగ్రహం ఒకవేళ పుణ్యమే అయితే అఖండ స్వర్గసౌఖ్యం నీదే. ఒకవేళ మనోనిగ్రహం పుణ్యమే అయితే దధీచిని మించిన స్వర్గాధికారం నీదే. నీలాంటి జితేంద్రియ శక్తి మరుజన్మలో నాకు లభించాలని ఆ భగవంతున్ని ప్రార్థిస్తుంటా" అని మౌనం వహించాడు.

నెమ్మదిగా ప్రతాప్ ప్రాణవాయువులు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

గడ్డి శయ్యపై అతని పార్థివ శరీరం పడి వుంది.

వెళ్ళు! ప్రతాప్ వెళ్ళు! అక్షయమైన పుణ్యలోకానికి వెళ్ళు! ఎక్కడైతే ఇంద్రియాల్ని జయించటం సులభమో, రూపాన్ని చూచి ప్రేమ, మోహం జనించవో, ప్రేమలో పవిత్రత వుందో అక్కడికి వెళ్ళిపో! ప్రేమ, రూపం, సుఖం అక్షయమో, సుఖంలోనే పుణ్యముందో అక్కడికి వెళ్ళిపో! ఇతరుల దుఃఖాన్ని తెలుసుకున్నవారు, ఇతరుల ధర్మాన్ని రక్షించేవారు, ఇతరుల విజయాన్ని జయగానం చేసేవారు, పరుల ప్రాణాల్ని కోరని వారున్న పుణ్యలోకానికి వెళ్ళిపో! అలాంటి మహోన్నతమైన లోకానికి వెళ్ళిపో! లక్షలాదిమంది శైవలినులను నీ చరణాలపైన చూసి నువ్వు ప్రేమించటాన్ని విరమించుకుంటావు. ©

పెద్ద కథ

# సోదరికి వాటా

పేదరికం మనిషి స్వభావాన్ని మార్చేస్తుంది. కాకపోతే, ఘుంరీ ఇద్దరు పిల్లలు ఓ చిన్న రొట్టెముక్కకి, బెల్లపుముక్కకి, బంగాళాదుంప కూరముక్కకి కుక్కాపిల్లి లాగ కీచులాడుకోరు. ఈ విషయాన్ని ఘుంరీ రోజూ చూస్తూనే వుంది. అయ్యగారి ఇంట్లోనూ వున్నారు అన్నా చెల్లెళ్లు. వాళ్ళూ పిల్లలే. కాని వాళ్లెప్పుడూ భోజనాల దగ్గర తగువులాడుకోరు సరికదా, తాము తినే లడ్డూ రసగుల్లాలు కాని మాంసం చేపలు గాని ఒకరి ప్లేటులోది యింకొకరు వేసుకుంటూ వుంటారు. చెల్లెలికి ఎక్కువగా పెట్టమని అన్న అంటాడు. చెల్లేమో అన్నకే ఎక్కువపెట్టమని మారాం చేస్తుంది. నువ్వేతీసుకో అంటే నువ్వేతీసుకో అంటూ లడ్డూ రసగుల్లాలు అన్న తన ప్లేటులోంచి చెల్లెలి ప్లేటులోకి విసిరేస్తే, చెల్లి తన ప్లేటులోంచి అన్నప్లేటులోకి విసిరేస్తుంది. అన్న శ్రీకాంత్, చెల్లెలు సుమతి ఇద్దరూ పసివాళ్ళే.

ఘుంరీ తన పిల్లలు సాకులా, సుహాగీలను తనతోబాటే తీసుకొని అయ్యగారింటికి పనిలోకి వెళ్తుంది. అలా పిల్లలిద్దర్నీ వెంటబెట్టుకొని వెళ్ళడానికి కారణం వుంది. అయ్యగారి పిల్లలు తినగా మిగిలిపోయిన లడ్డూ, గుడ్డు ముక్కలు, కేకుముక్కలు వగైరా తన పిల్లలు నోట్లో వేసుకుంటారని ఆమె ఉద్దేశ్యం. రోజుకూలీ తండ్రి, పనిమనిషి తల్లి - తమ పిల్లలకి కడుపునిండా తిండి పెట్టాలంటే కష్టమే. లడ్డుమిఠాయి, రసగుల్లా, గుడ్లు, చేపలు - ఇవన్నీ వాళ్ళకి వినే వస్తువులే గానీ తినే వస్తువులు కావు. అయితే ఘుంరీ పనిచేస్తున్న యింటి అయ్యగారు పేరుపొందిన డాక్టరు. ప్రభుత్వ హాస్పిటల్లో డాక్టరు. జీతానికి జీతం, సాయంకాలం పూట యింట్లోనే ఆస్పత్రి నడుపుతారు. వేలకివేలు సంపాదిస్తారు. అదీగాక అతని హస్తవాసి మంచిది. అతను చెయ్యిపట్టుకుంటే చాలు రోగుల జబ్బులు నయమవుతాయని ప్రతీతి. అందుచేత రెండుచేతులా డబ్బేడబ్బు. ఇంట్లో ఖర్చు అవుతున్నది ఎంత? అనే చింత అతనికి లేదు. ఎంత తినాలన్నా తినవచ్చు.

ఇద్దరే పిల్లలు. ఆ పిల్లలకి అమృతం కూడా రుచించదు. 'తింటూవుండే పిల్లలకి ఎప్పుడూ ఆకలే' అని అందుకే అంటారు. అయితే ఘుంరీకి అలా అనిపించదు. అన్నాచెల్లెల్లిద్దరూ తమతమ ప్లేట్లలో ఉన్న గుడ్లు, పళ్ళు, పాలు, బిస్కట్లు ఒకరు యింకొకరి ప్లేట్లలో వేసుకొంటూ వుంటారు. గారంతో దబ్బుదబ్బున అడుగులు వేసుకొంటూ 'నాకే ఎక్కువగా పెడతారేం? నీకు పెట్టరేం?' అంటూ అన్నాచెల్లెల్లిద్దరూ వాదులాడుకొంటారు. 'ఇంత ఎక్కువ నాకు వద్దు, నువ్వేతిను' అంటూ అన్నప్లేట్లో చెల్లీ, చెల్లిప్లేట్లో అన్నా వేసేస్తూ ఉంటారు, తమ ప్లేట్లలో ఉన్నది. పిల్లలిద్దరూ తగువులాడుకొంటూ వుంటే అమ్మగారికి నచ్చదు. కోపగించుకుంటారు. పిల్లలిద్దరి ప్లేట్లూ తెచ్చి ఘుంరీ ముందు పెడుతూ 'వీళ్ళిద్దరికీ తినడానికి ఏమీ పెట్టకూడదు. ఆకలేస్తే వాళ్ళే అడుగుతారు. తీస్కో, నీ పిల్లలకిచ్చెయ్. పిల్లలు గదా తింటారని ప్రేమతో పెడితే నెత్తికెక్కి కూర్చుంటున్నారు' అని ఆమె అంటుంది.

ఆ తర్వాత ఘుంరీ పిల్లలిద్దరూ 'అంతా నాకేకావాలి' అని అంటూ ఒకర్ని ఒకరు తోసుకుంటారు. ఘుంరీ మాత్రం ఎకరికి ఎంతని యివ్వగలదు. చెరిసగం యిస్తుంది. వాళ్ళు తృప్తిపడరు. సాకులా సుహాగీ జుత్తు పీకేస్తాడు. సుహాగీ ఆడపులిలాగ సాకులాని గోళ్ళతో రక్కేస్తుంది. శ్రీకాంత్, సుమతిలు వీళ్ళని చూసి పొట్టలు చెక్కలయ్యేటట్టు నవ్వుకుంటారు. బ్రహ్మని మింగేసిన ఈ పిల్లలు బ్రహ్మాండాన్ని మింగేసిన తర్వాత కూడా యింకా కావాలి అనే అంటారు. ఛీ...ఛీ... అన్నాచెల్లెళ్లలో ప్రేమ, అనురాగం లేనేలేవు. పేదవాళ్ళ యింట్లో పుట్టినందువల్ల ఆకలి, లోభం, స్వార్థం తమతమనాలుకలు చాపుకొంటూ పొట్టల్లో మండుతూ వుండాలా! ప్రేమ, మమత, మానవత్వం కొంచెం కూడా వుండొద్దా?

వాళ్ళని చూడండి.. మీ కళ్ళముందే ఉన్నారు శ్రీకాంత్‌బాబు, సుమతిబేబీ. మీకంటే ఆరేడునెలలు పెద్ద అయి ఉంటారు. అన్నయ్యకోసం చెల్లెమ్మ, చెల్లెమ్మకోసం అన్నయ్య ప్రాణమిస్తారు. తాము నోటి దగ్గర పెట్టుకొన్న ముద్దని కూడా ఒకరికి ఒకరు యిచ్చుకుంటారు. వాళ్ళని చూస్తే చాలు కడుపు నిండిపోతుంది. సాకులా సుహాగీలు రోజూ వీళ్ళని చూస్తారు. అయినా ఏమీ నేర్చుకోరు. ఎప్పుడు చూసినా ఈర్ష్యతోను, లోభంతోను నీది నాది అనుకుంటూ తగువులాడ్డం తప్ప మరొకటి తెలీదు మీకు. ఏమోనండి, ఎవరి వద్ద ధనం వుంటుందో వాళ్ళు పెద్ద మనసుతో ఉంటారు. ఎవరు నిర్భాగ్యులో, ఎవరికి పైసా రాబడి వుండదో వాళ్ళ మనస్సు చిన్నదిగానే వుంటుంది.

ఘుంరీ ఆస్తి అంతా ఆ యిద్దరు బిడ్డలే. సాకులా కొంచెం పెద్దవాడయితే తిండికింత సంపాదిస్తాడు. సుహాగీకి పెళ్ళీడు రాగానే బుద్ధి మంతుడైన మంచికుర్రాడ్ని చూసి పెళ్ళి చేసేస్తే ఘుంరీ నిశ్చింతగా వుంటుంది. ఎకరికోసం సంపాదించాలి తను. అయినా మిగిలితేగదా దాచుకోవడానికి, సాకులా తండ్రి ఓ బద్ధకస్తుడు. ఒక రోజు కూలికి వెళ్తే రెండ్రోజులు నిద్రపోతాడు. ఒకరోజు కూలి డబ్బులు తెస్తే రెండ్రోజులు ఆ డబ్బుల్ని వూదేస్తాడు. అతని డబ్బుల్లో దాచుకోడానికి ఏమీ మిగలదు. బతికి చల్లగా వుంటే చాలు. మహానది ఆనకట్ట కింద ఓ గుడిసెలో ఉంటోంది ఘుంరీ కుటుంబం. అదీ అద్దెకు, పెద్ద మీసాలున్న ఒకతను లూనా మీద వస్తాడు అద్దెవసూలు చేయడానికి. నెలకి పదిహేను రూపాయిలు. ప్రతి ఏడాదీ శ్రావణ మాసంలో నదిలో వరదలు. ఆనకట్ట కిందని వుండే ఆ కూలిజనాల గుడిసెల్లోకి వరదనీరు వచ్చేస్తుంది. అలాంటప్పుడు అద్దెకుండే ఆ కూలిజనమంతా పిల్లి తన పిల్లల్ని తిప్పినట్టు తమ పిల్లలు, తట్టాబుట్టలతో ఇటూ అటూ చెదిరిపోతారు. వరదనీరు తగ్గిన తర్వాత ఆ అభాగ్యులంతా తమతమ గుడిసెల్ని తిరిగి కట్టుకుంటారు. మట్టికుమ్మి, ముద్దలుచేసి గోడలు పెట్టుకుంటారు. ద్వారాలు అమర్చుకుంటారు. గుడిసెల మీద ఏ గడ్డీ గాదరో కప్పుకుంటారు. ఈ పనులన్నీ అయ్యాక చల్లగా వస్తాడు అద్దె వసూలికి ఆ ఓనరు. ఏం ఓనరో! ఆనకట్ట కిందనున్న ఆ స్థలం సర్కారు వారిదని ఘుంరీ వింది. ఆ నేలమీద పేరుకే గుడిసెలు, ఆ ఓనరు కట్టేడు. అవాల్టినుంచి ఆ మీసాలాయనే ఆ గుడిసెలకి ఓనరు. మొదట్లో అద్దె అయిదు రూపాయిలే. అలాగలాగ ఆ అద్దె యిప్పుడు పదిహేనుకి పెరిగింది. అయితే వరదలొచ్చి కొట్టకుపోయిన గుడిసెల్ని బాగుచేసేపని అద్దెకున్నవాళ్ళదే. ఓనరు బాగుచేయడు. ఆ విషయాన్ని ఎవ్వరూ నోరుతెరిచి అడగలేరు. వరదలొచ్చిన ప్రతి ఏడాదీ అద్దె పెరుగుతూ

వుంటుంది. ఈ ఏడాది ఇరవై అవుతుంది. నెలకి ఇరవై రూపాయిలంటే ఘుంరీ విషయంలో ఎక్కువే. డాక్టరయ్యగారు అప్పుడప్పుడు ఆమెకు సహాయపడుతూ వుంటారు. ఆమె కష్టాల్లో ఉన్నప్పుడు రోగాలొచ్చినప్పుడు మందులు, మాత్రలు ఉచితంగా యిస్తూనే ఉంటారు. ఘుంరీ రోజుకొకపూటే తింటుంది. ఒక్కొక్కప్పుడు సాకులా సహోగీలు ఆ తిండినీ కడుపునింపుకోనివ్వరు. అలాంటప్పుడు యిన్ని నీళ్ళు తాగి కడుపు నింపుకొంటుంది. అయినా ఆమెకు ఏదో దిగులు. ఎందుకో మరి?

అవును.. ఆమెకు దిగులే. తానెలా కన్నుమూస్తుందా అనేది ఆమె దిగులు. ఎక్కడ కన్ను మూస్తుంది? కాళ్ళు చేతులు కదలాడుతున్నప్పుడు తను చనిపోతే ఘుంరీకి ఏ చింతా లేదు. సాకులా ఎప్పుడు పెద్దవాడవుతాడు? ఎప్పుడు మా ముసలోల్లని కూర్చోబెట్టి తిండి పెడతాడు? చూద్దాం.. ఇంక చాలాకాలం ముందుంది. ఇంక చావంటారా? అది ఎప్పుడన్నా రావచ్చు, ఎలా అన్నా రావచ్చు. తనలాంటి మొండివాళ్ళు ముసలితనం కాలాన్ని ఎలా గడుపుతారో, ఎలా చనిపోతారో ఈ ఘుంరీ కూడా అలాగే పోతుంది. తను పోయాక కూడా అన్నాచెల్లెళ్ల మధ్య యిప్పటిలా నీదినాదీ అంటూ తగువులాడుకొనే పరిస్థితే వుంటుందో ఏమో! కుటుంబం ఏర్పడ్డాక లేమి, లోభం పెరుగుతాయి. ఖర్చులు పెరుగుతాయి. ఈ అన్నాచెల్లెళ్లిద్దరూ సుఖదుఃఖాల్లో ఒకరికొకరు తోడుగా ఉంటారనే నమ్మకం ఘుంరీకి లేదు. అన్నాచెల్లెళ్ల అనుబంధం ఉంటుందో ఉండదో. ఒకరంటే ఒకరికి మాత్రం పడదు. ఎప్పుడు చూసినా తగువులూ కొట్టుకోడాలూ, కోపతాపాలు. ఈ దిగులు ఘుంరీని మరింత ముసలిదానిగా చేస్తోంది.

అమ్మగారైతే చాలా అదృష్టవంతులు. బాగా డబ్బు వుంది. కొడుకు, కూతురికి మధ్య ఎంతో ప్రేమ ఆప్యాయతలున్నాయి. రేపొద్దున సుమతి బేబీ పరాయింటికి పోతుంది. బాగా డబ్బున్న వాళ్ల ఇంటికే వెళ్తుంది. శ్రీకాంత్‌బాబు చెల్లిని బాగా చూసుకుంటారు. బంగారం, వెండి నగలతో చెల్లిని ముంచేస్తారు. ఏం ఎందుకివ్వరు. తప్పక యిస్తారు. భగవంతుడు వాళ్ళకేం లోటు చేసేడని. అయ్యగారి ఆస్తి మూడు తరాల వరకు కూర్చుని తిన్నా తరగదు. శ్రీకాంత్‌బాబు పెద్దవాడయ్యాక బాగా సంపాదిస్తారు. తండ్రి పెద్ద హోదాలో ఉన్నపుడు కొడుకు మాత్రం చిన్నపని ఎందుకు చేస్తాడు? కూలి చేసుకుంటున్న వాడి కొడుకు సాకులాలా కాదుగదా అతను. భగవంతుడతన్ని చల్లగా చూడాలి. ఘుంరీ ఈ యింటిలోనే ముసలితనాన్ని గడిపేయాలని అనుకుంటున్నది.

పిల్లల్ని పెద్దవాళ్ళని చేయడం ఎంతకష్టమో గదా. అదే పెద్దవాళ్ళయితే ముసలివాళ్ళయిపోడానికి కష్టపడనక్కరలేదు. పిల్లల్ని పెద్దవాళ్ళని చేయాలంటే ఎంతో ఓపికతో వాళ్ళని పోషించాలి. ఎంత బాగా వాళ్ళని సంరక్షిస్తామో అంతబాగా వాళ్ళూ ఆరోగ్యంగా, దృఢంగా ఉంటారు. అదే వయస్సు పైబడినవాళ్ళ విషయంలోనయితే ప్రయత్నం లేకుండానే తమంతటతాముగా ముసలివాళ్ళుగా మారిపోతారు. పేదవాళ్ళయితే చూస్తూండగానే ముసలివాళ్ళయిపోతారు.

ధనధాన్యాదుల్ని యివ్వడంలోను, మరే వస్తువుల్నయినా సరే ఇవ్వడంలోను భగవంతుడు ఎన్నో ఆటంకాలు, యిబ్బందులు కలుగజేస్తాడు. కాని ముసలితనాన్ని యివ్వడంలో మాత్రం ఏ లోటూ చేయడు. ఈ మధ్య కొన్నాళ్ళనుంచి సాకులా తండ్రి శక్తి తగ్గి కూలిపనులు చేయలేకపోతున్నాడు. రిక్షా తొక్కలేకపోతున్నాడు. శ్రీకాంత్ తండ్రిగారు మునుపటిలాగానే రోగుల్ని చూస్తున్నాడు. సర్కారు వారి

ఉద్యోగం నుంచి రిటైరయ్యేక మరింత ఎక్కువగా యింటివద్ద రోగుల్ని చూస్తు న్నాడు. రాబడి రెండింతలయింది. మొదట్లో ఎలాగయితే అయ్యగారు కారు నడుపుకొనేవారో ఇప్పుడూ అలాగే నడుపు తున్నారు. మరింక ముసలితనం ఏది?

ఘుంరీ యింతకి ముందులాగ పనిపా ట్లలో యిప్పుడు సాహసించలేకపోతున్నది. అంట్లు తోమడంలోను, బట్టలు ఉతకడం లోను, ఇల్లు వాకిలీ ఊడ్వడంలోను, పప్పులు పిండి విసరడంలోను ఆమె చేతుల్లో ఇపుడు మునుపటి శక్తి లేదు. నడుం బలం కూడా తగ్గింది. తానిప్పుడు చేస్తున్న పనులు అతికష్టం మీద చేయగ లుగుతుంది. కానీ ఆ యింటి ఇల్లాలు అమ్మగారు మాత్రం మునుపటిలాగానే అన్ని పనులూ చేసుకుంటున్నారు. ఇనప పుల్లలను పట్టుకుని స్వెట్టర్లు అల్లుతారు. ప్లాస్టిక్ కుండీల్లో పూలు అమర్చి టేబిళ్లను అలంకరిస్తారు. క్రితంలోలాగానే కథల పుస్తకాలు చదువుతారు. టీవీ చూస్తారు. వచ్చిన స్నేహితులను అన్ని మర్యాదలతో సత్కరిస్తారు. చాలా చక్కగానే ఉంటు న్నారు. ముసలితనం లక్షణాలు అమ్మగా రిలో కనిపించడం లేదు. ఏమైనా మాన వుడి చేతిలో ఏముంది? పాపపుణ్యాలు, కర్మఫలం మొదలైన వాటి ప్రకారం దేవుడు కొందరికి ధనం ఇస్తాడు. కొంద రికి సుఖదుఃఖాలు, వ్యాధులు ఇస్తాడు. ముసలితనం కూడా ఇస్తాడు.

ఘుంరీకి మాత్రం తాను ముసలిదాన్న యినందుకు విచారం లేదు. సుహాగీకి పెళ్లి చేసేసింది. పెళ్లికొడుకు ఈ కూలీనాలీ చేసుకుంటాడు. సుహాగీ రెండిళ్లలో పనికి కుదిరింది. ఇప్పుడు సుహాగీకి ఇద్దరు పిల్లలు. తన కుటుంబం ఎలా నడుస్తు న్నదో సుహాగీ కుటుంబం కూడా అలాగే ఉంది. సాకులా ఓ దుకాణంలో పని చేస్తూ ఉంటాడు. అతని కుటుంబం కూడా సుఖదుఃఖాలతో గడిచిపోతోంది. సాకు లాని డాక్టరుగారి ఆస్పత్రిలో పనికి కుదర్చా లని ఘుంరీ అనుకుంది. అలాగే సుహాగీని డాక్టర్‌గారి ఇంట్లో పెట్టాలని అనుకుంది. ఆ తర్వాత తను నిశ్చింతగా కన్ను మూయాలనుకుంది. మొదట నుంచి ఈ ఇంటినే నమ్ముకుని ఉంది. అయ్యగారు మంచివారు. దుఃఖాల్లో కష్టాల్లో ఆదు కుంటూ ఉంటారు.

దీనినే అదృష్టమంటారు. శ్రీకాంత్‌బాబు కూడా తండ్రిలాగే డాక్టరయ్యేరు. ఆయన కూడా బోలెడు సంపాదిస్తున్నారు. లక్ష్మీ దేవి లాంటి భార్య. పెద్దింటి అమ్మాయి. రెండు కుటుంబాల్లోనూ ధన ప్రవాహమే. సుమతి బేబీకి పెళ్లయింది. గొప్పింటి సంబంధమే. కటక్ నగరంలో మామగా రికి భవంతి ఉంది. అల్లుడుగారికి పెద్ద

ఒడియా మూలం :
జ్ఞానపీఠ గ్రహీత
**ప్రతిభా రాయ్**

అనువాదం :
**కాలిపు వీరభద్రుడు**

గవర్నమెంటు ఉద్యోగం. ఎవరి మనస్సు ఎంత మంచిగా ఉంటుందో సంపద కూడా అలాగే వస్తుంది.

సుహాగీ పెళ్లి సందర్భంలోనూ సాకులా బుద్ధి ఎంత చెడ్డదో లోకానికి బాగా తెలిసి పోయింది. పెళ్లిలో అల్లుడు సైకిలు అడి గేడు. అప్పటికే సాకులా నౌకరీ చేస్తు న్నాడు. ఘుంరీ అంది 'దుకాణం యజ మాని దగ్గర రుణం తీసుకో. ఒక్కతే చెల్లి. దాని మనస్సు బాధపెట్టకు' అని.

సాకులా ఆ మాటలు పట్టించుకోకుండా 'కొత్తగా నౌకరీలో చేరేను. అయినా నా జీతమెంత? దానిమీద రుణం తీసుకోడా

నికి? ఎన్నినెలల జీతాన్ని అప్పుగా తెస్తే సైకిలు వస్తుంది? ఇవ్వలేం అని చెప్పేద్దాం. కాకపోతే మరో సంబంధం చూసుకుందాం! చేస్తున్నది కూలి పని. అతనికి సైకిలు ఎందుకు?' అన్నాడు.

చివరికెలాగయితేనేం డాక్టరుగారి దయ వల్ల సుహాగీ పెళ్లి జరిగిపోయింది. సుమతి బేబీ పెళ్లినాటికి శ్రీకాంత్‌బాబుకింకా చదువు పూర్తికాలేదు. ఇంకో ఏడాది చదవాలి. అతనికింకా సంపాదన లేదు. అలాగని చెల్లెలి మీద ప్రేమ లేదని కాదు. నాన్నగారితో అన్నాడు 'సుమతికి మంచి ఖరీదైన కారు కొనివ్వండి నాన్నగారూ. నగలు బాగా పెట్టండి. బావగారికి ఏది కావాలంటే అది ఇవ్వండి. ఆ తర్వాత అదివ్వలేదు, ఇదివ్వలేదు అనకుండా. ఒక్కగానొక్క చెల్లెలు. చెల్లి మనసు బాధపడకూడదు. ఈ సంపాదనంతా ఎవరికోసం?'

లోకమంతా శ్రీకాంత్‌ని పొగిడేరు. వివాహం అయ్యాక అన్ని రివాజులు, ఆచారాలు బాగానే నడుపుతున్నారు. అన్నాచెల్లెళ్ల రాకపోకలు అంతా బాగానే వుంది. ఇదంతా చూస్తోన్న ఘురీ మనస్సుకి ఎంతో ఆనందంగా వుంది. సాకులా పేదవాడు. చెల్లికి ఏమివ్వగలడు? తనపొట్ట తానే నింపుకోలేకపోతున్నాడు. అందుచేత సాకులాని ఆడిపోసుకోడం బావుండదు.

మృత్యుదేవతకు ధనికులు, పేదవాళ్ళు అనేది ఉండదు. మృత్యువు అక్కర్లేదనుకొనేవాళ్ళని, స్వర్గసుఖాలు అనుభవిస్తున్న వాళ్ళనయినా అది వదిలిపెట్టదు. తెలియకుండా వచ్చి తీసుకుపోతుంది. రోజంతా కష్టాలతో చస్తున్నవాళ్ళ దగ్గరికి చావు వేగంగా రాదు. 'ఆ యముడొచ్చి నన్నెందుకు తీసుకుపోడూ?' అని ఏడుస్తున్నవాళ్ళని అలాగే వదిలేస్తుంది. అయితే మృత్యువు ఎప్పుడు వ స్తుందో, ఎవర్ని తీసుకుపోతుందో ఎవరికీ తెలియదు.



ముసలి డాక్టరుగారు ఎన్నో అసాధ్యమైన రోగాల్ని కూడా నయం చేసేరు. మృత్యువు కబళించబోతున్న రోగుల్ని ప్రాణాలతో బయటికి తీసుకొచ్చేడు. కాని గ్రహబలం తెలియరాదు. తనకే తెలియలేదు. ముసలిడాక్టరుగారి గుండెల్లో ఎప్పుడు ప్రవేశించిందో మృత్యువు, ఒకానొక రోగి ఛాతిని పరీక్షించి ఏవో సలహాలు చెబుతున్నారు. అంతలోనే ఛాతిని పట్టుకొంటూ స్పృహ కోల్పోయేరు. శ్రీకాంత్ బాబు కూడా అప్పటికే మంచిపేరున్న డాక్టరు. అయినా తండ్రిని రక్షించలేకపోయేరు. ఇంజక్షన్ కూడా యివ్వలేదు. ఏ మాత్రా మింగించలేదు. క్షణకాలం కూడా పట్టలేదు, ముసలి డాక్టరుగార్ని మృత్యువు మింగేసింది.

అవును, అంతే. దీన్ని కూడా ఒకరకంగా భాగ్యమనే చెప్పాలి. ఎందుకంటే కొంత మంది పుణ్యాత్ములు నవ్వుతూ నవ్వుతూ రాలిపోతారు. మరణం అంతిమ సత్యమైనప్పుడు ఇలాంటి మరణమే మంచిది, ఎవరికీ ఏ యిబ్బందీ లేకుండా, తానూ యిబ్బంది పడకుండా. బతికున్న శవంలా పడి ఉండడం కంటే చనిపోవడమే



మంచిది. 'ఈ ముసలివాళ్ళు ఎందుకు చని పోరు?' అని ఎవ్వరూ అనరు. కానీ 'అయ్యో, నా తండ్రికి నేనేమీ చేయలేకపో యేనే' అని అనేవాళ్ళుంటారు. శ్రీకాంత్ బాబూ, సుమతిబేబీ ఇలాగే అంటూ వెక్కి వెక్కి ఏడ్చేరు. అంతా అన్నారు "ఆయ నకేం? బాగానే అనుభవించేరు. ఇప్పు డింక అమ్మగారికి కష్టపురోజులొచ్చేయి.."

"అరే, అమ్మగారికేమీ.. ఆమెకెందుకు దుఃఖం? అయ్యగారు బోలెడంత సంపా దించి పెట్టేరు. కూర్చుని తింటారు. ఆవి డకు కొడుకు కూతుళ్ళవైపునుంచి కూడా చూడవలసిన అవసరంలేదు. కష్టాలనుభ వించడానికి" లోకుల్ని యింకేమీ మాటలా డనీయకుండా అడ్డుకట్ట వేసింది ఘుంరీ. కొంతమందికి అమ్మగారి దుఃఖాలను చూడాలని వుంది. ఘుంరీ అమ్మగారితో సహా ఏడుపు లంకించుకొంది. అమ్మగారు ఆనందంగా ఉండే రోజుల్లో ఘుంరీ కూడా ఆమెను చూసి ఆనందించేది. ఇవాళ ఆమె దుఃఖిస్తూ వుంది. ఘుంరీ కూడా ఆమె దుఃఖంలో పాలు పంచుకుంది.

అయితే అమ్మగారి దుఃఖానికి మూలాలు చాలా లోతుగా వున్నాయి. ఘుంరీ అంతలోతుల్లోకి వెళ్ళలేదు. అమ్మ గారికి సంబంధించిన ఈ దుఃఖం అయ్య

## కొత్తగాలి...

**మనుషులంతా ఒక్కొటంటారు**
**రాతల్లో!**
**వేరు భావం చూపుతారు**
**చేతల్లో!**

*- నండూరి లీలాప్రసూనాదేవి,*
*వెస్ట్ వెంకటాపురం, సికింద్రాబాద్*

గారు బతికున్నప్పటి నుంచీ ఆమెలో గూడుకట్టుకొని వుంది. అయ్యగారి గుండెల్లో కూడా దుఃఖం వుందని ఆమె అంటారు. ఇంత సంపద ఉన్నప్పటికీ మానవుడు సుఖంగా ఉండడా? సంపద అనేది ప్రాణాన్ని తీసుకుపోయే ఆపదలా మారి ఎదురుగావచ్చి నిలబడుతుందా?

రోజులు మారుతున్నాయి. మనస్సులు కూడా మారుతున్నాయి. శ్రీకాంత్‌బాబు, సుమతి బేబీ యిప్పుడు ఒక్కరు కాదు, ఇద్దరై పోయేరు. ఒకే కంచంలో తిన్నారు. ఒకే మంచం మీద నిద్రపోయేరు. ఒకేట బ్‌లో స్నానాలు చేసేరు. ఒకే కారులో కూర్చొని స్కూలుకి వెళ్ళేరు. 'అన్నయ్యకు ఎక్కువ ఇవ్వు, నాకు తక్కువ ఇవ్వు' అని చెల్లి అంటే 'కాదు కాదు, నాకు తక్కువ పెట్టు, చెల్లికి ఎక్కువ పెట్టు' అని అన్న వాదించుకొనేవారు. సుమతిబేబీని అత్తవా రింటికి పంపేరు. శ్రీకాంత్ బాబు పెద వుల బిగువున కన్నీరు కారుస్తూనే వున్నారు. చెట్ల కొమ్మలు, ఆకులు కూడా ఏడ్చేయి - అంపకం సమయంలో ఆ తర్వాత అన్ని రివాజులూ చక్కగానే జరి గేయి. లోలోపలే కట్టెలో అగ్ని రగులుతూ న్నదని ఘుంరీ తెలుసుకోలేకపోయింది. పెద్దవాళ్ళ యిళ్లల్లోని విషయాలు కూడా విచిత్రంగా ఉంటాయి.

సుమతి బేబీ మొండిగా కూర్చుందని అంతా అంటారు. తండ్రి ఆస్తిలో సగం వాటా యిమ్మని పట్టు పట్టింది. అప్పుడు శ్రీకాంత్‌బాబు అన్నారు. 'నాన్నగాని అలా చేస్తే కొంతకాలం కూతురి దగ్గర, కొంత కాలం కొడుకుదగ్గర ఉండాలి. ఆస్తి కావా లనుకొన్న సందర్భంలో కొడుకు కూతురు సమానమే. కర్తవ్యాన్ని పాటించాలి అనే మాట వచ్చినప్పుడు కూతురి యింటివద్ద తల్లిదండ్రులు ఉండకూడదని అంటారు. ముసలిడాక్టరుగారు కూడా ఏమీ తేల్చ లేదు. కూతురికి కూడా యివ్వాలని మన సులో వుంది. కాని సగం మాత్రం కాదు. ఏమయినా కొడుకు కొడుకే, కూతురు కూతురే.

సగం ఆస్తి కూతురికి యిచ్చినప్పుడు ఆ అమ్మాయి దగ్గర సగం రోజులు అయ్య గారు అమ్మగారు ఉంటారా? ఉంటే తమ ఆత్మాభిమానం దెబ్బతినదా? అల్లుడి యింట్లో తిన్న తిండి గొంతు దిగుతుందా! ఇటు చూస్తే కొడుకు. పిండప్రదానం చేస్తాడు. వంశాన్ని నిలబెడతాడు. అందు చేత అతనికి తండ్రి ఆస్తిలో ఎక్కువ భాగమే లభించాలి. ప్రభుత్వంవారు కల హానికి బీజం వేసేరు ఆస్తిలో సగభాగం కూతురికి యివ్వాలని చెబుతూ. ఇదంతా ఆలోచించి అయ్యగారు కుంగిపోయారు. వకీలుని పిలిపించి ఆస్తిపంపకం చేయలేక పోయారు. అయితే ఓ నోట్ మీద మాత్రం రాసేరు - కొడుకు తన చెల్లికి కొంచెం ఆస్తి యివ్వాలని. అన్నాచెల్లెళ్లు ఆనందంగా వుండాలి. ఆస్తికోసం విరో ధులు కాకూడదు- ఇదీ ఆయన కోరిక. అంటే ఆస్తి కొడుకుదే. అతనికి మంచిదని పిస్తే కొంత భాగం సోదరికి ఇచ్చుకోవచ్చు.

అమ్మగారైతే మొదటి నుంచీ చెబుతూనే వున్నారు. ఆస్తిని సగం సగం వాటాలు వేయమని. సగం వాటా అంటే తక్కువేం కాదు. కొడుకుని దురాశాపరుడ్ని చేయకూ డదు. కూతురు అడిగితే ఆమె మనస్సుని

బాధపెట్టకూడదు. ఇద్దరూ ఒకే తల్లి బిడ్డలు కదా. ఇవాళ కూతురు స్థానంలో కొడుకువుంటే ఆస్తిలో సగం వాటా పంపకం ఉంటుందా ఉండదా? తండ్రి సంపాదన. తండ్రి ఎవరికి యివ్వాలనుకొం టున్నాడో వాళ్ళకే యివ్వనీ. శ్రీకాంత్ ఈ విషయంలో మాట్లాడకుండా వుండాలి. ఈ విధమైన వంటకం ఎన్నాళ్లనుంచి లోలో పల ఉడుకుతోందో. అన్నాచెల్లెళ్ల మన స్సులు ఏనాడో విరిగిపోయేయి. ఘురీ ఆ యింట్లోనే పని చేస్తోందా.. అయినా ఏ మాత్రమూ పసికట్టలేకపోయింది.

పెద్దవాళ్ళ రహస్యాలు తెలుసుకోవడం చాలా కష్టం. పేదవాళ్ళ పొయ్యి, ఇంటిపై కప్పు, ద్వారం, కిటికీ - అన్నీ తెరిచే వుంటాయి. మొగుడూ పెళ్ళాలు అన్యో న్యంగా వున్నా బయటికి తెలిసిపోతుంది. వాళ్ళమధ్య తగువులు వచ్చినప్పుడో, కొట్టు కొన్నప్పుడో అయితే ఊరు వాడా మార్మోగి పోతుంది. ఘురీ చాలాసార్లు తనవీపు మీది దెబ్బల్ని అమ్మగారికి చూపించింది. ఘురీ తల్లిదండ్రుల్ని ఉద్దేశించి ఆమె మొగుడు నోటికొచ్చినట్టు ఎన్నోసార్లు తిట్టేడు. ఆయా విషయాల్ని ఇంట్లోంచి బయలుదేరింది మొదలు వీధిలో ప్రతి యింటి ముందూ అలాగలాగ డాక్టరుగారి యింటి వరకూ చెప్పుకొంటూ రావడం ఎన్నోసార్లు జరిగింది. కాని అమ్మగారు మాత్రం ఏనాడైనా తమ భార్యాభర్తల మధ్య జరిగిన కీచులాటల్ని మంచీచెడ్డల్ని ఘురీతో చెప్పిందా? పేదవాళ్ళ పొట్టలో ఆకలే నిండుగా వుంటుంది. అందుచేత యింకే విషయాల నయినా దాచుకోడానికి ఆ పొట్టలో చోటు ఉండదు. ఆకలితప్ప ఇంకే విషయాన్నయినా పేదవారి పొట్ట బయటికి కక్కేస్తుంది. ధనవంతుల పొట్టలో ఆకలి ఉండనే ఉండదు. కాబట్టి చిన్నచిన్న మనస్పర్థలకు సంబంధించిన విషయాలు ఆ పొట్టలోనే ఉండిపోతాయి మరణించేంతవరకు.

ఈ విషయాలు ఘురీకి నచ్చవు. ఇప్పు డామె తన పనుల్ని తాను చేయలేకపోతు న్నది. ఇంటికోడలు ఘురీ మీద చిటపట లాడుతూ వుంటుంది. ఘురీకి జీతం యిస్తూ మరో పనిమనిషిని పెట్టుకుం టుందా! జీతం పూర్తిగా తీసుకుంటుంది కాబట్టి ఇంటి పనులన్నింటినీ ఘురీయే చేయాలి. కోడలు ఈ మధ్యనే గదా వచ్చింది ఆ యింటికి. ఘురీ పట్ల ఆమె కెలా దయ కలుగుతుంది?

తనకి బదులుగా ఘురీ తన కూతురు సుహాగీని పనిలోపెట్టి అన్నీ కూతురి మీద వదిలేసింది. పని వదిలేసిన తర్వాత ఘుం రీని జబ్బు పట్టుకొంది. కష్టపడకుండానే ఘురీ కన్నుమూసింది. ముక్తి పొందిం ది. సుమతి బేబీ, శ్రీకాంత్‌లకు సంబం ధించి ఆ యింట్లో ఎన్ని విషయాలు చోటు చేసుకున్నాయో అవేవీ చూడకుండానే ఘురీ వెళ్ళిపోవడం మంచిదే అయింది. ఆమె జీవించి వుంటే ఎంతో బాధపడి ఉండేది. సుహాగీ అంతా చూస్తూనే వుంది. ఆశ్చర్యపోతూనే వుంది. సాకులా కూడా యిప్పుడు శ్రీకాంత్‌గారి ఆస్పత్రిలోనే పని చేస్తున్నాడు. అతను కూడా అంతా చూస్తూ కలత చెందుతున్నాడు.

బాల్యంలో సుమతి అక్క, శ్రీకాంత్ బాబుగారి మధ్య ఎంతగానో ప్రేమ, అను రాగం ఉండేది. ఏ విషయంలో ఆ ప్రేమంతా నాశనమయిపోయింది? సాకులా సుహాగీల మధ్య బాల్యంలో తినే తిండి దగ్గరే పోట్లాడుకొనేవారు. కాని యిప్పుడో.. ఇళ్లు వేరువేరు అయ్యేయి. ఎవరి కాపురాలు వాళ్ళు చేసుకొంటూ ఉన్నారు. అయినా మంచినీళ్ళు కూడా ఒక రికి యివ్వకుండా ఇంకొకరు తాగరు. పేద రికం లాంటి ముడి లోకంలో మరొకటి వుందా? ధనసంపద మానవుడ్ని కలుపు తుందనే మాటలో నిజం లేదు. అందులో

అహంకారమే వుంటుంది. రూపాయిలు జల్లితే నీ కష్టసుఖాల్లో ఎవరన్నా వచ్చి నీ సేవ చేస్తారు. కాని పేదవాడి నోట్లో గుక్కెడు నీళ్ళు పోయడానికి ఎవరొస్తారు? పేదవాడి అభిమానం, అనుబంధం, పేద వాడి ఊతకర్ర ఇరుగు పొరుగు మాన వుడే. ఒక మానవుడు మరొక మానవుడికి ఎంతగా సహాయపడతాడో అది ఇంకొకరి వల్ల సాధ్యపడదు. రక్తాన్ని ధారపోస్తారు అన్నకోసం చెల్లి, చెల్లికోసం అన్న. ఇద్దరూ పేదవాళ్ళే. కాని యిరువురిలో ఏ ఒక్కరు కూడా ధనం కోసం, సంపత్తి కోసం ఆశప డరు. మనస్సుల్లో ఒకర్ని ఒకరు ఆదుకోవా లన్న ప్రబలమైన కోరిక. అన్నాచెల్లెళ్ల మన స్సుబంధం రోజురోజుకీ ఒకర్ని యింకొక రికి దగ్గరగా లాక్కుంటుంది. అన్న ఎంతగా కష్టపడుతున్నా ఏనాడూ కడుపు నిండా తిన్నపాపాన పోలేదు అని చెల్లి బాధపడుతూ వుంటుంది. తన సంపాదన లోంచి కొంత మిగిల్చి అన్న పిల్లలకి ఏవో కొని తెచ్చిపెడుతుంది. అన్న కూడా చెల్లిని, బావని ఏ పండక్కో పున్నానికో తీసుకొచ్చి తనశక్తి మేరకు పేంటుషర్ట్ బావకి, చెల్లికి చీర కొనిపెడతాడు. ఒక్కతే గదా చెల్లి. సుహాగీ కూడా తన అన్నక్షేమం కోసం దేవీదేవతలకు మొక్కుతూ వుంటుంది. ఈ లోకంలో తమ రక్తం పంచుకు పుట్టిన వాళ్ళు యింకెవరున్నారు - ఆ యిరువురు అన్నాచెల్లెళ్లకి ఒకరికొకరు తప్ప.

కానీ శ్రీకాంత్‌బాబు, సుమతి అక్కల మధ్య రక్తాన్ని నీళ్ళగా మార్చేసింది సంపద. తండ్రి గతించిన తర్వాత అన్నా చెల్లెళ్లు ఒకరు యింకొకరి యింటికి వెళ్ళడం పూర్తిగా మానేశారు. అమ్మగారు నిరంతరం కూతురి ధ్యాసతోనే కన్నీరు కారుస్తూ ఉంటుంది. ఎప్పుడు చూసినా అనారోగ్యమే. కొడుకుతో పదేపదే చెబుతూ వుంటుంది. 'చెల్లికి సగం వాటా యిచ్చేయ్ నాయనా. మీ నాన్నగారి ఆస్తిపాస్తులు తక్కువేం కాదు. చెల్లివాటా చెల్లికి ఇచ్చేయ్. నువ్వు హాయిగా వుండు. నువ్వు ఈ పని చేస్తే నాకు ఆనందంగా వుంటుంది. తృప్తిగా కళ్ళు మూస్తాను. ఓ మాట చెప్పు. మీ యిద్దరికి ఏమిటి లోటని ఆస్తికోసం యిలా తగువులాడుకుంటు న్నారు? మీమీ ఆదాయాలు కూడా తక్కువేం కాదే. ఇంత ఆస్తి పెట్టుకొని ఏం చేస్తారు? మీ నాన్న ఇంత ఆస్తిని సంపా దించేరు, పట్టుకొని పోయేరా? మృత్యువు పిలవగానే వెళ్ళిపోయేరు. ఎవ్వరైనా అంతే'

ముసలి అమ్మగారి మనస్సు బాగా విరిగి పోయింది- తన రక్తం రెండు భాగాలుగా విడిపోతుంటే చూసి.

శ్రీకాంత్‌బాబు అమ్మగారి ముఖం మీదే అన్నారు, 'ఈ మాటలన్నీ నీ కూతురు ముందు చెప్పు. ఆవిడ్ని దారిలోకి తీసు కురా. ఏం తనకి ఏ విషయంలో లోటు, చెప్పు? అదేం లేదే. మరి అలాంటప్పుడు తన కళ్ళు నా సంపదమీద ఎందుకు పడాలి? ఒకచెల్లెలిగా అన్నని వాటా అడ గడానికి సిగ్గుగా లేదా తనకి? చెప్పేస్తు న్నాను, నేను ఆవిడ ముఖం కూడా చూడను. ఒకవేళ ఆవిడ కోర్టుకి వెళ్తే ఆపైన ధర్మం లేదా..? '

సోదరి సుమతి యిందుకు సమాధా నంగా అంటుంది, 'నాన్నగారి సంపదను తనసొంత సంపదగా అన్నయ్య భావిస్తు న్నందువల్లనే అతని కంత కష్టంగా వుంది. యుగయుగాలుగా తండ్రిసంపదను కొడుకు అనుభవిస్తూ వస్తున్నాడు. కూతు ర్నేమో అత్తారింట్లోకి నెట్టేస్తున్నారు. తండ్రి యింట్లో అధికారం ఉంది. అయినా యివ్వ డానికి ససేమిరా ఒప్పుకోడు కొడుకు. ఈ భావన బాగా దృఢంగా నాటుకుపోయి వుంది సమాజంలో. అన్నయ్యనీ నాన్న గారే చదివించేరు. చదువుకోసం నాకు ఖర్చుపెట్టినదానికంటే అన్నయ్యకే ఎక్కువ అయింది. అనవసరపు ఖర్చులు నాకంటె



ఎన్నో ఎక్కువ చేసేడు చదువుకొనేట ప్పుడు. భోజన విషయంలో కూడా నాకంటే తనే ఎన్నోరకాలైనవి ఎక్కువగా తినేవాడు. నాకంటే ఎన్నోరెట్లు విలువైన చెప్పుల్ని, బట్టల్ని ధరించేవాడు. ఈ లెక్కని చూస్తే అన్నయ్య నాన్నగారి ఆస్తిని వదిలేస్తాడా? మరి నా చదువుకి అయిన ఖర్చు గురించి యిప్పుడు ప్రస్తావన ఎందు కురావాలి? అన్నయ్య పెళ్ళి సందర్భంలో నాన్నగారు తక్కువేం ఖర్చుపెట్టలేదు. వది నెకు ఎన్నో నగలు యిచ్చేరు. అన్ని నగలు మా అమ్మ నాకు కూడా యివ్వలేదు. అన్నయ్య అత్తవారింటి కోసం నాన్నగారు చాలా ఖర్చు చేసేరు. ఈ ఖర్చులన్నింటి లోంచి నాకోసం చేసిన ఖర్చుల్ని మినహా యించండి. మిగిలిందేదో నేను భరిస్తాను. ఆస్తిలో నా వాటా నాకు యివ్వండి. 'మీ నాన్నగారిని నీ వాటా యిమ్మని అడుగు. నీ వాటా నువ్వు తీసుకొనిరా' అని అన్నయ్య వదినె చెవుల్లో నూరి పోస్తు న్నాడు. మరి అలాంటప్పుడు నేను నా తండ్రి ఆస్తిలో వాటా అడుగుతూ వుంటే అది సిగ్గుమాలిన పని ఎలా అవుతుంది? అంతేకాదు, అన్నయ్య దగ్గర ధన సంప దలు లేనప్పుడు, అన్నయ్య పేదవాడైన ప్పుడు నా తండ్రి ఆస్తిలో నా వాటాని కోరనే కోరను. నాన్నగారు రెండేసి ఇళ్లు, టౌనులో ఎన్నో రకాల భూమి సంపాదిం చేరు. ఇన్ని ఉన్నా అన్నయ్య ఇంత లోభి అయ్యేడేంటి? కూతురి వాటా దాని పేరని రాసేయాలని నాన్న కూడా ఆలోచించ లేదు. అందుచేతనే కోర్టు ద్వారానైనా నా ఆస్తి వాటాని నేను చేజిక్కించుకుంటాను'

అన్నాచెల్లెళ్ల ప్రశ్న సమాధానాలు విని

సాకులా సుహాగీలు బిత్తరపోయేరు. 'సోదరి వాటాని శ్రీకాంత్‌బాబు వదలరెందుకో మరి. చట్టం ప్రకారం ఇవ్వాలి గదా. ఇవ్వనంటే ఎలా! నాన్న సంపాదనకు తానొక్కడే అధికారి అని ఎందుకనుకుంటున్నారు? ' అని సాకులా అనుకుంటున్నాడు. సుహాగీ ఆలోచిస్తోంది, ఈ సుమతి అక్కకి ఇంత లోభం పనికిరాదు. భగవంతుడా మెకు ఇవ్వనిది ఏముంది? అన్నయ్యని వాటా అడగడానికి? అన్నయ్యని వదిలి వెళ్లేక కన్నవారింటితో ఇంకేం బంధం మిగిలి ఉంటుంది? చట్టాల ప్రకారం అందరూ నడుచుకుంటున్నారా? అయినా ప్రభుత్వం కూడా ఇంటిని ముక్కలుగా విడగొట్టే ఇలాంటి చట్టాలు ఎందుకు తేవాలి? ఈ చట్టం వల్ల ధనవంతుల ఇళ్లల్లోని సోదరి సోదరుల అనుబంధం మిగలకుండా పోయింది. ఛీ... ఛీ.. సుమతక్కకి కూడా మతిపోయింది..'

ఆస్తి పంపకం విషయంలో అమ్మగారు ఏ పక్షమూ చేరలేని పరిస్థితిలో పడ్డారు. రెచ్చగొట్టిన కూతురి మాటలతో కొడుకూ కోడలికి విరోధి అయిపోయింది. ఈ ముసలి తల్లిని ఎవరూ పట్టించుకోలేదు. ఏ షాపింగుకో బయలుదేరితే ఇంటికి తాళం వేసి బయటికి పోతారు. ఇంటికి కాపలాగా సుహాగీని ఉంచుతారు. తామిద్దరూ లేనప్పుడు సుమతి వచ్చి తల్లి పేర ఉన్న ఆస్తిని రాయించుకుంటుందేమోనని వాళ్ల భయం. ముసలి అమ్మగారు మంచం మీదనుంచే 'నా పిల్లలిద్దర్నీ చల్లగా చూడు తండ్రీ' అని దేవుడ్ని వేడుకుంటుంది. నీదే తప్పు అని ఏ ఒక్కర్నీ అనలేకపోతుంది. అందుచేత గట్టిగా చీవాట్లు పెట్టే ప్రశ్నేలేదు.

కాని నేరమంతా అత్తగారిలోనే ఉందని కోడలు గట్టిగా నమ్ముతుంది. తనని అత్తగారు ఎప్పుడూ తిట్టుకుంటూ ఉన్నందునే తన ఆరోగ్యం బాగా లేదని కోడలు అంటుంది. ప్రస్తుతం అత్త పరిస్థితి బాగా క్షీణించిపోయింది. వీటన్నిటికి ప్రత్యక్షసాక్షి సుహాగీ. అత్తగారు కోడల్ని చీవాట్లు పెట్టడం, తిట్టడం అనేది సుహాగీ ఎప్పుడూ చూడలేదు. కోడలికి చెడు జరగాలనుకోవడం కొడుక్కి చెడు కలగాలని కోరుకోవడమే అవుతుంది. ఎన్నడయినా ఏ తల్లి అయినా ఇలా చేస్తుందా?

ఒకనాడు అదును దొరకగానే సుమతి వచ్చి వాళ్లమ్మని తనతో తీసుకుపోయింది. తల్లికి సేవచేసే హక్కు తనకీ ఉంది. అన్న దగ్గరుంటే అమ్మ ప్రాణానికి సుఖం ఉండదు అని. అయితే శ్రీకాంత్‌బాబుగారు మరొకలా ఆలోచించేరు. ఆస్తి మీది ఆశతో సుమతి అమ్మని బలవంతంగా తీసుకుపోయిందని చెప్పుకు తిరుగుతున్నాడతను. తల్లి సుమతి దగ్గర ఉన్నన్నాళ్లూ శ్రీకాంత్ ఆమెని చూడ్డానికి వెళ్లడు. చూడ్డానికి వెళ్లే పరిస్థితే వస్తే తల్లి బతికుండగా మాత్రం కాదు. సుమతక్క తన తల్లిని కళ్లల్లో పెట్టుకుని చూసుకుంటుంది. ఆమె మల మూత్రాలు స్వయంగా తన చేతులతో పరిశుభ్రం చేస్తుంది. ముసలి అమ్మగారికి సేవలు బాగా జరుగుతున్నాయి. కాని ఆ ముసలి తల్లి మనస్సు సుఖానికి దూరమయింది. రాత్రింబవళ్లు 'శ్రీకాంత్ శ్రీకాంత్' అని ఒకటే సొద. బయట ఎవరో వచ్చిన అలికిడి అయితే చాలు శ్రీకాంత్ వచ్చాడనే భావిస్తూ అంటుంది, 'నా సిరీ వచ్చేడా? తప్పకుండా వస్తాడు. నాకు తెలుసు. నేను లేనిదే వాడుండలేడు'

సుమతక్క చిరాకు పడుతుంది. "నువ్వు ఎక్కడా హాయిగా ఉండలేవా అమ్మా! అక్కడ ఉన్నన్నాళ్లు కన్నీళ్లు మింగుతూ బతికేవు. పాలు, హార్లిక్సు ఎన్నడన్నా తాగేవా? అందుకే అన్నయ్యకి కోపం వచ్చినా, చెడ్డదాన్నని అనిపించుకున్నా నిన్ను బలవంతంగా ఇక్కడికి తెచ్చి ఉంచుకున్నాను. ఇప్పుడిక్కడ కూడా నీ కన్నీళ్లాగ

లేదు. కష్టాలున్న చోటుకే వెళ్లాలని చూస్తు న్నావా? అవున్లే ఎంతయినా కొడుకు గదా. నోట్లో తులసి నీళ్లు పోస్తాడు. లేక పోతే ముక్తి దొరకదు. నేనిప్పుడు మరో గోత్రానికి చెందిన దాన్ని. ఆస్తి దక్కుతుం దనే ఆశతో నిన్నెత్తుకొచ్చిన దాన్ని..." తల్లీ కూతుళ్లిద్దరూ ఒకరినొకరు కౌగిలించుకొని వెక్కివెక్కి ఏడ్చేరు.

అమ్మగారేమో కన్నీళ్లు కారుస్తూ పైకప్పు వైపు చూస్తూ మంచం మీద పడి ఉంటారు. ఆలోచిస్తారు. "ఎవర్ని పరాయి వాళ్లగా భావించేది. కుమిలిపోతున్న ఈ తల్లి మనస్సు సిరీ సుమీలనిద్దరినీ గుండె లకు హత్తుకొంటూ ప్రాణాలొదిలెయ్ అని చెబుతుంది. కాని ఇది ఈ జన్మలో జరి గేది కాదు. వీళ్ల తండ్రి ఇంత ఆస్తిని సంపాదించి ఉండకపోయినట్లయితే ఈ పని జరిగి ఉండేదేమో.. ఘుంరీ ఎంత అదృష్టవంతురాలో కదా. ఆమె తన ప్రాణాలొదిలేస్తున్నప్పుడు కొడుకు, కూతురు ఆమె వద్దనే ఉన్నారు. 'అమ్మా అమ్మా..' అంటూ కాళ్లూ చేతులు రాస్తూనే ఉన్నారు. తమ వద్దనున్నదేదో తల్లికి తిని పించేరు. అన్నా చెల్లెళ్లు - ఇద్దరూ ఒకే మనస్సుతో ఆమెకు సేవ చేస్తూ ఉంటే ఘుంరీ ప్రాణాల్ని వదిలేసింది. ఆమెకు యజమానురాలైన నేను మాత్రం లక్షల రూపాయల మీద కూర్చొని ఉండి కూడా పుట్టెడు దుఃఖంతో చావబోతున్నాను"

సాకులా సుహాగీలు ఇదంతా కళ్లారా చూసేరు. పాడుబడిన తమ గుడిసెల్ని, నిండీనిండని తమ పొట్టల్ని, ఖాళీ కుండల్ని, ఎంతో జాగరూకతతో చూసు కొంటూ సుఖశాంతులతో హాయిగా ఉన్నా రు. సుహాగీ అనుకొంటూ ఉంటుంది, 'నేనే సుమతక్కనయితే శ్రీకాంత్‌బాబుని ఆస్తి వాటా అడగనే అడగను'

సాకులా అనుకుంటాడు, 'నా తండ్రి సంపాదన ఒక వందగాని ఉన్నట్టయితే అందులోంచి యాభై రూపాయిలు సుహా గీకి ఇచ్చి ఉండేవాడ్ని. శ్రీకాంత్‌బాబుగారు, సుమతక్క ఎందుచేతనో గాని రక్తసంబం ధానికి అడ్డగోడలుగా తయారయ్యేరు'

'సిరి సిరి..' అంటూ ఉండగా అమ్మగారి జీవనదారం తెగిపోయింది. శ్రీకాంత్‌బాబ యితే తల్లిని గురించి ఆలోచించలేదని కాదు. తన మొండితనం, చెల్లెలి మీది కో పం ఈ రెండూ అతన్ని తల్లిని కలవనీయ కుండా చేసేయి. అమ్మగారు కూతురి ఇం ట్లో కన్నుమూసేరు. తల్లి శవాన్నే శ్రీ కాం త్ చూశాడు. తల్లి చనిపోయిన తర్వాతనే సుమతి అన్నయ్య మీద కేసు పెట్టింది.

ఒకనాడు నాన్నగారి పాస్‌బుక్ వగైరా వెదుకుతుండగా శ్రీకాంత్‌బాబుకి జాయింట్ పాస్‌బుక్కొకటి దొరికింది. ఘుంరీ, ఆమె భర్త ముప్పయ్యేళ్లలో చెమట చిందించి దాచుకున్నారు. అది ఇప్పుడు పదకొండు వేల రూపాయల యింది. ఘుంరీ బహుశా మర్చిపోయింది.

సాకులాని పిలిచి పాస్‌బుక్ గురించి శ్రీకాంత్ చెప్పేరు. సాకులా మొదట తుళ్లి పడ్డాడు. ఆ తర్వాత అటు ఇటు చూసి నెమ్మదిగా అన్నాడు, "తమరు దీని గురించి సుహాగీకి చెప్పేసేరేంటి బాబూ. చెప్పకండి ఎందుకంటే దాని మొగుడు బాగా లోభి. స్సాలా. ఈ డబ్బు ఇచ్చేయ మని నా చెల్లిని తినేస్తాడు"

కోడలమ్మ చెప్పగా విన్న సుహాగీ చాలా ఆశ్చర్యపోయింది. ఆ తర్వాత సంకోచిస్తూ అడిగింది "అమ్మా, నాన్న ఆస్తిలో కూతు రికి వాటా ఉంటుంది. మరి అలాంట ప్పుడు తల్లిదండ్రులు దాచుకొన్న డబ్బులో కూతురికి వాటా ఉంటుంది గదమ్మా, ఆ పాస్‌బుక్‌లో ఇది రాసి ఉంటుందా? ఉండదా? ఇంత డబ్బు చేతిలోకి వచ్చి పడగానే నా అన్న చెడిపోతాడమ్మా. తాగు బోతు వాళ్లకి చిక్కిపోతే ఇంక నా అన్న సర్వనాశనమయిపోతాడనుకోండి" Ⓒ



# కృష్ణం వందే జగద్గురుమ్!



*కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షస్థలే కౌస్తుభం*
*నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణం*
*సర్వాంగే హరిచందనంచ కలయం కంఠేచ ముక్తావళీం*
*గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః*



నుదుటిపై కస్తూరి తిలకం.. వక్షం మీద కౌస్తుభం.. ముక్కుకొనకు చిన్న ముత్యం.. చేతిలో వేణువు.. చేతికి కడియం.. దేహమంతా చందనం.. మెడలో ముత్యాల సరాలు.. చుట్టూ గోపికలు.. ఆహా! ఎంత చక్కగా ఉంది చిన్నికృష్ణయ్య వర్ణన! ఆయన స్ఫురణకు రాగానే మనందరి మదిలో రూపుదిద్దుకునే ఆకారమిది!

నిజానికి శ్రీకృష్ణ లీలలు అనంతం. ఆ అవతారపురుషుడి తత్త్వం మహత్తరం. అది జాలి, కరుణ, ఆదరణ, ఔదార్యం, సహనం, క్షమ, విజ్ఞానం, వినోదం, వినయం, విచక్షణ, హాసం, లాస్యం అన్నింటి సమాహారం. సంపూర్ణత్వానికి సంకేతం. కంసుడిని సంహరించినా ఆయన రాజ్యం తీసుకోలేదు.. తన తాత ఉగ్రసేనులవారికే తిరిగి పట్టాభిషేకం చేశాడు. రాజ్యకాంక్ష తనకు లేదని నిరూపించుకున్నాడు. అన్నగారి మాట కాదన్నట్టు కనిపించినా సుభద్ర భద్రంగా ఉండాలనే వీరాధివీరుడైన అర్జునుడికే కట్టబెట్టాడు. శశిరేఖకు ప్రగల్భాల ఉత్తరునితో పెళ్ళిని తప్పించాడు. నిండుసభలో ద్రౌపది అవమానం పాలు కాకుండా చూశాడు. గోకులంపై వడగండ్ల వాన కురిపిస్తున్న దేవేంద్రుడి గర్వాన్ని గోవర్ధనగిరి ఎత్తి హరించాడు. దేవుడన్నవాడు ప్రజలు, ఆలమందల ప్రాణాలు రక్షించాలిగానీ తీయడమేంటని ప్రశ్నించాడు. అలాంటి దేవుడు అక్కర్లేదన్నాడు. తనకంత ఎగ్గుచేసిన దేవేంద్రుడినే మళ్లీ రాక్షసులబారి నుంచి రక్షించాడు. ఇది క్షమాగుణాన్ని చెప్పడంలేదూ! గురువు శోకం పోగొట్టడానికి సాక్షాత్తూ యముడితోనే తలపడ్డాడు. ఇది గురువుల్ని గౌరవించమనడం కాదా! అంతెందుకు? బోళాశంకరుణ్ణి భస్మాసురుడి నుంచి కాపాడింది శ్రీకృష్ణుడే కదా!. తనయుడైనా నరకుడ్ని వధించింది లోక రక్షణార్థమే! జనం ముందు మనం మన సంతానం ముఖ్యం కాదనుకోవడం వల్లే కదా ఇంత త్యాగం? శిశుపాలుణ్ణి నూరుసార్లు క్షమించాడంటే చేతకాకో చేవలేకో కాదు, ఓర్పుతో వీలైనంత వరకూ హింసకు దూరంగా వుండాలని సూచించడం. పరిస్థితి అదుపు తప్పితే ఆయుధం చేపట్టి అంతు చూడాలని చెప్పడం. మురళీగానాన్ని ఆలపించినా, గోవుల్ని లాలించినా, గోవర్ధనగిరిని పైకెత్తినా, మోహినిగా ఆడినా, కంసుణ్ణి వధించినా, శకునితో పాచికలాడించినా, అర్జునుడికి రథసారథై యుద్ధభూమిలో గీతాబోధ చేసినా, కౌరవుల్ని ఓడించినా, పాండవుల్ని గెలిపించినా అదంతా లోకకల్యాణం కోసమే! చిన్నతనంలోనే మాయలు, రాక్షససంహారాలు చేసిన ఆయనకు కౌరవుల్ని సంహరించడం తృటిలో పని!

ఎవరి ధర్మం వారు నిర్వర్తించాలనే పాండవులతోనే కౌరవ సంహారం చేయించాడు. 'కర్తవ్యము నీవంతు కాపాడుట నా వంతు' అనే ఆ లీలామానుష వేషధారి అంతరంగం తెలుసుకోవడం కష్టమే! ఏదేమైనా దుష్టశిక్షణ, శిష్టరక్షణే కృష్ణుడి లక్ష్యం, లక్షణం. ఈర్ష్యాద్వేషాల్లేకుండా అందరూ సుఖంగా, సంతోషంగా వుండాలనేదే శ్రీకృష్ణుడి తత్త్వం. ఆయన తత్త్వం అర్థం చేసుకుంటే 'సర్వే జనాః సుఖినో భవంతు!' అనిపిస్తుంది. వేణుగానం చేస్తే హాయిగా, ఆనందంగా వుండమనే ప్రబోధం రవళిస్తుంది.

(కృష్ణాష్టమి సందర్భంగా)






వసంతరావు దేశపాండే

# అడవి

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

**వసంతరావు దేశపాండే కొన్ని సంవత్సరాల శ్రమఫలం ఈ 'అడవి' నవల. ఈ నవలకి కేంద్ర బిందువుగా ఆయన ఎన్నుకున్న సంఘటన కూడా సామాన్యమైంది కాదు. 1981లో పెను సంచ లనం కలిగించిన ఇంద్రవెల్లి కాల్పుల సంఘటన! 'చతుర' నవలల పోటీలో ఉత్తమ బహుమతి పొందిన ఈ 'అడవి' నేటికీ పాఠకుల గుండెల్లో చిరస్థాయిగా నిలిచిపోయింది.**

కొన్ని రచనలు కాలగర్భంలో చాలాకాలం నిశ్శబ్దంగా వుండిపోతాయి. అవి వెలుగులోకి వచ్చినప్పుడు వాటి నిజమైన విలువ బయటపడు తుంది. వసంతరావు దేశపాండే నవల 'అడవి' ఆ కోవకి చెందింది. ఈ నవల చాలా భిన్నంగా ఉంటుంది. ఈ కథాభూమి, పరిసరాలు చాలా మంది అనుభవంలో లేనివి. దట్టమైన అడవు లలో నివసించే గిరిజనుల చరిత్ర కథావస్తువు. అదంతా మరోప్రపంచం. ఈ నవలకి కావలసిన సమాచారం సేకరించటమే కాదు, దాన్ని ఓ క్రమంలో కూర్చటం కూడా ఎంతో ప్రతిభ ఉంటే తప్ప సాధ్యం కాని అంశం. వసంతరావు దేశపాండే కొన్ని సంవత్సరాల శ్రమ ఫలం ఈ 'అడవి' నవల. ఈ నవలకి కేంద్రబిందువుగా ఆయన ఎన్నుకున్న సంఘటన కూడా సామాన్యమైంది కాదు. ఆ సంఘటననే నవల ఆరం భంగా తీసుకోటం వల్ల, రచనా శిల్పం చిక్కనై, కథాగమనంలో మరింత బిగువు ఏర్పడింది. ఈ నవల ఎంత విశిష్టమైందో, రచనా ప్రణాళిక కూడా అంతగొప్పది.

ఇంద్రవెల్లిలో 1981 కాల్పుల్లో గోండులు తదితరులు ఎందరో మర ణించారు. ఆ బీభత్స సంఘటనతో 'అడవి' నవల ఆరంభమైంది. ఆ దారుణ మారణ కాండని పదిహేను పేజీల నిడివిలో కళ్లకు కట్టి నట్టు చిత్రించారు. గిరిజనుల దశాబ్దాల జీవి తాన్ని ఈ సంఘటనకి పూర్వభూమికగా తీసుకు న్నారు రచయిత. కథని బ్రిటిష్, నైజాం పరిపా లనా కాలనికి వెనక్కి తీసికెళ్ళారు. అప్పటి నుంచీ ఓ క్రమంలో ఆ అడవిబిడ్డల జీవితగాథ చెప్పుకొ చ్చారు. అలా చెపుతూ చెపుతూ, ఆరంభించిన ఇంద్రవెల్లి కాల్పుల వరకూ తిరిగి వచ్చి భవిష్యత్ సూచికతో ముగించారు. ఈ కూర్పులోని నేర్పే ఈ నవల రచనా ప్రణాళికలోని ప్రత్యే కత, విశిష్టత.




'నవలాంతరంగం' అన్న తన ముందు మాటలో రచ యిత ఈ నవల రచనాపూ ర్వంగాన్ని, రాయటంలో శ్రమని, మూడుచోట్ల నుంచి ప్రచురణకి అంగీ కరించక తిరిగి వచ్చిన పుడు కలిగిన బాధని వివరంగా తెలిపారు. 1982లో రాసిన ఈ నవల 1988 వరకూ ముద్రణకు నోచుకో

## కొత్తగాలి...

**నేడు తవ్వుతున్న**
**ఇంకుడు గుంతలు**
**రేపు నిల్వ ఉండే**
**నీటి ఊటలు!**

– బండ్ల సుబ్రహ్మణ్యం,
మంగళగిరి, గుంటూరు జిల్లా

లేదు. ఈ వివరాలన్నీ ఎందుకంటే.. చివరికి రచయిత శ్రమఫలించి ఆశించిన దానికన్నా ఉత్తమ ఫలితం దక్కింది. 'చతుర' పోటీల్లో ఉత్తమ నవలగా బహుమతి పొంది, 1988 ఫిబ్రవరిలో ప్రచురితమైంది. లక్షలాదిమంది పాఠకుల మన్ననలు పొందింది. చాలామంది చదవటానికే జంకే కథావస్తువున్న ఈ నవలకి 'చతుర' బహుమతినిచ్చి తమ ఉత్తమాభిరుచిని, నిర్భీతిని నిరూపించుకుంది. 'ఈ నవల మొదట్లో ప్రచురించకపోవడం వల్ల మంచే జరిగింది. 'చతుర' ద్వారా అనేకులకి చేరువైంది' అంటారు రచయిత వసంతరావు దేశపాండే.

తెలుగులో అడవి నేపథ్యంగా నవలలు తక్కువ వచ్చినా, వాటిలో ఎక్కువ శాతం జానపద నవలలే. అడవి ఆలంబనగా బతికే పలురకాల గిరిజన తెగల్ని, వారి జీవన విధానాన్ని, సంస్కృతీ సంప్రదాయాల్ని ఉత్పత్తి, వినియోగాన్ని, సుఖదుఃఖాల్ని, అన్నింటినీ మించిన వారి నిజాయితీ నిండిన అమాయకత్వాన్ని, నిరక్షరాస్యత కారణంగా వారి మీద జరుగుతున్న దోపిడీని, తరతరాలుగా పలురకాల హింసకు బలి అవుతూ, నానాటికి దిగజారుతున్న పరిస్థితిని, వసంతరావు దేశపాండే ఈ 'అడవి' నవలలో సవివరంగా చిత్రీకరించటం విశేషం. 'చరిత్ర, సంస్కృతులను కలగలిపి కథను నడపటంలో వసంతరావు దేశపాండే సిద్ధహస్తుల'ని సుప్రసిద్ధ కథకులు వల్లంపాటి వెంకటసుబ్బయ్య ప్రశంసించారు. గిరిజనుల పట్ల సాంద్రమైన ఆసక్తి, అభిమానం, సహానుభూతి వుంటేనే కానీ ఇలాంటి నవల రాయటం సాధ్యం కాదు.

ఇంద్రవెల్లి సంఘటన వసంతరావును బాగా కదిలించింది. దాన్ని చూసినవారు, దాన్ని గురించి విన్నవారు ఎవరైనా అవన్నీ రాస్తారేమో అని ఎదురుచూశారు. వసంతరావు దేశపాండే మాటల్లోనే చెప్పుకోవాలంటే..! ఆ రోజు అంటే.. 1981 ఏప్రిల్ ఇరవయ్యో తేదీన ఇంద్రవెల్లి సభ జరుపుకోటానికి వచ్చిన గిరిజనులపై పోలీసులు అమానుషంగా కాల్పులు జరిపారని, వందల సంఖ్యలో గిరిజనులు ప్రాణాలు కోల్పోయారనే వార్త రాష్ట్రాన్ని, దేశాన్ని దాటి బీబీసీ వరకు వ్యాపించింది. ఆనాటి ఇంద్రవెల్లి సంఘటనను మరో కిరాతక జలియన్ వాలా బాగ్ హత్యాకాండగా సభ్యప్రపంచం ముక్తకంఠంతో నిరసించింది.

ఆ సంఘటనా స్థలాన్ని చూడటానికి, అక్కడ బలైన వ్యక్తుల కుటుంబాలను పరామర్శించడానికి ఎందరో వచ్చారు. రాజకీయ నాయకులు, విద్యార్థులు, మేధావులు, మెడికోలు, రచయితలు, కవులు, పాత్రికేయులు.. ఇలా సమాజంలోని అన్ని వర్గాలవాళ్లూ వచ్చి పూర్వాపరాలను పరికించి వెళ్లారు. ఈ దారుణాన్ని గురించి వాళ్లెవరూ ఏమీ రాయకుండానే సంవత్సరం గడిచిపోయింది. వసంతరావును ఇది మరింత కదిలించింది. ఇక స్వయంగా తానే కలం పట్టడానికి పూనుకున్నాడు. ఇంద్రవెల్లి దృశ్యాలే అమితంగా కలవరపరుస్తుండటంతో వాటితోనే 'అడవి' నవలను ఆరంభించారు. ఈ విషయం రచయిత మాటల్లోనే..

'ఇంద్రవెల్లిలో 1981 ఏప్రిల్ ఇరవయ్యో తేదీన సభ జరుపుకోటానికి ప్రభుత్వాన్ని అనుమతి కోరారు. అనుమతి ఎలాగూ లభిస్తుందన్న గట్టి నమ్మకంతో సభకు ఆహ్వానిస్తూ ఊరూరా, పల్లె పల్లెనా పోస్టర్లు అతికించారు. కరపత్రాలు పంచారు. పథకం ప్రకారం పోలీసు బలగాలు వందల సంఖ్యలో ఇంద్రవెల్లి చేరుకున్నాయి.

ఆ రోజు సోమవారం. ఎప్పటిలాగానే ఆ రోజూ ఇంద్రవెల్లిలో అంగడి సాగుతోంది. పల్లె పల్లె నుండి, ఊరూరు నుండి గోండులు వస్తున్నారు. నిషేధాజ్ఞల సంగతి వారికి తెలియదు. అలా వచ్చిన వాళ్ళు సాయంత్రం ఇంద్రవెల్లి సభను చూసి వెళ్దామని గుంపులు గుంపులుగా సభాస్థలికి చేరుతున్నారు. నాలుగు దిక్కుల నుంచీ వస్తున్న జనసందోహం క్షణక్షణం పెరుగుతోంది. పోలీసులు లాఠీలతో రంగప్రవేశం చేశారు. అటకాయించిన కొద్దీ జనం రెచ్చిపోతున్నారు. వందల సంఖ్యలో పోలీసులు, వేల సంఖ్యలో గిరిజనులు. నేల కనిపించనంత జనం. పోలీసులని ఛేదించుకుని సభావేదికవైపు కదిలివ

# పాఠకజన హారతి

ఆదిలాబాద్‌కు చెందిన కమలాదేవి, వెంకట రావు దంపతుల ఏడుగురి సంతానంలో పెద్ద వారైన వసంతరావు దేశపాండే 1973లో 'యువభారతి' కథాసంకలనంతో రచనారంగంలోకి అడుగు పెట్టారు. వృత్తిరీత్యా గణిత ఉపాధ్యాయులైన పాండే కథలు, వ్యాసాలు 'భారతి' తదితర పత్రికలలో ప్రచురితమయ్యాయి.



'అడవి' నవల, 'భూమి గుండ్రంగా ఉండాలి'నవల కూడా 'చతుర'లో ప్రచురితమయ్యాయి. దేశపాండే రచనలన్నీ కన్నడంలోకి అనువదిత మయ్యాయి.

'అడవి' ప్రచురితమైన పదేళ్లకు దానికి సీక్వెల్‌గా పాండే 'ఊరు' నవల రాశారు. అది కూడా పాఠకుల ఆదరణ పొందింది. 'అడవి.. ఊరు' నవలలు రెండూ కన్నడంలోకి అనువదితమై అక్కడి పాఠకుల మన్ననలు పొందాయి. తరువాత ఈ రెండు నవలలు కలిపి 'నక్సలైట్' పేరుతో కన్నడంలోనే మళ్లీ ప్రచురితమయ్యాయి.

'అడవి' నవల 'ది బ్లేజ్ ఆఫ్ ఫారెస్ట్' పేరుతో ఆంగ్లంలోకి కూడా అనువదితమైంది. గిరిజనుల జీవనవేదాలైన 'అడవి.. ఊరు' నవలలకు తెలుగు సాహిత్యంలో శాశ్వత స్థానముందనడంలో సందేహం లేదు.

ఒకటి రెండు సినిమాలకు కూడా 'అడవి' నవల ప్రేరణగా నిలిచింది. సినీ రచయితల జంట ఒకటి 'మీ అడవి నవలను వేదంలా ముందు పెట్టుకుని ఈ సినిమా రాశాం' అని చెప్పారు తప్ప, తన పేరు ఎక్కడా పేర్కొనలేదని వసంతరావు దేశపాండే వాపోయారు. మరో సినిమాలో 'అడవి'లోని సన్నివేశాలను యథాతథంగా వాడుకున్నారని, కనీసం తన పేరైనా టైటిల్స్‌లో వేయలేదని ఆయన ఆవేదన వ్యక్తంచేశారు.

స్తున్నారు. అందరూ తమ బతుకులతో విసిగి వేసారిన వాళ్ళే. ఈ వ్యవస్థ కాలిమడమ కింద నలిగిన వాళ్ళే. ఆ తెగింపుకు కారణం ఈనాటిది కాదు. రెండు మూడు తరాలుగా వాళ్లపై జరుగుతున్న దోపిడి, దౌర్జన్యాలకు విసిగిపోయిన విరుచుకుపడిన ఆక్రందన అది!'

ఇంత రాశాక కథను రచయిత రెండు మూడు తరాలు వెనక్కు మళ్లించారు. ఇక్కడే ప్రణాళికలోని గొప్పదనం తెలుస్తుంది.

'అప్పుడు.. ఈ దేశాన్ని బ్రిటీషువాళ్ళు. తెలంగాణాను నైజాం రాజు పాలిస్తున్నారు' అన్న ఆరంభంతో 'అడవి' కథను అతి సాధారణంగా మొదలుపెట్టారు రచయిత.

రాఘవులన్న వ్యక్తి పొట్టచేత పట్టుకుని వ్యాపారం నిమిత్తం, గుడిహత్నూరు వస్తున్నాడు. అతనికి ఆ ప్రాంతం అసలు తెలియదు. అక్కడి ప్రజలు తెలియరు. అక్కడి భాష రాదు. అతను లారీ దిగింది గుడిహత్నూరు అయినా వెళ్ళాల్సింది ఇంద్రవెల్లి. రాఘవులికి తెలిసింది ఇంద్రవెల్లిలో విఠల్ సావుకారు. ఆయనది అక్కడి చాలా పెద్ద వ్యాపారం. ఆయన రాఘవులకి పెద్దనాయన అవుతాడు.

అలా దిక్కూమొక్కూ లేని రాఘవులు అక్కడికి వచ్చి, పెద్దనాయన సాయంతో ఇంద్రవెల్లికి కొంచెం దూరంలో మరింతగా అడవిలో వున్న పిట్టబొంగారం ఊళ్ళో వ్యాపారం పెట్టాడు. ముందు కంగారుపడినా నెమ్మదిగా నిలదొక్కుకున్నాడు. అక్కడి వాళ్ళని, వాళ్ళ పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. వాళ్ళ అవసరాన్ని, అమాయకత్వాన్ని ఆకళింపు చేసుకున్నాడు.

కొద్ది సంవత్సరాల్లోనే రాఘవులు సావుకారీ అయిపోయాడు. అధికారులని మంచి చేసుకున్నాడు. వాళ్ళకి తాగుడు, తిండి అందేలా చూసుకున్నాడు. కిందామీద వేసి, గోండులు కష్టపడి సాగులోకి తెచ్చుకున్న భూమిని, తన పేరుమీద పట్టా వచ్చేలా చేసుకున్నాడు. సామాన్యుడే ముదిరిపోయి, అమాయకులైన గిరిజనుల పాలిట ఎలా దోపిడీదారుడవుతాడో రాఘవులు కథ చెపుతుంది.

ఆ ఊరివాళ్ళే దేవుబయి, జంగూ. వీళ్ళిద్దరి

## కొత్తగాలి...

**వాన చినుకులు రాలితే**
**పుడమితల్లి పులకరిస్తుంది**
**చిటపట రాగాలు**
**ఆలపిస్తుంది!**

– జి. శ్రీను,
చింతల్, హైదరాబాద్

ఆధారంగానే 'అడవి' కథ ముందుకు నడుస్తుంది. వాళ్ళిద్దరి ప్రేమ, పెళ్ళి, సంసారం, పిల్లలు, భూమి కోసం అహరహం తాపత్రయం, అధికారులు, ఫారెస్టువాళ్ళు, గుత్తేదార్లు.. ఇలా ఎందరో వాళ్ళని పెట్టే హింస.. ఇలా నడిచే కథలో అన్నీ విడివిడి సంఘటనల్లాగే వుంటాయి. కానీ అన్నీ చేరి ఒక సంపూర్ణ చిత్రాన్ని మన కళ్ళ ముందు నిలుపుతాయి. నవలలో వీళ్ళిద్దరూ విడి వ్యక్తుల్లాగే కనిపించినా, ఆ అడవి జీవితానికి ప్రతిబింబం లాంటివాళ్ళు. ఎన్నోవేలమంది జీవితాలకి ప్రతినిధుల్లాంటి వాళ్ళు. వాళ్ళేకాదు, వాళ్ళతో పాటు, ఆ ఊరివాళ్ళు ఎదుర్కొన్న హింస, పక్క ఊరు అల్లిగూడెంలోని దారుణాలు.. ఇలా చెప్పుకుపోతే వందలమంది వేదన, ఎన్నో దుర్మార్గాల సమాహారం 'అడవి'.

దీనికంతటికీ కారణం వీళ్లకి జీవనాధారమైన భూమి మీద చట్టబద్ధమైన అధికారం, హక్కు లేకపోటం. చదువు లేని అమాయకత్వం వల్ల అందరి చేతిలో దోపిడికి గురై మోసపోవటం.

ఇలా ఎంత చెప్పినా ఈ అడవి మనుషుల జీవితాన్ని సమగ్రంగా కళ్ళ ముందు నిలపటం కష్టం. వాళ్ళరోజువారీ జీవితమే ఒక ప్రయాస, ఒక అలసట, ఒక పోరాటం. వాళ్ళకంటూ ఏమీ మిగలని పరిస్థితి తాలూకు దైన్యం. ఇలా దశాబ్దాలు, తరాలు దోపిడీకి, పరమకిరాతక హింసకి గురవుతూ.. ఒక ఆశతోటి, ఆకాంక్షతోటి ఇంద్రవెల్లి సభకి ఎలా చేరారో అద్భుతంగా చిత్రించారు.

ఈ నవలలోని రెండు దృశ్యాలు చాలు, ఎంతటి పాశవికత, అమానుషం అక్కడ నెలకొని ఉందో తెలియటానికి. జంగ్లాత్ వాళ్ళు అంటే, అడవికి సంబంధించిన అధికారులు చిన్నా, పెద్ద తేడా లేకుండా అందరూ గిరిజనుల మీద ఇష్టా రాజ్యంగా, నిరంకుశంగా ప్రవర్తించే వాళ్ళే! అలాంటి వాడే సేరేదార్. మామూలు కట్టకుండా చెట్లు కొట్టారని శ్యామ్‌కొలామ్‌తో పాటు మరికొంతమందిని పట్టుకున్నాడు. అందరిలోకి శ్యామ్‌కొలామ్ ముందుకొచ్చి మాట్లాడాడని సేరేదార్ అతన్ని పశువుని కొట్టినట్టు కొట్టాడు. తాగుడు మత్తుతో అధికారమదంతో వున్న సేరేదార్ కోపం, అహం అప్పటికీ తగ్గలేదు. సేరేదార్ కన్ను శ్యామ్‌కొలామ్ కూతురు మోతే మీద పడింది. ఆ పిల్లకు పద్నాలుగేళ్ళు. ఎలుగ్గొడ్డులా ఆ పిల్లని గదిలోకి లాగాడు.

ఎదురు తిరిగిన జనానికి తుపాకీ ఎక్కుపెట్టారు వాడి తొత్తులు. ఎవరూ కదల్లేనిస్థితి. గదిలో మోతే గోలచేసిం ది.. మొత్తుకుంది. హంటర్‌తో కొట్టి హింసించి, ఆ పసిపిల్లని పశువుకన్నా దారుణంగా చెరిచాడు. ఆ అల్లిగూడెం జనం గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు. సేరేదార్ తరువాత చౌకీదార్, ఆ తరువాత వరసగా జవాన్లందరూ మోతేని తెల్లవార్లూ చెరిచారు. తెల్లారేటప్పటికీ ఆ పిల్ల చచ్చిపోయింది. అంత దారుణం జరిగినా అడిగేవాళ్ళు లేరు.. ఓ కేసులేదు.. ఏ పోలీసూ రాడు!

ఇలాంటి దారుణమే మోస్రంజంగు బావమరిది సోము విషయంలోనూ జరిగింది. సోము పిల్లాడు. కాల్లో కొయ్యముక్క దిగటం వల్ల, జ్వరంతో వున్నాడు. వాడి ఖర్మకాలి ఆ రోజే అమీన్‌సాబ్ ఆ ఊళ్ళోకి వచ్చాడు. వాళ్ళ పెరట్లో వాళ్లకి తెలియకుండానే పెరిగిన ఒకటి రెండు గంజాయి మొక్కల నెపంతో అడివిలో ఎక్కడెక్కడ గంజాయి పెంచుతున్నారో చూపించమని సోముని పెట్టిన హింస అంతా ఇంతా కాదు. ఆ హింస ఎవరినయినా కదిలిస్తుంది.. రాక్షసుడి లాంటి అమీన్‌కి తప్ప.

చదువుతుంటే ఒళ్లు గగుర్పొడిచే ఇలాంటి దారుణాలు ఎన్నెన్నో రచయిత రాశారు. ఏ న్యాయం, చట్టం సహాయపడని ఆ గిరిజనుల అరణ్య రోదన 'అడవి' నవల.

అడవి నవల చదివితే మరో ప్రపంచం లాంటి జీవితం తెలుస్తుంది. ఈ సభ్యసమాజం మధ్య చాలామంది దృష్టికి రాని వ్యవస్థ తెలుస్తుంది.

వ్యాపార రీతికి పూర్తి భిన్నమైన ఇటువంటి నవలకి బహుమతినిచ్చి, గుర్తింపునిచ్చి 'చతుర' సంపాదకవర్గం చేసిన సాహసం కొనియాడదగింది. ©

# చతుర ప్ర.జ.



**పాఠకుల ప్రశ్నలకు ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస డా. కె. రామానుజాచార్య సమాధానాలు**

ప్ర. గాయత్రీ మంత్రాన్ని నిర్దిష్టమైన స్వరంలోనే చదవాలని, ఇష్టమొచ్చిన రీతిలో స్వరాలను మార్చి చదవరాదని అంటున్నారు.. నిజమేనా?

– వానపల్లి వెంకటసత్యగంగరాజు, విశాఖ

జ. గాయత్రీమంత్రమే కాదు, ఏమంత్రమైనా ఇష్టమొచ్చిన రీతిలో ఇష్టమొచ్చినపుడు చదువరాదు. ఏడోయేట ఉపనయనం జరగాలి. గురువు దగ్గర వేదవేదాంగాలు అభ్యసిస్తూ ఉండాలి. అటువంటి వాడికి ఉపనయన సమయంలో గురువుగారు ఉపదేశించేదే గాయత్రీ మంత్రం. ఈ మంత్రోపదేశాన్నే బ్రహ్మోపదేశం అంటారు. గాయత్రీమంత్రోపదేశ ముహూర్తాన్ని బ్రహ్మోపదేశ ముహూర్తమంటారు. ఇవి వేదాలలో ఉంటాయి కాబట్టి వీటిని వేదమంత్రాలు అంటారు. వేదమంత్రాలకు నిర్దిష్టమైన స్వరాలుంటాయి. ఉదాత్త, అనుదాత్త, స్వరితములని. ఒక స్వరం మారితే అర్థం మారుతుంది. ఉదాహరణకు 'ఇంద్ర శత్రుర్వర్ధస్వ' అనే మంత్రమున్నది. దీనికి 'ఇంద్రుని చంపువానిగా పుట్టి పెరుగుము' అని అర్థం ఒక స్వరంతో చదివినపుడు. స్వరం మారితే 'ఇంద్రుడు చంపువానిగా పెరుగుము' అని అర్థం. దితి రాక్షసుల తల్లి. ఇంద్రుడ్ని చంపేవాడు కావాలని యాగం చేయిస్తూ ఆ మంత్రాన్ని అపస్వరంతో హోత ఉచ్చరించడంతో 'ఇంద్రుడు చంపువాడు పుట్టుము' అను అర్థం రావడంతో వృత్రాసురుడు పుట్టాడు. ఇంద్రుని చేతిలో చచ్చాడు. ఏ మంత్రమైనా గురువు వద్ద ఉపదేశం పొంది, బ్రాహ్మీముహూర్తంలో లేచి స్నానసంధ్యాదికాలను ముగించుకొని ఏకాగ్రమైన మనస్సుతో జపించాలి. ఆహారం తీసుకొనక ముందు ప్రాతఃకాలంలో పరిశుద్ధమైన వస్త్రాలతో, పరిశుద్ధమైన ప్రదేశంలో, ఏకాంతంలో, జనబాహుళ్యం లేనిచోట, శబ్దం పెదవులు దాటి బయటకు రాకుండా జపం చేయాలి. మంత్రాన్ని చదువటం కాదు జపించాలి. అప్పుడే నిర్దిష్ట ఫలితాలు కలుగుతాయి. ఇప్పటిలా సినిమా టాకీసులలో, పెళ్లిళ్లలో, ఉత్సవాలలో పాటలలా మంత్రాలను చదివితే ఎలా? ఆ మంత్రం మంత్రత్వాన్ని కోల్పోతుంది. అర్థాన్ని కాక అనర్థాన్ని కలిగిస్తుంది. ఈనాటి కాలంలో జరిగే చాలా అనర్థాలకు ఇలాంటి ప్రవర్తనే కారణం.

ప్ర. 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అని ఎందుకంటారు?

– రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం

జ. అన్నం అంటేనే 'అద్యతే అత్తిచ భూతాని' అని వేదవాక్యం చెపుతోంది. మనచేత తినబడుతుంది. మనను తింటుంది అని అర్థం. మితంగా, హితంగా అయితే మనం తింటాం. మితం తప్పితే 'అజీర్ణే భోజనం విషం' కదా! మనను తింటుంది. అన్నంతోనే అన్ని ప్రాణులు పుడుతున్నాయి. అన్నంతోనే బతుకుతున్నాయి. అన్నంతోనే, అన్నంలోనే లయం చెందుతున్నాయి. మనం కూడా ఇతర ప్రాణులకు అన్నంగా (ఆహారంగా) మారుతున్నాం. ఇంకా 'అన్నమయంహి సౌమ్యమనః' అని వేదం చెబుతోంది. మనం తీసుకునే అన్నమే మన మనసుగా మారుతుంది. సాత్వికాహారం తీసుకుంటే సాత్వికంగా, రాజసం తీసుకుంటే రాజసంగా, తామసాహారం తీసుకుంటే తామసంగా మారుతుంది. పాలు తాగినవాడు, మద్యం తాగినవాడు ఒక తీరుగా ఉండలేరు కదా! మనం తీసుకున్న ఆహారంలో పనికిరాని ఘనభాగం మలంగా, ద్రవభాగం మూత్రంగా మారుతుంది. పనికివచ్చే ఘనభాగం మాంసమవుతుంది. పని




# చతుర ప్ర.జ.3



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉప న్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణన లోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ - 082

కివచ్చే ద్రవభాగం రక్తం గా మారుతుంది. కొంత సారమైన ఆహారం తెల్ల కణాలుగా మారు తాయి. అత్యంత సారవంతమైన ఆరవ భాగం మనసుగా మారుతుంది. ఆ మనసు బుద్ధి నుండి పుట్టింది. అంటే ఆహారసారం బుద్ధిలో చేరుతుంది. మన బుద్ధి, మనసు, శరీరం, అవ యవాలు, ఇంద్రియాలు అన్నీ అన్నం వలన వచ్చినవే!

అన్నమే పరమాత్మ. అన్నమే బుద్ధి. అన్నమే మనసు. ఆ అన్నమును నిలబడి తినరాదు. చెప్పులతో తినరాదు. మాట్లాడుతూ తినరాదు. కోపంతో తినరాదు. కలహిస్తూ, రోదిస్తూ, నిందిస్తూ తినరా దు. భక్తితో, శ్రద్ధతో, ఏకాగ్ర బుద్ధితో, పూజ్యభా వంతో తినాలి. భగవం తుడు ఆదరించాలి. అం దుకే అంటారు 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అని.

ప్ర. రుతువులు తమ తమ గతులు తప్ప కుండా ఉండటానికి యజ్ఞయాగాదులు ఎంతవ రకు తోడ్పతాయి?

**- వెల్మల భాగ్యలక్ష్మి,** పూడూరు

**జ.** రుతువులు అంటే ఏమిటి? వాతావర ణంలో జరిగే పరిణామాలు అన్నిటికీ మూలం వర్షాలు. వర్షాలు బాగా పడితే చలి బాగా ఉంటుంది. చలి బాగా ఉంటే ఎండ బాగా ఉంటుంది. వర్షాలు బాగా పడితే పంటలు బాగుంటాయి. చెట్లు చిగురిస్తాయి. పూలు పూస్తాయి. పిందెలు, కాయలు, పండ్లు, గింజలు అనగా పంటలు పండుతాయి. మంచు బాగా కురుస్తుంది. ఇదంతా జరిగేది, జరిపించేది సూర్యభగవానుడే. ఆయనే సముద్రాదుల నుండి జలం తీసుకుంటాడు. అట్లా సూర్యుడు జలం తీసుకోవాలంటే అతని తేజస్సు మరింతగా పెర గాలి. అందుకే యజ్ఞయాగాలు చేయాలి. అగ్నిలో అర్పించిన ఆహుతి ధూమం ద్వారా సూర్యునిలో చేరుతుంది. దానితో సూర్యునిలో తేజస్సు పెరిగి సముద్రాల నుండి జలం తీసు కుంటాడు. దాన్ని వర్షంగా కురిపిస్తాడు. వృష్టి వలన అన్నం, అన్నం వలన ప్రజలు, ప్రజల వలన జీవనయాత్ర, జీవనయాత్ర వలన వాతా వరణ ప్రభావం.. ఇట్లా క్రమ పద్ధతిలో కాలగతి, రుతుగతులుండాలంటే యజ్ఞయాగాదులు తప్పనిసరి.

ఇప్పుడు ఆ యజ్ఞయాగాదులు లేకనే కాలం రెండు నెలలు ముందు నడుచుచున్నది. మార్చిలో మే నెల ఎండలు, ఆగస్టులో డిసెం బరు చలి.. ఈ అక్రమ కాలం. అక్రమ వ్యవస్థ భగవదరాధనా రూపమైన యజ్ఞయాగాదులు లేకనే అని తెలుసుకోవాలి.

ప్ర. పురాణ విజ్ఞానం ఎంతవరకు అవసరం?

**- పి.వి. సుబ్బారాయుడు,** సికింద్రాబాద్

**జ.** పురాణ విజ్ఞానం మనను మనసుగా తెలు పుతుంది.. నిలుపుతుంది. సకల సృష్టి రహ స్యాలు పురాణాలలో ఉన్నాయి. మానవత్వ విలువలు పురాణాలలో ఉన్నాయి. ఎలా బ్రత కాలో చెప్పేవి పురాణాలు. ఎందుకు బ్రతకాలో చెప్పేవి పురాణాలు. బ్రతుకులో ఏమేం చేయాలో చెప్పేవి పురాణాలు. సకల మనోవి జ్ఞానం పురాణాలలో ఉంది. సాంఘిక జీవనం, వ్యక్తిత్వ విలువలు మనోవిజ్ఞానం పురాణాలలో ఉన్నాయి. క్రమశిక్షణ, కుటుంబ వ్యవస్థ, తల్లి, తండ్రి, గురువు, దైవం, బంధువు, మిత్రుడు, పర

# రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. సృష్టికి మూలం స్త్రీ కదా! అలాంటిది కొన్ని ఆలయాల్లో స్త్రీమూర్తులకు ప్రవేశం లేక పోవడం పురుషుల జాత్యహంకారం కదా? అమ్మలు దర్శించని ఆ గుడులు ఎందుకు?

**– బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్**

జ. ఎవరన్నారు సృష్టికి మూలం స్త్రీ అని? బ్రహ్మ ఏ స్త్రీ కొడుకు? నారదుడు, దక్షుడు, వసిష్ఠుడు, అత్రి, భృగువుల తల్లుల పేర్లు చెప్పగలరా? ఇపుడున్న స్థితిని మాత్రమే చూచి అదే పరమసత్యం అనుకుంటే ఎలా? జాత్యహంకారం, మతాహంకారం, అధికార దర్పం ఇవి మూస పదాలు. ఇప్పటి సమాజం, సంఘం కొన్ని అపార్థాలు, అపోహలతో ఏర్ప రచుకున్న వైషమ్యాలవి. మన పురాణాలు చదవండి! సత్యం తెలుస్తుంది!

భారతీయ వాంగ్మయం స్త్రీని సామ్రాజ్ఞి అని కీర్తించింది. వివాహ సందర్భంలో వరుడు వధువును ఉద్దేశించి 'శిబికే శిర ఆరోహ' అంటాడు.. అంటే భార్యను నెత్తిన ఎక్కి కూర్చోమని చెప్పడం. గృహస్థ ధర్మంలో భార్య, పిల్లలు తిన్న తరువాతనే ఇంటి యజ మాని తినాలి అని ధర్మశాస్త్రం!

భార్య అనుమతి లేనిదే భర్త యేపనీ చేయ రాదని యాజ్ఞవల్క్య స్మృతి చెబుతోంది. భార్య కోరితే అన్ని వ్రతాలు, నియమాలు మాని ఆమెకు సంతానాన్ని ఈయాలి. ఇవన్నీ పురుషాహంకారాలా? దేవాలయ ప్రవేశాలు, నిషేధాల గురించి ఆగమశాస్త్రాలు చెబుతాయి. ఒక్కొక్క ఆలయ ప్రతిష్ఠాదులలోని నియమా లకు అనుగుణంగా ఇవి యేర్పడుతాయి. ఇటు వంటి నియమాలు అన్ని మతాలలోనూ ఉన్నాయి. కానీ వారెవ్వరూ ఈ ప్రశ్న అడ గటం లేదు. మనలోనే ఈ మీమాంసలు, విమర్శలు.

---

స్వర సహకారం, స్వార్థం అంటే, భక్తి అంటే, పుణ్యం అంటే చెప్పేవి పురాణాలు. భర్తను సరైన దారిలో పెట్టేది భార్య. పుత్రుడికి మొదటి గురువు తల్లి. గృహలక్ష్మి భార్య, గృహ నిర్వ హణ తల్లి. మంచి భార్య, గృహ యజమాని, భార్యాభర్తల ఆనుకూల్య జీవనమే సాంఘిక సంక్షేమం. భార్యాభర్తల అనురాగ జీవనమే సమాజ సంక్షేమం. గురుశిష్యుల మధ్య ఉండవ లసిన ప్రీతి, రాజు మంత్రుల మధ్య ఉండవల సిన అవగాహన, ప్రజలకు పాలకులకు మధ్య ఉండవలసిన అవగాహన, ఆరోగ్యం, ఆనందం సుఖం, సంతోషం, మానసిక ప్రశాంతతకు నిదా నాలు పురాణాలు. పురాణాలు సక్రమంగా, శ్రద్ధగా చదివితే జీవనగతీ మారుతుంది. పురా ణాలలోని సూక్తులను ఒక అట్ట మీద వ్రాసుకొని ఇంటి గోడలకు తగిలించుకొని రోజూ చదువు కుంటే అసూయాద్వేషాలు, కామ మోహాలు, ఆవే శకావేశాలు తలెత్తవు. సమాజంలో అసమాన తలు, అసహనాలు తలయెత్తవు. శాంతి సామర స్యాలు నెలకొంటాయి. మానవుని సంపూర్ణ మానవునిగా తీర్చిదిద్దేవి పురాణాలు. అయితే మూల గ్రంథాలే చదవాలి. మధ్యలో తమ ఆలో చనలను, భావజాలాన్ని, వ్యాఖ్యానంగా నింపిన అనువాదాలను చదువరాదు.

ప్ర. శ్రాద్ధకర్మల్లో చేసే పిండప్రదానంలో పిండం ప్రమాణం ఎంత ఉండాలి?

**– కరణం శివానందరావు, కర్నూలు**

జ. ఇది ఆయా కులాలకు అనుగుణంగా ఉంటుంది. కుక్కుటాండ ప్రమాణం, కపిత్థ ప్రమాణం, బిల్వ ఫల ప్రమాణం, మహా ఆమ లక ప్రమాణం - అని పిండ ప్రమాణాన్ని నాలుగు విధాలుగా చెప్తారు. కోడి గ్రుడ్డు అంత ప్రమాణం, వెలగ పండు అంత, మారేడు పండు అంత, రాచ ఉసిరి అంత ప్రమాణం అని శాస్త్రం చెపుతోంది.

ప్ర. పోలాల అమావాస్యనాడు పూజ చేసిన కంద దుంపను పాతితే పెద్ద మొక్క అయింది. ప్రసాదంగా దాన్ని ముక్కలు చేసి పంచవచ్చా? మరోసారి పూజకు ఉపయోగించవచ్చా?

**– తటవర్తి రామకృష్ణ, హైదరాబాద్**

జ. పూజ చేసిన కంద మొక్క అయితే అది భగవంతుడు ఇచ్చిన ప్రసాదం. అది ఒక మహా అదృష్టం. పితృదేవతలు మనపై దయతో మనకు, తమకు ఏర్పరచిన ప్రసాదం. దానిని అందరికీ పంచండి. పూజకూ ఉపయోగించండి. అన్ని శుభాలే కలుగుతాయి. ©

# భామనే.. సత్యభామనే..!

30

'మిక్కీ వైరస్, కిస్ కిస్ కో ప్యార్ కరూ' వంటి కామెడీ థ్రిల్లర్ సినిమాలతో బాలీవుడ్‌లో తన కంటూ ఓ స్థానాన్ని పదిలపరుకుచుకుందా ముద్దుగుమ్మ. బుల్లితెరపై 'బిగ్ బాస్' రియాలిటీ షోతో ప్రేక్షకులకు మరింత దగ్గర అయిందామె. మోడల్‌గా, స్టేజ్ షో యాక్టర్‌గా కెరీర్‌ను ప్రారంభించిన ఆ స్వీడిష్ చిన్నది మరెవరో కాదు.. ఎల్లి అవరమ్. ఆమె ఆరోగ్య, సౌందర్య రహస్యాలు ఆమె మాటల్లోనే..

## సొగసు చూడతరమా...

గ్రీన్ టీతో రోజును ప్రారంభిస్తాను. ఉడకబెట్టిన గుడ్లలోని తెల్లని భాగం, పండ్లు, న్యూట్రిషన్ పౌడర్ అల్పాహారంగా తీసుకుంటాను. మధ్యాహ్న భోజనంలో ఫ్రూట్ సలాడ్, అవకాడో తప్పకుండా ఉంటాయి. రాత్రి భోజనం తక్కువగా ఉండేట్లు చూసుకుంటాను. పప్పు లేదా సూప్‌తో సలాడ్ తప్పనిసరి. ప్రస్తుతం శాకాహారం మాత్రమే తీసుకుంటున్నాను. మాంసాహారంలో చికెన్ లేదా చేపల ఫ్రై అంటే చాలా ఇష్టం.

వ్యాయామం విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటాను. అందం, నాజూకుతనం కోసమనే కాదు, ఫిట్‌నెస్‌కు అది చాలా అవసరం.

ప్రతిరోజూ ఉదయం ఓ గంట సేపు యోగా, రెండుగంటలు గుండెకు సంబంధించిన వ్యాయామం చేస్తాను.

ముఖంలోని చిరునవ్వు అందాన్ని ఇనుమడింపజేస్తుందని నా అభిప్రాయం. అందుకే పెదవులు మృదువుగా ఉండేందుకు ఎపుడూ మాయిశ్చరైజర్ వాడుతుంటాను. రాత్రి పడుకునే ముందు ముఖం కడుక్కుంటాను. దీని వల్ల చర్మ రంధ్రాలు శుభ్రమై మొటిమలు, ఇతర సమస్యలు రాకుండా ఉంటాయి.

జుట్టుకు కెమికల్స్ వాడను. మా పూర్వీకుల నుంచి వాడుతున్న ఆలివ్ ఆయిల్‌నే వాడుతుంటాను. అది జుట్టుకు సహజ అందాన్ని ఇవ్వడమే కాక ఆరోగ్యంగా ఉండేట్లు చేస్తుంది. ఆలివ్ ఆయిల్ గుడ్డులోని పచ్చసొన మిశ్రమం జుట్టుకు

పట్టిస్తాను. పచ్చసొనలో ఉండే ప్రోటీన్లు జుట్టుకు దృఢత్వాన్నిస్తాయి. జుట్టును గట్టిగా అల్లకుండా వదులుగానే ఉంచుకుంటాను.

జుట్టుకే కాదు చర్మానికీ ఆలివ్ ఆయిల్‌ను వాడతాను. మృదుత్వాన్ని, కాంతిని ఇస్తుంది. వంటల్లో కూడా దీన్ని వాడతాం. తేనె, పెరుగు మిశ్రమాన్ని చర్మానికి తరచుగా వాడుతుంటాను.

శరీరానికి విశ్రాంతి చాలా అవసరం. షూటింగ్ సమయాల్లో ఎంత బిజీగా ఉన్నప్పటికీ కాసేపు నిద్రపోతాను. కారు ప్రయాణాన్ని అందుకు ఉపయోగించుకుంటాను.

సేకరణ : సంధ్యారాణి



## జలుబు, దగ్గు.. నివారణ

వాతావరణంలోని మార్పులు జలుబు, దగ్గులను మోసుకొస్తుంటాయి. ఎన్ని బిళ్లలు వేసుకున్నా అవి అంత త్వరగా వదలవు. వంటింటి పదార్థాలతోనే తేలికగా ఉపశమనం పొందే మార్గాలు కొన్ని..

★ పావు స్పూను ఉప్పు, పావు స్పూను షోడా ఉప్పును ఓ కప్పు నీళ్లలో కలిపి రెండు మూడు చుక్కల చొప్పున ముక్కులో వేసుకుంటూ ఉండాలి. ఉప్పుకు బాక్టీరియాతో పోరాడే సహజ గుణముంది.



★ తేనెలో రెండు మూడు టేబుల్ స్పూన్లు నిమ్మరసం కలిపి తాగితే దగ్గు, గొంతులో దురదలు తగ్గుతాయి. తేనె యాంటీ ఆక్సిడెంట్‌గా పనిచేస్తుంది. నిమ్మలోని విటమిన్ సి, ఫైటోకెమికల్స్ రోగనిరోధకశక్తిని పెంచి త్వర గా కోలుకునేట్లు చేస్తాయి. శరీరంలోని హానికర బాక్టీరియా, క్రిములను నాశనం చేస్తాయి.

★ వర్షాకాలంలో ఉష్ణోగ్రతలు ఒక్కసారిగా పడిపోతుండడంతో తరచుగా తలనొప్పి వస్తూంటుంది. దీనికి చక్కని ఉశమనం వెల్లుల్లి టీ. దీనిలోని అల్లిసిన్‌కు యాంటీబాక్టీరియా, యాంటీవైరల్, యాంటీఫంగల్ గుణాలున్నాయి. రెండు వెల్లుల్లి రెబ్బలను చిదిమి కప్పు వేడినీళ్లలో కలుపుకుని తాగితే తలనొప్పి క్షణాల్లో మాయమవుతుంది.

## మహిళా శక్తి

ప్రతి ఒక్కరిలోనూ ఏదో ఒక సామర్థ్యం ఉంటుంది. అవసరమైన చోట ఆ సామర్థ్యాన్ని చూపించే ధైర్యం చేయాలి



– ఎరికా జాంగ్



గతంలో జరిగినదాని గురించి కోపంగా ఉండడం వల్ల ఇపుడు జరుగుతున్నదాని మీద దృష్టి పెట్టడం కష్టం

– బార్బరా డి ఏంజలిస్



# సౌందర్యం

### జుట్టు రాలకుండా ఉండాలంటే..?

★ కొబ్బరినూనెలో ఎండిన ఉసిరికాయలను వేసి నూనె నల్లబడేదాకా వేడిచేయాలి. దానిని గది ఉష్ణోగ్రతకు చల్లార్చి మాడుకు మసాజ్ చేయాలి.

★ పచ్చికొబ్బరి నుంచి పాలు తీసి వాటిని జుట్టుకు, మాడుకు పట్టించి 20 నిమిషాల పాటు ఉంచాలి. తర్వాత మసాజ్ చేసి నీటితో కడిగేయాలి.

★ పెరుగు, నిమ్మరసం జుట్టుకు సహజ కండిషనర్‌గా ఉపయోగపడడమే కాకుండా చుండ్రును నివారిస్తాయి. అంతేకాదు జుట్టు రాలటాన్ని అరికడతాయి. కప్పు పెరుగులో సగం నిమ్మరసం కలిపి జుట్టుకు పట్టించి ముప్పై నిమిషాల పాటు ఎండనివ్వాలి. తర్వాత షాంపూతో తల స్నానం చేయాలి.

★ రెండు టేబుల్‌స్పూన్లు తేనె, అంతే ఆలివ్ ఆయిల్, కొద్దిగా దాల్చినచెక్క పొడి బాగా కలిపి ముద్దగా చేయాలి. దాన్ని జుట్టుకు రాసుకోవడం వల్ల జుట్టు రాలడం తగ్గడమే కాకుండా బాగా పెరుగుతుంది.

★ వారానికి రెండుసార్లు అలోవీరా గుజ్జు రాయడం వల్ల మంచి ఫలితముంటుంది. అలోవీరా గుజ్జును మాడుకు పట్టించి ఓ గంట తర్వాత గోరువెచ్చని నీటితో తలస్నానం చేయాలి.

# టెక్ గురూ!

### హెల్తిఫై మి వెయిట్ లాస్

ఉండాల్సిన దానికన్నా ఎక్కువ బరువుంటే జబ్బులు దరిదాపుల్లోనే ఉన్నట్టు. బరువును నియంత్రించుకోవడం చాలా అవసరం. అందుకు సరైన యాప్ హెల్తిఫై మి వెయిట్ లాస్. దేశీయ ఆహార పదార్థాలను దృష్టిలో పెట్టుకుని ఈ యాప్‌ని రూపొందించారు. అంటే మనం తిన్న ఆహారాన్ని బట్టి వాటిలో ఎన్ని కేలరీలు ఉన్నాయో లెక్కగట్టి తెలుపుతుంది. యాప్‌ని ఇన్‌స్టాల్ చేసుకుని అకౌంటు క్రియేట్ చేసుకోవాలి. తర్వాత మన ఆరోగ్యం, బరువును బట్టి లక్ష్యం సెట్ చేసుకోవాలి. దాని ప్రకారం యాప్ అందించే సూచనలు పాటించాలి. ఫిట్‌నెస్ నిపుణుల సలహాలు, సూచనలు కూడా ఈ యాప్ ద్వారా పొందొచ్చు.





### ఫిట్‌నెస్ అండ్ బాడీబిల్డింగ్

ఆరోగ్యంగా ఉండాలంటే ఫిట్‌నెస్ చాలా అవసరం. ఫిట్‌నెస్‌తో పాటూ శరీర దృఢత్వానికి దోహదపడే యాప్ ఫిట్‌నెస్ అండ్ బాడీబిల్డింగ్. శరీర దారుఢ్యం పెరిగేందుకు అవసరమైన వ్యాయామాలను వీడియోల ద్వారా ఈ యాప్ అందిస్తుంది. టెక్స్ట్, బొమ్మల ద్వారా చక్కగా అర్థమవుతుంది కూడా. శిక్షకులతో పని లేకుండా ఇంట్లోనే వాటిని చూసి చేయొచ్చు. శరీరంలోని కొన్ని ప్రత్యేక కండరాలపై మరింత ప్రభావం చూపే వర్కవుట్స్ కూడా ఇందులో ఉన్నాయి. టైమర్‌ను సెట్ చేసుకుని వీలైనంత సమయాన్నే కేటాయించొచ్చు. క్యాలెండర్‌తో రోజువారీ వ్యాయామాన్ని ట్రాక్ చేయొచ్చు.

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**జి. మమత**

జెడ్. పి. హైస్కూల్, సిద్ధవరం,
రాపూరు, నెల్లూరు జిల్లా
పిన్ : 524 408

## చతురంగం - 64 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 రా | 2 జీ | నా | 3 మూ | | 4 ప్ర | 5 భ | 6 వ | | 7 శో |
| 8 జీ | వా | | 9 ల | జ్జ | | 10 ఏ | ల | 11 క్ష | ణం |
| | 12 త్మ | 13 హా | మ | | 14 మో | త | | ణ | |
| 15 స | | 16 ని | హా | 17 ర | ము | | 18 భ | క్ష | కి |
| 19 రో | 20 గం | | 21 నా | తి | | 22 ని | ద్రా | ణం | |
| 23 జ | న | 24 కు | డు | | 25 యా | దా | ద్రి | | 26 సా |
| ము | | రా | | 27 స | ద | నం | | 28 కే | రా |
| | 29 ఆ | రం | 30 భం | | వ | | 31 ప్ర | | జు |
| 32 కా | కా | | 33 గ | తి | | 34 లా | జ | 35 హో | మం |
| 36 ప్రా | రం | భ | ము | | 37 జు | లై | | 38 దా | త |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి, తూ. గో. జిల్లా, 2. ఎస్. మణిమేగలై, తిరుపతి, 3. పుల్లాపంతుల వెంకటసుబ్బారావు, భీమవరం, 4. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమహేంద్రవరం, 5. జి. సుబ్బరామయ్య, తిరుపతి, 6. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 7. ధరణి పద్మాసన, నల్లకుంట, 8. వి. శ్రీలక్ష్మి, నల్లకుంట, 9. వి. వెంకటసుబ్బారావు, బెంగళూరు, 10. పి. దేవసేనమ్మ, జూబ్లీహిల్స్, 11. పి. శుభ, బంజారాహిల్స్, 12. కన్నెపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 13. నెల్లుట్ల సుదర్శనరావు, హైదరాబాద్, 14. గోగాడ జాహ్నవి, హోస్పేట, కర్ణాటక, 15. ఎస్.వి.ఎస్. భగవానులు, ఒంగోలు, 16. జి. శ్రీలేఖ, తిరుపతి, 17. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 18. ఎ. పూర్ణచంద్రరావు, విశాఖ, 19. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 20. డా. సి. జనార్దనసింగ్, నల్లకుంట, 21. తూములూరు సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 22. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 23. యు. చిట్టిబాబు, న్యూపాల్వంచ, 24. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 25. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 26. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 27. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 28. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 29. ఏకా సావిత్రి, బాపట్ల, 30. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 31. ఎం. తిరుపాలమ్మ, గుంతకల్లు, 32. తవుటి సత్యనారాయణ, గజ్వేల్, 33. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 34. అడపా ధనలక్ష్మి, పర్లాకిమిడి, ఒడిశా, 35. వడ్డీ సుశీల, టెంపుల్ అల్వాల్, 36. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 37. పి. ఉమాకాంతరావు, బర్కత్‌పురా, 38. విస్సాప్రగడ వెంకటసుబ్బారావు, రాజమహేంద్రవరం, 39. పూల రమాదేవి, వనస్థలిపురం, 40. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 41. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 42. కొంపల్లి ప్రభావతి, నరసరావుపేట, 43. పొన్నపల్లి వెంకటప్పయ్య, విజయనగరం, 44. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 45. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 46. దీప్తి ప్రేరణ, బళ్ళారి, 47. గోశికే లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 48. జె. వసంత, ట్రూప్ బజార్, 49. టి. రాంకిషన్, హైదరాబాద్, 50. డా.సి.కె. శాస్త్రి, గుంటూరు, 51. ఎం. నర్సింహులు, వికారాబాద్, 52. గానుగపాటి సరోజినీదేవి, మల్లాపూర్, 53. చిట్యాల శంకరయ్య, వికారాబాద్, 54. చక్రవర్తి మధుసూదనరావు, వికారాబాద్, 55. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 56. మారెడ్డి ప్రభాకర్, కొత్తపేట, 57. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 58. జి. ముత్తుమారన్, చర్లపల్లి, 59. కె. సుబ్రమణ్యాం, అనంతపురం, 60. నోరి శివప్రకాశం, నెల్లూరు, 61. సంజీవిగారి నాగశ్వేత, బెంగళూరు, 62. ఆర్. భారతి, ఎమ్మిగనూరు, 63. తిప్పావఝల తులశమ్మ, ఆనందబాగ్, 64. ఆర్. సాయిపవన్, శ్రీకాకుళం, 65. గండ్లూరి బలరామశాస్త్రి, మల్లాపూర్, 66. దేవగ్రాజు వెంకటనరసింహారావు, చైతన్యపురి, 67. సి.జి.యస్. రావు, ఎ.ఎస్. రావు నగర్, 68. డా.కె. శివభూషణమ్, కర్నూలు, 69. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 70. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 71. పి. సురేఖ, హనుమకొండ, 72. గుఱ్రపు పురుషోత్తము, హనుమకొండ, 73. ఆంధ్ర అచ్యుతరామయ్య, తణుకు, 74. కరిపె రాజ్‌కుమార్, ఖానాపూర్, 75. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 76. ఎన్.వి. రమణి, బంజారాహిల్స్, 77. గానుగపెంట నరసింహులు, బద్వేలు, 78. పక్కి శ్రీదేవి, గంట్యాడ, విజయనగరం జిల్లా, 79. పి. గాయత్రీదేవి, కూకట్‌పల్లి, 80. పి.బి. సీతాదేవి, నరసాపురం, 81. కూనపరెడ్డి సత్యనారాయణ, పెనుగొండ, 82. అడపా రత్నకుమారి, కాకినాడ, 83. సూరి నాగరాజు, బెంగళూరు, 84. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, 85. సౌదామినీ నాగరాజన్, వైజాగ్, 86. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 87. సముద్రాల సంతోష్‌కుమారాచార్య, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 88. అడపా సత్యనారాయణ బాబ్జీ, *(..128లో)*




# బఠానీ మసాలా కూర



**కావలసిన పదార్థాలు :**

| | |
|---|---|
| బఠానీ | - 1 1/2 కప్పులు |
| ఆవాలు | - 1 టీ స్పూను |
| అల్లంవెల్లుల్లి పేస్టు | - 2 టీ స్పూన్లు |
| తరిగిన పచ్చిమిర్చి | - 1 టీ స్పూను |
| తరిగిన ఉల్లిపాయ | - 1 కప్పు |
| కారం | - 1 టీస్పూను |
| పసుపు | - 1/2టీ స్పూను |
| తరిగిన టమాట | - 1 కప్పు |
| తరిగిన కొత్తిమీర | - 1/2 కప్పు |
| గరం మసాలా | - 1 టీస్పూను |
| ధనియాల పొడి | - 1 టీ స్పూను |
| నూనె | - 1 టీ స్పూను |
| ఉప్పు | - తగినంత · |

## తయారుచేసే పద్ధతి

రాత్రంతా నానబెట్టిన బఠానీ ఉడకబెట్టి పక్కన పెట్టుకోవాలి. లోతైన పాన్‌లో నూనె వేసి కాగాక ఆవాలు వేయాలి. అవి చిటపట అనేప్పుడు అల్లంవెల్లుల్లి పేస్టు, పచ్చిమిర్చి ఉలిపాయ ముక్కలు వేసి దోరగా వేయించాలి. తర్వాత దానిలో కారం, పసుపు, ధనియాల పొడి వేసి కలపాలి. తర్వాత టమాట ముక్కలు, ఉప్పు కలిపి రెండు కప్పుల నీరు పోయాలి. రెండు నిమిషాల తర్వాత బఠానీ వేసి ఉడకబెట్టాలి. తర్వాత గరంమసాలా, కొత్తిమీర చల్లి మంటను తీసేయాలి. అంతే.. నోరూరించే బఠానీ మసాలా కూర రెడీ!



# ఆలూ మసాలా పూరీ



**కావలసిన పదార్థాలు :**

* ఉడకబెట్టి ఆలు - 1
* గోధుమ పిండి - 1 కప్పు
* ఇంగువ - 1/4 టీస్పూను
* ధనియాల పొడి - 1/4 టీస్పూను
* పసుపు - 1/4 టీస్పూను
* కారం - 1 / 4 టీస్పూను
* నువ్వులు - 1/4 టీస్పూను
* ఉప్పు - తగినంత
* తరిగిన కొత్తిమీర - కొద్దిగా
* నూనె - వేయించడానికి సరిపడ

**తయారుచేసే పద్ధతి :**

ముందుగా ఉడకబెట్టి చిదిమిన ఆలు, గోధుమ పిండి, ధనియాల పొడి, పసుపు, ఉప్పు, కారం, నువ్వులు, కొత్తిమీర, ఇంగువ, టేబుల్‌స్పూను నూనె వేసి కలపాలి. కొద్దిగా నీళ్లు కలిపి ముద్దగా చేసుకోవాలి. పదినిమిషాల తర్వాత చిన్నచిన్న ముద్దలు చేయాలి. పూరీల పీటకు, కర్రకు కొద్దిగా నూనె రాసి పూరీలు వత్తుకోవాలి. ఇపుడు బాగా కాగిన నూనెలో వేయించాలి. మసాలా పూరీ రెడీ!

## చిట్కాలక్ష్మి



* మైక్రోవేవ్ ఓవెన్‌లో వంట చేస్తున్నపుడు గుండ్రటి గిన్నెలనే వాడాలి. పలకల గిన్నెలు వాడడం వల్ల పాత్రలో అంతటా వేడి సమంగా అందదు.
* ఆలస్యంగా భోజనం చేసినా, విందు భోజనానికి వెళ్లినా భోజనం తర్వాత లవంగం తింటే త్వరగా అరుగుతుంది.
* ఇడ్లీ రవ్వను ఉప్పు వేసి కడిగితే వాసన ఉండదు, ఇడ్లీలు కూడా తెల్లగా ఉంటాయి.

# చతురంగం - 65 ఆధారాలు

## అడ్డం

1. రజనీకాంత్ కొత్త సినిమా (3)
3. హంసలు కావు ... (3)
5. ఏరు (2)
7. చీమ (4)
9. హంస (3)
10. బడలిక (2)
12. అర్జునునికి పరమేశ్వరుడు ఇచ్చిన అస్త్రం - - పతం (2)
13. నాగార్జున ఎవరికి భర్త (4)
14. లాభానికి వ్యతిరేకం (3)
16. వస్తాడు తడబడ్డాడు (3)
18. సోనియాగాంధి అల్లుడు అటునుంచి (2)
20. భేదాలు (3)
22. జ్వరాన్ని కొలిచేది తికమక (5)
23. సంవత్సరం (2)
24. నిలువు 22 మరోరూపంలో (2)
25. చస్తూ 'నారాయణ' అని మోక్షం పొందిన భక్తుడు (5)
26. 'వర్ణాలు' సాధారణ భాషలో (3)
28. దండేనా? మాలేనా? (3)
29. అగస్త్యుని కడుపులో జీర్ణమైన రాక్షసుడు (3)
30. భవనం మరో రూపంలో (3)
32. కథలో ఇవి కావాలంటారు రచయితలు (4)
33. నా రక్తమే నా - - కు పెట్రోలు అన్నాడు ఆర్. నారాయణమూర్తి (2)
34. శంఖం, ఓ ప్రముఖ కార్టూనిస్టు (2)

## నిలువు

1. శేషేంద్రశర్మ సాహితీసైన్యం (4)
2. అక్షరాలను, రాతను ఇలా అంటారు (2)
3. మూర్ఖుడు (4)
4. శీర్షాసనం వేసిన కిస్తీ (2)
5. వారాలు చేసుకొని పొట్టపోసుకునేవాడు (4)
6. ఈటీవీలో బహుళ ప్రేక్షకాదరణ పొందిన ధారావాహికం తోక తెగింది (3)
8. నీరు, తారు వంటివి నిల్వ చేసే పెద్ద డ్రమ్ము (2)
9. తూతూమంత్రంగా చేయడాన్ని ఇలా అంటారు (2)
11. కరవబడినది (2)
13. చిరంజీవి, రమ్యకృష్ణ, రంభల హిట్ మూవీ (6)
15. ప్రచురణకర్తలను ఇలా అంటారు (5)
17. తలకిందులైన 'తడి' (2)
19. అందమైన కన్నులు గల స్త్రీ (3)
21. దమయంతి భర్త (3)
22. అడ్డం 24 మరో రూపంలో (3)
23. శ్రీకృష్ణరాయల తండ్రిగారు దండ నాయకులుగా పనిచేసిన రాజవంశం (5)
25. తిరుమలకు నడకన వెళ్లే దారి (4)
27. అశ్వాలు (3)
28. తల్లిని నాటకీయంగా సంబోధించడం (2)
29. పల్లం (2)
31. శీర్షాసనం వేసిన కండూతి (2)

(125వ పేజీ తరువాయి...)

హైదరాబాద్, 89. ఎస్. హైమారాణి, విజయవాడ, 90. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 91. పారేపల్లి పద్మకుమారి, కేసరపల్లి, కృష్ణా జిల్లా, 92. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 93. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 94. కొల్లూరి సాయిబాబు, ఇంకొల్లు, 95. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్, 96. ఎస్. జయరామ్‌మోహన్, నిజాంపేట, 97. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 98. ఆర్.ఎ.వి. సుబ్బారావు, ఏలూరు, 99. వాసా కృష్ణప్రసాద్, తగరపువలస, విశాఖ జిల్లా, 100. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 101. బి. రామమోహనరావు, దిల్‌సుఖ్‌నగర్, 102. పిశిపాటి శైలజాజానకి, నవులూరు, గుంటూరు జిల్లా, 103. జి. జనార్ధన్‌రెడ్డి, నిజామాబాద్, 104. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్.ఆర్. రావు నగర్, 105. ఎ. స్వరూపరాణి, ఎర్రమంజిల్, 106. యు. నరసింహమూర్తి, లాలాపేట, 107. మండవ రవికుమార్, కొత్తగూడెం, 108. గరికిపాటి సూర్యశ్రీ, కాకినాడ, 109. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు

# చతురంగం - 65

**రూ.150/- బహుమతి** | **గడువు తేది : ఆగస్టు 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 | | ■ | 5 | 6 |
| | ■ | 7 | 8 | | | ■ | 9 | | |
| 10 | 11 | ■ | 12 | | ■ | 13 | | | కి |
| 14 | | 15 | ■ | 16 | 17 | | ■ | | ■ |
| ■ | ■ | 18 | 19 | ■ | 20 | | | ■ | 21 |
| 22 | | | | | ■ | | ■ | 23 | |
| | ■ | 24 | | ■ | 25 | | | ళు | |
| 26 | 27 | | ■ | 28 | | కా | ■ | | ■ |
| ■ | | ■ | 29 | | | ■ | 30 | | 31 తి |
| 32 | | | | ■ | 33 | | ■ | 34 | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (       ) చిరునామా : ------------------------------

------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : చతురంగం **చతుర,** ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532



# క్రైమ్, సస్పెన్స్ ప్రత్యేకం ఆగస్టు విపుల

పాత సామాన్లు పడేసే బేస్‌మెంట్ చీకటిగా ఉంటుంది. ఆటకి అనువైనదని పిల్లలు అక్కడకు వెళ్లారు. అప్పటికే అక్కడ ఓ భయంకర సర్పం పొంచి ఉందని వారి తల్లిదండ్రులకు తెలిసింది.. తర్వాత ఏమైంది? పిల్లలను పాము కాటేసిందా? చదవండి **రాబర్ట్ ఎడ్మండ్** అమెరికా కథ **రాకాసి కొండచిలువ**

■ ఆ ముగ్గురు ఎమ్మెల్యేలు టెన్షనుగా ఓ ఫోన్‌కాల్ కోసం వెయిట్ చేస్తున్నారు. వాళ్ల భవిష్యత్తునే ప్రభావితం చేయగలిగే ఆ ఫోన్‌కాల్ వెనుక కథేంటి? చదవండి **రాజేష్ కుమార్** తమిళ కథ **సత్వరన్యాయం**

■ ఆ రోజు అత్తమాట విని చీకట్లో చేసిన పని ఆమె జీవితానికే పెను శాపమైంది. కూతురు దొంగలా ఆమెను కలుసుకోవాల్సి రావడానికీ కారణమదే! ఇంతకీ ఏమిటది? తెలియాలంటే చదవండి **దీరు బెన్ పటేల్** గుజరాతీ కథ **జవక్**

యథాలాపంగా తాతగారి డైరీని తిరగేస్తున్న గోవర్ధనరావుకు అందులో ఆ రాష్ట్ర ముఖ్యమంత్రికి సంబంధించిన కొన్ని చేదు వాస్తవాలు కన్పించాయి. మర్నాడు సీఎం ఇంటికని బయలుదేరిన గోవర్ధనరావు హటాత్తుగా మాయమయ్యాడు. భర్త అదృశ్యంతో అతని భార్య శోకదేవతే అయిపోయింది.. ఇంతకీ అతడేమయ్యాడు? తెలుగులో డిటెక్టివ్ నవలా సాహిత్యానికి ఆద్యుడైన రచయిత **కొమ్మూరి సాంబశివరావు** **అదృశ్యమైన అనామకుడు** **కథకుల ఫైల్**‌లో..




* కితకితలు పెట్టే **పేరడీ బీరెడీ**
* **జయహో** అని నినదించిన **రింగ రింగారింగరింగారే**.. ఇంకా మరెన్నో!

విపుల


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Ranga Reddy District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# రోజీకి ఎందుకంత హడల్?

చతుర సెప్టెంబరు నెల కానుక

'రాహుల్.. డిన్నర్ చేద్దామా?' కొడుకును అడిగింది రోజీ.
'టెన్ మినిట్స్ మామ్?' అన్నాడు పుస్తకం చదువుతున్న రాహుల్.
ఇంతలో డోర్‌బెల్ మోగడంతో కీహోల్ నుంచి చూసింది..
చేతులు జోడిస్తూ రాబర్ట్!
ప్రశాంతంగా ఉంటున్నామనుకుంటోంటే.. తుపాను హెచ్చరికలా ఇతను వచ్చాడేంటి? మళ్లీ కష్టాలు వస్తున్నాయా? అనుకుంటూ వణికిపోయింది!
తలుపు తీస్తే ఒక తంటా, తీయకపోతే మరో తంటా..
అసలు రాబర్ట్ ఎవరు? రోజీ సందిగ్ధం ఎందుకు?
ఆద్యంతం ఉత్కంఠగా సాగే వాలి హిరణ్మయీదేవి

**చిలుకలు వాలిన చెట్టు**



**బోనస్‌గా...**

* నవల పేరే రచయిత ఇంటిపేరుగా మారిన ఘనత 'రేవు'ది! రచయిత జి.ఎస్. చలాన్ని 'రేవు చలం' అని వ్యవహరిస్తుంటారు. ప్రత్యేకంగా ఓ కులవృత్తికి సంబంధించి తెలుగులో నవలలు అరుదు. రజకుల జీవన విధానాలను, అప్పటి దయనీయ వ్యవస్థను ఆవిష్కరించిన **రేవు**పై సమీక్ష నవలావలోకనంలో!

ఇంకా.. చమత్'కారం', చతుర ప్ర.జ., చతురంగం..

